వందే మాతరం

# స్వామి రామతీర్థ ఉపన్యాసములు



భారతవర్ష సముద్ధరణానికి
= స్వామి యిచ్చిన =
మహోపన్యాసాలు



కేశవతీర్థ
సంపాదకుడు



వి. వి. రత్నశర్మ
గీతామందిరం
ప్రకటన కర్తలు

*Price* **1-8-0** 

ఓం

# సంపాదకీయం

ప్రియసహోదరులారా!

విశ్వకల్యాణ ప్రదాలైన శ్రీ రామతీర్థుల సర్వాంగోపన్యాసాలను ఆంధ్రభాషలో ప్రకటించడమే ఈ ఆశ్రమోద్యమం.

మొట్టమొదట ప్రథమభాగం ప్రకటించాము. తర్వాత 7 భాగాలు ప్రకటించాలని ఉద్దేశించాము. ఇంతలో ప్రపంచ సంగ్రామం దేశంలో అలుముకున్నది. అనేక కష్టాలుపడి 'రామసందేశం' అనే గ్రంథాన్ని ప్రకటించాము.

ఇంతలో దైవానుగ్రహంచేత, ప్రస్తుతము స్వామివారు భారతదేశవిషయమై యిచ్చిన ఉపన్యాస సంపుటాన్ని ప్రకటించండని తమ ఉద్దేశాన్ని తెలుపుతూ, తన్ముద్రణానికి బట్టిన ధనంగూడా పంపారు. ఎలాగో తీవ్రకష్టపరంపరలకు గురిమై ఈ సంపుటాన్ని వెలువరించాము. విశ్వాన్ని పులకరింపజేసిన ఈ రామ పరమహంసల ప్రబోధా లివి! పతితసహోదరోద్ధరణానికి, రాముడు కార్చిన కన్నీ ళ్లివి!

ఈ నవయుగ బోధిసత్త్వుని కరుణాసందేశాన్ని వినండి! ధన్యులుకాండి! ధర్మవీరులందరూ ఈ రామసేవాకార్య మహాయజ్ఞంలో పాల్గొనండి. ఇంతకంటె మీకేమి చెప్పాలి?

ఈ గ్రంథ ప్రచురణలో సంపూర్ణ సహాయం చేసిన శ్రీ భగవత్పాద పేరంటపల్లి స్వామివారికి, అనువాదంలో అనల్ప సహాయంచేసిన మిత్రులకు, నా హృదయ పూర్వక నమస్కారాలు! అదిగాక అన్నివిధాల తోడ్పడిన శ్రీ కిన్నింటి రామారావుగారికి 'నేను' కృతజ్ఞుణ్ణి.

20—11—4 కేశవ.

# శ్రీ రామతీర్థస్వామి

రామతీర్థస్వామి జీవితం ఏమిటి? ఈ ప్రశ్నకు ఒక్కటే జవాబు! బ్రహ్మానంద రసామృతధార - అని! రామతీర్థస్వామి జీవితాన్ని శబ్ద ప్రపంచం చెప్పలేదు. ఆయన కన్నీటితో తడిసిన రావీ నదీ తీర సైకతాలు చెబుతాయి! ఆయన ఓంకారంతో పగిలిపోయిన హిమాలయ గుహాలు ఘోషిస్తాయి! అమావాస్య అంధకారంలో ఏకాంతంగా తపస్సుచేసే తారకల దివ్యసామ ఛందస్సులు ప్రబోధిస్తాయి! బ్రహ్మపురి అరణ్యాల లోని మృగసమూహాలు తెలుపుతాయి!

పంజాబ్ దేశంలో గుజరన్వాలా జిల్లాలో మురళీవాలా గ్రామసరస్సులో ఈ పరమహంస జననం! ఆయన జీవితంలో 1900 సంవత్సరం ప్రధానమైంది. ఆయన ఆసంవత్సరం లోనే బ్రహ్మానంద పథగామి అయినాడు. అరణ్య గర్భాల్లో, ఆకుల గలగలల్లో, అనంత తారాపథంలో ప్రశాంతంగా ప్రవహించే సెలయేళ్ళల్లో గంభీర హిమాచల గుహాభ్యంతరాల్లో రామతీర్థస్వామి అమృతానంద గానమే ప్రతిధ్వనించింది !

అది ప్రాక్పశ్చిమ ఖండాల్లో మారుమ్రోగింది! (1906) తెహరీ గహర్‌వాల్ వద్ద గంగా నదిలో రామతీర్థస్వామి ఒకనాడు స్నానంచేస్తూ మహాశాంతమైన అద్వైత ధామం చేరాడు! గంగానది.........ఓంకారంతో ఘూర్ణిల్లింది!

రామతీర్థస్వామి జీవితం ఆరని అఖండజ్యోతి! బాధామయ జీవనులైన మానవుల కన్నీళ్లు తుడిచిన వస్త్రం! లోకంలో దారిద్ర్యంతో బానిసత్వంతో బాధలతో దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్న అనాథలారా! ప్రియసహోదరులారా! అదిగో శాంతి ! అదే రామతీర్థ వేదాంత ప్రబోధం!

# పరిచయము

(శ్రీ శ్రీ శ్రీ తీర్థపాదశాంతి ప్రికాశ్ మహాశయులు
లక్నో శ్రీ రామతీర్థ ప్రచురణ సంఘాధ్యక్షులు)

రామతీర్థస్వామి పుస్తకాలు చదివేవాళ్ళు ధన్యులు. ఆయన ప్రబోధాలను తెలుసుకున్నవాళ్ళు మరీ ధన్యులు. ఆ ప్రబోధాలను ఇతరులచేత చదివించి, ఆ సారాన్ని ఇతరుల చేత ఆచరింపచేసేవాళ్ళు అంతకన్నా ధన్యులు. ఈ ప్రబోధాలచేత ప్రపంచంలో మారుమూలలనుంచి కూడా, ప్రజలు ఎందుచేత ఆకర్షింపబడుతున్నారు? ఈ ప్రబోధాలను, బోధించిన రామతీర్థస్వామి మనోవాక్కాయ కర్మలచేత వాటిని ఆచరించి చూపారు. యుగయుగాలగా వస్తున్న మానవుల మనోదాస్యాన్ని విముక్తి చేసాడు. సకలప్రపంచములో దివ్యత్వాన్ని చూచాడు. పుట్టింది హిందూదేశములో అయినప్పటికీ ఆయన అన్ని దేశాలకు సంబంధించినవాడు. అమెరికా దేశీయుడు, జపాను దేశీయుడు, పర్షియా దేశీయుడు కాడు. వీటన్నిటికీ మించినవాడు. నేడు ఆయనలో జీవిస్తున్న "క్రైస్టు" ను అమెరికా దేశీయులు చూచారు. బుద్ధాలయంలో ఆయన సన్నిధానంలో జపాన్ దేశీయులు హారతులిచ్చారు. మహమ్మదీయులు "కైరో" లో మసీదువద్ద సభావేదిక మీదనుంచి వస్తున్న ఆయన గంభీర కంఠాన్ని విన్నారు.

అన్ని అభిప్రాయముల వారికీ, ఆయన బోధలలో స్థానం ఉంది. ఆయనబోధలు జీర్ణం చేసుకుంటే......మానవ జీవితపరమావధిని చేరవచ్చు. ఆయనచేసిన మహావిజయంలో

రహస్యం ఇది. అనుభవించని దాన్ని చెప్పేవాడుకాడు! ఒక ప్రమాణానికి దాసులు కావద్దనేవాడు. హృదయంలోనుంచి వచ్చింది మాత్రమేచెప్పేవాడు. ఇతరులకు హృదయంగమంగా చెప్పేవాడు. ఆయనతో ఆయన తత్వాన్ని ఒప్పుకోక పోయి నప్పటికీ, ఆయన హృదయపావిత్ర్యాన్ని చూచి ప్రేమిం చాల్సిందే.

రామతీర్థస్వామి ఇలా చెప్పాడు. "అనుభవించు! అనుభవించు!! సూర్యమండలంలో తారలలో వెలిగిపో తున్న అఖండశక్తి నేనే! నేనే!...అది నేనే!! నీ సత్యమైన ఆత్మను చూడు. ఆ ఆత్మకు సౌందర్యాన్ని అంకితంచెయ్యి! కొద్దిదైన స్వార్థాన్ని, దేహాన్ని, దాటిపో".

ఆయనది మేధస్సుకు సంబంధించిన ఒట్టి మెట్టవేదాంతం కాదు. సకల విశ్వానికీ సంబంధించిన అనుష్ఠాన వేదాంతం. ఆయన, దాన్ని అనుష్ఠాన వేదాంతమనీ - సర్వసామాన్య మహాపథమనీ పిలిచారు.

"ముందుకునడు" "శక్తితో ముందుకునడు" "పరిశ్ర మించుఅజాగ్రత్తలో కుళ్ళిపోవద్దు."

"కర్మను ఆనందించు బండపని చెయ్యవద్దు, మనస్సులో శాంతిపొందు అనుమానంచేత భయపడవద్దు సంఘీకరణం ప్రధానం కాని సంఘాన్ని విభిన్నం చెయ్యడం ప్రధానం కాదు. అనుకూలమైన సంస్కరణం మూఢసాంప్రదాయలను విచ్ఛేదం చెయ్యడం కావాలి. నిజమైన పరితపన ముఖ్యం. చెత్తగా మాట్లాడటం అనవసరం వాస్తవికమైన కవిత్వం

ముఖ్యం. గాలి మేడలుకట్టే పురాణాలు అనవసరం. కార్యాల యొక్క కారణ సంబంధమైన తర్కం ప్రధానం. చనిపోయిన రచయితల ప్రమాణాలు అనవసరం. జీవితవిజ్ఞానం ముఖ్యం. చచ్చిన వాక్యాలు వప్పగించవద్దు.''

ఈ దేశవీరుని ప్రబోధాలు ప్రజాసామాన్యం చేస్తున్నందుకు నేను సంతోషిస్తున్నాను. రామతీర్థస్వామి సోదరుడు 'కేశవరావు' స్వరూపంలో త్రిలిజ్గ ప్రజలకు వైదాంతిక సేవ చేస్తున్నాడు. ఈ ప్రయత్నాలు సఫలమవుతాయిగాక! ఇతర రాష్ట్రాలలోని ప్రజలు దీన్ని అనుసరస్తారుగాక! రామతీర్థస్వామి పుస్తకాలు 'హిందీ'లోకి అనువదింపబడ్డవి. కొన్ని 'ఉరుదు'లోకి 'గుజరాతీ'లోకి తర్జుమా చెయ్యబడ్డవి. రామతీర్థస్వామి పవిత్రభావాలను తర్జుమా చెయ్యాలంటే వాటిని మనం సంపూర్ణంగా జీర్ణం చేసుకోవాలి, మనలోనుంచి ఆధ్యాత్మిక ప్రవాహాలను ప్రవహింపచెయ్యాలి. అప్పుడు కాని మనం లోక సంగ్రహం చెయ్యలేము. అప్పుడు కాని మనం తీర్థులం కాలేము.

ప్రపంచమంతానాశనమైపోతున్నప్పుడు తీర్థులే దాన్ని ఉద్ధరిస్తారు. ఆ ఉద్ధర్తలే రామతీర్థస్వామితో,. "ప్రపంచములో రాజులందరూ నాచదరంగంలో పాచికలు. ప్రపంచములో యుద్ధమూ శాంతి ఈ రెండూ నాకు ఆనందక్రీడలు'' అని గానం చేస్తారు.

[మే 25, 1942 న యిచ్చిన ఆంగ్ల మాతృకకు అనువాదం]

# విషయాలు



# శ్రీ రామతీర్థ స్వామి ఉపన్యాసములు

## హిందూ దేశము యొక్క ప్రస్తుత అవసరాలు

( శాస్తాస్ప్రింగ్, క్యాలిఫోర్నియా. యు. ఎస్. ఏ. )

స్వర్గసుందరమైన హిమబిందుమాలాధారలు వర్షిస్తున్నవి. రాముడి కుటీరానికి వెలుపల హిమవర్షం కురుస్తూ వున్నది. నిజంగా, ఈమహాపర్వతం శాస్తా అన్న పేరును అన్వర్థంచేసుకుంది. ఫ్రెంచిభాషాదృష్టితో శాస్తాఅన్నపదానికి అర్థం పవిత్రం, నిర్మలం, శాంతం. రాముడు పరిణామ సిద్ధాంతాన్ని గుఱించిన ఒక పుస్తకం పూర్తిచేసి అవతలబెట్టాడు.

వైచిత్ర్యంమీాది దురభిమానం ఒక్కొకసారి మానవులను సత్యపథాన్నుంచి తొలగిస్తుంది. ఈ విధమైన దురభిమానంతో అవలోకిస్తే మనకు ఒక విచిత్రమైన దృశ్యం కనబడుతుంది. పరస్పరమైనప్రేమ లేకుండాపోయిందే యీా పవిత్రభూమిలో! మతసంబంధమైన కులకక్షలు శాఖోపశాఖలు పెరిగిపోయి, జాతి సామరస్యాన్ని విధ్వంసనం చేసినవి. అమెరికాలో హిందూదేశంలోకంటె 'కెథాలిసిజం, మెథా

లిజం, ప్రెస్బిటరేనియిజం మొదలైన శాఖోపశాఖలు వున్నప్పటికీ, పరస్పరమానవసామరస్యం నశించలేదు. హిందూదేశంలో మాదిరి అమెరికాలో మతాభిమానం మానవహృదయాన్ని చంపలేదు. హిందూదేశంలో తరతరాలనుంచి మహమ్మదీయులు హిందువులతో కలిసి నివసిస్తూ యున్నారు. కానీ వారికి పొరుగువారైన హిందువులమీదకంటే దక్షిణయూరప్ నివాసులైన తురుష్కుల మీదనే ఎక్కువ సామరస్యం యున్నది. హిందూపితరులకు పుట్టిన పిల్లవాడు క్రైస్తవుడైతే బజారు కుక్కకంటే కొత్తగా కనుపిస్తాడు. మధురలోనున్న వైష్ణవుడు, దక్షిణదేశంలో వున్న వైష్ణవుడి కొరకుస్వపట్టణంలోవున్న వైష్ణవుడితో భేదిస్తాడు. దీనికి కారణం ఏమిటి? అన్నికులాలు, అన్నిశాఖలు యిట్లాగే ద్వేషపూరితమై యున్నవి. ఇదంతా ఒక్కసారిగా ఆలోకిస్తే శత్రువులందరూ కలసి ఒకచోట కలిసి నివసిస్తున్నా రనిపిస్తుంది. జాతియొక్క ఐక్యసామరస్య వినాశనానికికారణం ఏమిటి? ఈ మహావినాశనానికి కారణం మృతమైన పాతవాటిని మూఢంగా పూజించడం. మతం పేరట బోధింపబడిన మేధ్యానికి దాసులు కావడం ఇంకోవిధంగా చెబితే మతదాస్యం పేరట జరిగే ఆత్మహత్య.

ఈ విధమైన దుర్భావాలు వినాశనం కావాలంటే, మార్గం-సమాన విద్యాదానం, పవిత్రమైన విజ్ఞానం, అనుష్ఠాన జిజ్ఞాస, విజ్ఞానశాస్త్రపరిశోధనం (నవీన విజ్ఞాన శాస్త్రపరిశోధనలతో అన్వయింపబడని ఏ మతానికికూడా నిలవడానికి అధి

కారంలేదు). ప్రాచీన కాలంలోని మూఢనమ్మకాలన్నీ, ఆనాటి విజ్ఞానశాస్త్ర సిద్ధాంతాలని రాముని నమ్మకం. ఈ సిద్ధాంతాలు, ముందర నిరాకరింపబడ్డవి. తరువాత ఈ సిద్ధాంతాలకు తల్లియైన స్వేచ్ఛాభావనామాతృదేవత చనిపోయేటంత ఎక్కువ ఉత్సాహంతో ఆచరింపబడ్డవి. మానవుడు, పుట్టీ పుట్టక మునుపే, తను మానవుణ్ణని తెలుసుకోక మునుపే క్రైస్తవుడైనాడు. మహమ్మదీయుడైనాడు. హిందువుడైనాడు. ఈమౌఢ్యం, ఈ మతానుయాయులయొక్క సోమరితనంవల్ల, మూఢంగా మతసిద్ధాంతంగా నమ్మబడింది. వీటిని కనిపెట్టిన జ్ఞానాన్ని మరిచిపోయినారు. మత ప్రవక్తలుకూడా ఆవిధంగానే నమ్మారు. 'క్రైస్తు శెర్మన్ ఆంది మౌంటు'గాని (కొండమీద క్రీస్తు జేసిన బోధలు) వేద యజ్ఞాలుగాని ఈవిధంగానే మరచిపోబడి, వాటి స్థానంలో ఏవో పిచ్చిపేరులు ప్రాముఖ్యానికి వచ్చాయి. జీవదాత్మ చనిపోయిన శవపూజకని తరుమకొట్టబడింది. క్రీస్తు, మహమ్మదు, వ్యాసుడు, శంకరుడు- ఈ ప్రవక్తలందరూ స్వర్గంనుంచి ఒక మహాపవిత్రాగ్నిజ్వాలను దొంగిలించి తెచ్చిన దొంగలు. ప్రకృతి మహాగ్రంథంయొక్క బలహీనమైన, పరిశుష్కితమైన ఛాయలు - వీరు వ్రాసిన పుస్తకాలు. ప్రకృతి మహాగ్రంథాన్ని మరిచిపోయి, దానినీడలైన యీ ప్రవక్తల పుస్తకాలకు ఎక్కువ ప్రాముఖ్యం యివ్వడము వాటిని అవమానించడమే !

ఈ ప్రవక్తల మార్గాలవల్ల, ప్రపంచమహార్థిక విధానానికి ఉపయోగం లేదని రాముడు అనడు. ఒకవిత్తును పెంచ

డానికి దాని రక్షణాశరీరం (Husk) ఎంత వరకు ఉండాలో అంతవరకే ఉండాలె కానీ మొక్క అయిన తరువాత కూడా ఉంటే, అది మొక్కకు జైలు అవుతుంది.

ఈ కారాగార బంధాలు తెంచుకొని, నిరతిశయమైన శాంతిని పొందాలంటే, ప్రతిమానవుడూ, ప్రవక్తలకున్న శక్తి తనకు కూడా జన్మహక్కు అనుకోవాలి. ప్రవక్తలశక్తి మానవాతీతమైన దని మూఢంగా అనుకోకూడదు.

కొంతమంది యిల్లుకట్టి, వారిముందర చూపిస్తేనేగాని, ఆ యింటిస్వరూపాన్ని అర్థం చేసుకోలేరు. ఆ విధంగానే, కొందరు భవిష్యత్తును భావించలేరు. పాతదాన్నే నమ్ముతారు. ఇలాంటివాండ్లు హిందూదేశంలో నశించిపోతున్నారు. అది మంచిదే! రాముని అభిప్రాయంలో, అనుష్ఠాన జీవద్వేదాంతము యొక్క ప్రథమాశయం - మానవులను చాంచల్యాల నుంచి అతీతులను చెయ్యడం-సహజమైన వ్యక్తి గాంభీర్యాన్ని తెలుసుకొనేటట్లు చెయ్యడం-ఐకమత్యం, పరస్పర సామరస్యం, పరస్పరం, ప్రేమసంబంధమైన అనుసంధానం కల్పించడం. సకలదేశాలకు, యీ వేదాంతం అవసరం! ఇండియాకు మరీ అవసరం !!

హిందూదేశపు ప్రస్తుతావసరాలు తీర్చుకోవడానికి, ప్రేమకాంతిని వెదజల్లడానికి సాధనంగా 'జీవితసంస్థ' అనే పేరు గల ఒకసంస్థను నిర్మించ మని, రాముడి ఉద్బోధ.

## సంస్థ స్వరూపం

### మత వేదాన్తం

మతాలయొక్క, భిన్నమతాలయొక్క, భిన్నతత్వాల యొక్క సామరస్యపరిశోధనం ప్రధానంగా జరగాలి. ప్రశాంత మైన సాక్షీలాగా, జడ్జీలాగా విద్యార్థులు సనాతన నవీన మతతత్వ సిద్ధాంతాలను చదువుతారు. ప్రతివిద్యార్థి, తనంతటతానే (అవసరమైనప్పుడు ఆచార్యుల సహాయంతో) మతతత్వ సిద్ధాంతాలు చదివి, సాయంకాలానికి, సభలో దాన్నిగురించి చెప్పడం అవసరం. రాముడి సహాయంతో రాత్రిళ్లు సంస్థలోని వివిధ మతతత్వ సిద్ధాంతాలనుగురించి సంభాషణ జరుగుతుంది. ఈ విధంగా పరస్పర సామరస్యం, ప్రేమ, అభివృద్ధిచెంది లాభకరంగా ఉంటుంది.

ఈ విజ్ఞానసాంఘికసంఘీభావంవల్ల సత్యమైన సంస్కారం. అనంతంగా ప్రబుద్ధ మవుతుంది.

### విజ్ఞానశాస్త్రం

వచ్చిన విద్యార్థులకు ఈ సాంఘిక విద్యావిధాన పద్ధతి రుచిచూపిన తర్వాత, విద్యావిధానంలో 'వృక్షశాస్త్రం' జంతు శాస్త్రం, విద్యుచ్ఛాస్త్రం, భూగర్భశాస్త్రం, రసాయినిక శాస్త్రం, గ్రహగణితశాస్త్రం, యివన్నీ విద్యలో చేర్చబడుతాయి. ఒక గ్రంథాలయం, విజ్ఞానశాస్త్ర పరిశోధనశాల, మొదలైనవి అవసరం.

ఈ విజ్ఞానశాస్త్రంవల్ల ఉపయోగం ఘోరమైన మతమహాధ్యంయొక్క వినాశనం - మానవకర్మను సత్పథంలో పెట్టడం.

ఇక్కడ విజ్ఞానశాస్త్రంకూడా, మతభావంతోనే బోధింప బడుతుంది. ఇక్కడ కళలకూ, శాస్త్రానికి, అన్నింటికీ మూల సూత్రం - అనుష్ఠాన వేదాన్తం! 'అగసీ' అని ఒక గొప్ప ప్రకృతి శాస్త్రవేత్త ఉన్నాడు. అతనికి చర్చి ఎంతపవిత్రమో, పరిశోధనశాలకూడ అంత పవిత్రము. ప్రకృతి శాస్త్రాన్ని గురించి విచారణచేయడం అతనికి భగవంతుణ్ణి భావిస్తున్నట్లే ఉండేది.

పారిశ్రామిక విద్యలు

పారిశ్రామిక విద్యలుకూడా అవసరమైనవి. హిందూ దేశం అనుభవిస్తున్న ప్రస్తుత పారిశ్రామిక మహా దారిద్ర్యాన్నిగురించి నేను చెప్పేది ఏమీ లేదు.

అమెరికాలో, యూరప్‌లో, 'ఏల్', 'హార్వర్డు', 'స్టాండు ఫోర్డు', 'చికాగో' మొదలైన విశ్వవిద్యాలయాలు ప్రభుత్వానికి సంబంధించినవిగావు. వ్యక్తిగతమైనవి. ఇండియాలో యింకా ప్రజలు తమ అవసరాలను చూచుకోకుండా; ప్రభుత్వవిద్యా విధానపద్ధతికే దేవులాడుతున్నారు. ఇది శోచనీయం!

ఈ 'జీవితసంస్థ'లో విజ్ఞానశాస్త్ర సమానభావంతో, ప్రాచీనాచార సంబంధమైన రచనలుగాని, నవీనాచార రచనలుగాని ఆహ్వానింపబడతవి. ఈ 'జీవితసంస్థ' (మఠం) యొక్క ప్రధాన ధర్మమంత్రం 'సత్యం - అంతా సత్యం - సత్యం తప్ప ఏమీ లేదు.'

ఓం! ఓం!! ఓం!!!

[మూతాలో శాంతి ఆశ్రమాధ్యక్షులైన శివగుణాచార్యుల వారికి వ్రాసిన విషయం.]

ఓమ్.

# జాతీయధర్మము

"బహువిధమతములు బహుళసంఘములు
అగణితమార్గంబు లెన్నేని గలవు!
శోకవిశ్వము కోరు, కారుణ్య మొకటె!"

అది సూర్యాస్తమయ సమయం. దీర్ఘనిశ్వాసాలతో, యీ క్రిందిది ఉచ్చరించబడింది. అశ్రుప్రవాహాలతో, యిది వ్రాయబడింది.

ఒకనాడు నేనొక్క కలగంటి నదియె
అప్పుడప్పుడు కానవచ్చుచునుండు
అది అసత్యమొ - సత్యమో నేనెఱుంగ
సూర్యుడు క్రుంగిపోయెడి కాలమందు
నాకండ్లు నీళ్లతో నిండిపోయెడిని
అప్పు డాకలవచ్చు - ఆ కలయందు
నాకు హిందూదేశ మగపడు కనుల!

మెల్లగా సూర్యాస్తమయ మాచునుండె
గాలి నిశ్శబ్ద మాచున్నది - చాల
దూరాన పడమటివైపు సంద్రంబు
గంభీరశాంత ముద్రాంకితం బయ్యె!
మబ్బులాకాశంబు, సాగరోర్మికలు
ప్రకృతి సర్వం బస్తమయసూర్యబింబ
కిరణసహాసహస్రారుణం బయ్యె నపుడు.

నిశ్శబ్దముగ నేను నిలుచుండి కంటి
దుఃఖనేత్రముల ప్రాచీనవైభవము
గతకాలశోకంపు స్మృతి నాయెడంద ఉదయించినది!
నా యౌవ్వనం బింక వచ్చునో తిరిగి!
వచ్చునో మరల నా బాల్యంబునేడు!
నా మన స్సేల, నాచ్ఛాదితం బయ్యె!
అ స్తమయారుణ సూర్యు గాంచగను!

నాలో బ్రవేశించె గతకాల మిపుడు
మృతులు నా దగ్గర నిల్చి యున్నారు
వారి బుగ్గలలోన తిరిగి పుష్పించె
వెచ్చని జీవితజ్యోతి వారలకు
కప్పిన గుడ్డలు విడివడి పోయె-

మంగళకల్యాణ ఘంటల పగిది
వారికంఠములు విన్పించుచు నుండె,
నాకండ్లతో వారి కన్నులు కలసి
అ స్త మించెడి సూర్యు నరయుచు నుండె
ఎన్నిరోజులు కటా గడచిపోయినవి !

ఎన్ని శోకావృతవత్సరాల్ గడచె
ఎంతదూరము నే పరిభ్రమించితిని !
సుఖము నా కింకను రాలే దదేమి !
సూర్యు డ స్తంగతుం డయ్యెడికోలది,

నాకండ్లు చెమరించు - చెమరించునపుడు
కన్నీట నాస్వప్న మగపడుచుండు
ఆకల దుఃఖహిందూదేశ మకట !

ఓ అస్తమయ సూర్యదేవ ! నీవు భారతదేశంలో ఉదయించడానికి పోతున్నావు. దయతో నీ పీ రాముని సందేశాన్ని ఆ దివ్యభూమికి తీసుక పోతావా? ఈ ప్రేమాశ్రుబిందువులు భారతక్షేత్రాలలో, ప్రాతఃకాలపు మంచుబిందువులవుగాక ! శైవుడు శివుణ్ణి ఆరాధించిన విధంగా, వైష్ణవుడు విష్ణువును సేవించిన విధంగా, బౌద్ధుడు బుద్ధుణ్ణి, క్రైస్తవుడు క్రీస్తును, మహమ్మదీయుడు మహమ్మదును సేవించిన మాదిరి, ఉజ్వలమైన పెండ్లి సిగ్గుతోకూడిన హృదయంతో, శైవుడు, వైష్ణవుడు, బౌద్ధుడు, క్రైస్తవుడు, మహమ్మదీయుడు, పార్సీ, శిక్కు, సన్యాసి, హరిజనుడు, లేక యింకా ఏ భారతపుత్రుడి స్వరూపంలోనైనా నేను హిందూదేశాన్ని సందర్శిస్తాను! ఆరాధిస్తాను !! భారతమాత, నా గంగాదేవి, నా కాళీజనని, నా యిష్టదేవత, నా సాలగ్రామము మొదలైన నీ సర్వస్వరూపాలలో నిన్ను పూజిస్తాను. 'అర్చనా విషయాన్ని సంభాషిస్తూ, భారతవర్షంలోని మట్టినిసైతము తినడానికి ప్రేమించిన భగవానుడు అంటాడు:— "నిర్గుణోపాసన చేసేవారి కష్టం గొప్పది. ఎందుకంటే శరీరాభిమానులకు అది చేరడానికి దుస్సాధ్య మైనది'. మంచిది మంచిది మనోహర ! శ్రీకృష్ణా ! ఎవని సర్వసంపదా? - ఒక ముసలిఎద్దూ, చినిగి పోయిన చర్మమూ, ఒక చిన్నపాతగొడ్డలి, బూడిద, పాములు, ఒక

కపాలమూ, ఆ స్వరూపంలో ఉన్న భగవంతుణ్ణి ఆరాధించ డమే నాకు కలుగుగాక! మహిమ్నస్తోత్రంలోని మహా దేవుడా యితడు? కాదు-భారతదేశంలో మలమల మాడుతూ వున్న దరిద్రహైందవరూపంతో వున్న సజీవనారాయణుడు. ఇది నామతం. భారతీయుడి కిది ధర్మమై ఉండాలె. ఇదే సాధా రణమార్గం. అనుభవవేదాన్తం లేక భగవద్భక్తిగా ఉండాలె. పైపై అంగీకారాలుకాదు. ఈ జాతీయ మహాశక్తిని వ్యాపింప చేయడానికి, ప్రతిభారతీయ శిశువునుండీ, నేను క్రియారూపక మైన సహకారాన్ని (Active co-operation) వాంఛిస్తు న్నాను. బాల్యాన్ని దాటంది శిశు వెప్పుడూ యౌవ్వనాన్ని పొందదు. నరనరంలో సర్వజాత్యైక్యత ప్రతిస్పందించినప్పుడు తప్ప, మానవుడు సర్వేశ్వరానుసంధానం పొందలేడు. భార తీయులు, తమలో పరస్పరం అఖిలభారతాన్ని దర్శించి దేశ సేవకు బద్ధకంకణు లవుదురుగాక! హిందూదేశంలో చాలా వరకు, ప్రతినగరమూ, ప్రవాహమూ, కొండ, రాయి, జంతువు చేతనత్వం పొందింపబడి, పావనంగా భావింప బడుతున్నాయి. సర్వమాతృభూమిని దైవంగా పూజించ డానికి, కనబడే ప్రతివస్తువు అందరికి భక్తిప్రేరణం చేయ డానికి, ఇది తగినసమయంకాదా? ప్రాణప్రతిష్ఠవల్ల హిందు వులు దుర్గావిగ్రహంలో, రక్తమాంసాలు సృష్టిస్తారు. అంతకంటే నిజమైన దుర్గ భారతమాతృదేవిలో, మళ్ళీ సహజ ప్రతిభను ఆహ్వానంచేసి అగ్నిని, ప్రాణాన్ని ప్రబుద్ధం చేయడం శ్రేష్ఠముకాదా? ముందర మన హృదయాలు కలువు

కుంటే తలలూ, చేతులూ వాటంతటవే కలుస్తాయి. "మానవుడు తన విశ్వాసాన్ని బట్టే ఒకదాన్ని పొందుతాడు. దేని మీద నమ్మక ముంటుందో అదే అయిపోతున్నాడు". అని నిర్వచించాడు- జగద్యోద్ధప్రవక్త అయిన శ్రీకృష్ణుడు.

ప్రియమైన భారతీయ శాస్త్రాచారపరాయణులారా! సక్రమంగా శాస్త్రాలను ఆచరణలో పెట్టండి. దేశంయొక్క ఆపద్ధర్మం మిమ్మలను కులాచారబంధాలను సడలించం డని తీవ్రసంఘ భేదాలను తృణీకరించండని శాశిస్తున్నది. ఆశ్రయించిన వాళ్లందరికీ సర్వసాహసవంతులకూ, ద్వారాన్ని తెరచి అనేక జాతులను దేశాలను భరించిన భారత దేశం నేడు తనబిడ్డలకే కూడు బెట్టలేని దుస్థితిలో వుండడం మీకు కనబడడంలేదా? తన స్థానాన్ని గుర్తించు కోవడానికి, ప్రతిమానవుడికీ సమానస్వాతంత్ర్యం ఉండాలె. నీతల నీయిష్టం వచ్చినంత ఎత్తున ఉంచుకో; కాని, పాదాలెప్పుడూ నేలమీదనే వుంచు. దుర్బలుడైనా యిష్టపడ్డా యింకొకడి భుజాలమీదా, మెడమీదా ఎప్పుడూ పెట్టవోకు.

సంస్కర్త కాబోయే యువకుడా! భేదించే నూతన శాస్త్రాన్ని పరిచయం చేస్తూ, సనాతనాచారాలను, భారత దేశపు ఆధ్యాత్మికతను నిందించవద్దు. భారతీయులు ఐకమత్యాన్ని పొందలేరు. భారతదేశపు భౌతికపతనానికి, భారత దేశపు మతమూ, ఆధ్యాత్మికత దూష్యాలు కావు. తోటలో దొంగలు పడడానికి కారణం - ముండ్లతీగ - చుట్టూకంప కావాలె. అవి ఏర్పాటు చేయండి. ఆలోచించకుండా మధ్య

ఉన్న గులాబీలు, పండ్లచెట్లూ, సంస్కరణమూ, అభివృద్ధీ అనేపేరుతో పీకివేయకండి! ఓ ధన్యకంటకాల్లారా! కంచెల్లారా! మీరే రక్షణానూత్రాలు! భారతదేశంలో మీతోటే అవసరం ఉన్నది.

నేను శూద్రకృషియొక్క ఘనతను గూర్చి పాడేటప్పుడు, నేను రాజస సత్వగుణాలకంటె తామసానికి గౌరవం ఇవ్వడంలేదు. భారతదేశంలో తామసాన్ని మనం, చాలినంత నిందించాము. దాన్ని అట్లా అవమానంగా తలచడంచేత, అవరోధించడంచేత, మనమధ్య దాన్ని భయంకరంగా వృద్ధి చేశాము అని మాత్రం నే నంటాను. ఈ సమయంలో మనం, తామసత్వాన్ని ఉపయోగించడం నేర్చుకొని,దాన్ని ఆవిధంగా దివ్యం చేద్దాము. మనం, మురికి ఎరువును ఉపయోగించకుండా పారవేస్తే, తోట లేవిధంగా పెరుగుతాయి ?

'తామసత్వం' బాగు. అది లేకపోతే, నిప్పూ ఆవిరి (రాజసత్వం) తేజస్సూ (సత్వం) ఉండనేరదు.

రాద్రిమహాత్యానికీ, ప్రవర్తనలో శక్తికీ, నైతికమైన మేధస్సుకు సంబంధించిన అభివృద్ధి అత్యావసరం. అయినప్పటికీ, మానవుడిలో ఒకగుణమైన తమస్సుయొక్క ప్రభావంకూడా ఉండాలె. తమస్సు ఒక గుణం. రజోగుణం అగ్ని. సత్వగుణం తేజస్సు. తమోగుణం యొక్క వైశాల్యంతోపాటు రజోగుణం యొక్క తీక్షత, సత్వగుణశక్తి జాతిపరిణామంలో ఉంటాయి. అంటే, యీమూడు గుణాలకూ, ఒక సమశృతి ఏర్పడడం.

ఈ దృక్పథం ఆధునిక కపాలసాముద్రిక శాస్త్రంలోకూడా నిర్ణయింపబడింది.

ఈ కారణంచేతనే మహాదేవుడు, విశ్వనాథుడు హిందువులవల్ల తామసాధి (రుద్రుడు) పతిగా వర్ణింపబడ్డారు.

భారతదేశ చరిత్రయొక్క క్లిష్టపరిస్థితుల్లో మనం పుట్టినట్లయితే, యింకా విస్తారమైన సేవచేయడానికి అనుకూలించిన యీ తరుణాలకు మనం కృతజ్ఞులం. మన కర్మ యింకా ఎక్కువ అసమానంగా ఉంటుంది. కావ్యమనోజ్ఞంగా ఉంటుంది. అద్భుతంగా ఉంటుంది. 'బాగా నిద్రపోయినవాండ్లు, బాగా నిద్రలేస్తారు' అనే ఒక సామెత ఉంది. భారతదేశం గాఢనిద్రపోయింది. అందుచేత ఆమె ప్రబుద్ధస్థితి, అతి విశేషంగా వుంటుంది. హైందవ ప్రజానీకంలో మనం ఉద్బోధించవలసింది "విమర్శనకాదు- గుణగ్రహణత్వం- సహోదరభావం, ఐకమత్యజ్ఞానం - సర్వవృత్తుల సామరస్యం - కృషిప్రాముఖ్యత."

ఓహో! ఒకసంఘాన్ని ఇంకొక సంఘం ఊరక విమర్శించడంలో దేశంలో ఎంత అనంతశక్తి వృథాగా వ్యయమైపోయింది! మన మా సామరస్య ముఖ్యాంశాలను గుర్తించడానికి ప్రయత్నించి వాటిని మనలో దృఢీకరిస్తాము గాక! ఆర్యసమాజం అంటే యిష్టమనీ, సనాతన ధర్మం అంటే యిష్టం లేదనే వాండ్లు కొందరు, మరికొందరు బ్రహ్మసమాజం మాత్రమే నచ్చుతుంది - అనీ ఆ విధంగానే వైష్ణవమతం - మొదలైనవాటిని- ఒక్కొక్కదానిని ఒక్కొక్కరు అభిమా

నించే ప్రజలు ఉన్నారు. నామతం యిచ్చే ఆనందాన్ని, బలాన్ని ఒప్పుకోని వాండ్లలో తప్పు ఎన్నడానికి నాకేమి అధికార మున్నది?

అవి రానివ్వండి- పోనివ్వండి. వస్తువులను నేను అలాగే ప్రవహింపనిస్తాను. నీవుగాని, నేనుగాని, అన్యాయాయులను గుత్త గొనడానికి ప్రయత్నించడం దేనికి? ప్రేమించేవాండ్లను, ద్వేషించేవాండ్లను అందరినీ సేవించడం నా హక్కు. తల్లి తన సంతానంలో అందరికంటే బలహీనులను, అల్లరివాండ్లనే ప్రేమిస్తుంది. నీతో భేదించిన వాండ్లందరూ చెడ్డవాండ్లా? అట్లయితే దేశానికి వాండ్లు కూడా అవసరం. ఒక్క కుడికాలి మీదనే ఆధారపడి నడిచేవాడి స్థితి, నిజంగా విచారకరం. వస్తువులను, భగవన్నేత్రాలతో దర్శించడం నేర్చుకోవడమే నిజమైన విద్య.

ఓ ప్రభూ నాదోషముల చూడకోయి!
సమదృష్టి నీవు సంకల్పించితేని
నీ స్పర్శచే నేను విమలుండ నగుదు.

విమలమౌ యమునలో నొక నీటిచుక్క
కుళ్లిన గుంటలోపలి నీటిచుక్క
యీ రెండు గంగలో కలసినయెడల
రెండు సమానపవిత్రంబు లవును.

గుడిలోని విగ్రహం బందలి యినుము
ఒకటి కసాయిహస్తంబున కత్తి

ఈ రెండు స్పర్శవేదిని తాకె నేని
రెండు బంగారమై సమముగా నుండు.

ఓ ప్రభూ! కాన నాదుర్గుణంబులను
చూడకు సర్వసమానుండ వీవు
భవదీయసంకల్పమాత్రంబుచేత
భవదీయమంగళ సంస్పర్శనమున
నే పవిత్రుడ గాన జగదీశ! నాథ!

(ఇది సూరదాసుపాట – సోదరి నివేదిత చేసిన ఆంగ్లాను వాదానికి అనుసరణం) జాతిధర్మం. వ్యక్తిధర్మంకంటే మహో న్నతం – ఈ రెంటికీ సామరస్యమే సౌఖ్యప్రదం.

జాత్యభ్యుదయాన్ని ఉద్దేశించి చేసే ప్రతికార్యమూ, ప్రకృతిసేవ, దేవతాసేవ ఇలాంటి యజ్ఞాన్ని నేడు భారత మాతృదేవికి నివేదించాలె. ఇలాంటి యజ్ఞానికే ఈ రోజుల్లో, యీ క్రింది గీతాశ్లోకము అన్వయిస్తున్నది:—

"యజ్ఞశేషితాన్నమును తినే సజ్జనులు సర్వపాపాల నుండి ముక్తు లవుతున్నారు. కానీ స్వార్థంకొరకు, పొట్టలు నింపుకొనే భక్తిహీనులు పాపాన్నే భుజిస్తున్నారు."

అంటే భగవంతుణ్ణి తెలుసుకొను సన్న్యాసశక్తి కలిగిఉండాలి అంటే సర్వస్వార్థాన్ని పరిత్యజించి, అఖండభారతాత్మతో తాను సమైక్యం పొందడం. భగవంతుణ్ణి లేక బ్రహ్మానందాన్ని పొందడానికి బ్రాహ్మణభావాన్ని కలిగిఉంటు. అంటే జాతీయా

భ్యున్నతికి నీబుద్ధిని అంకితంచెయ్యి! బ్రహ్మానందాన్ని తెలుసుకోడానికి నీకు క్షత్రియభావం ఉండాలి. అంటే అనుక్షణం దేశానికి ప్రాణం అర్పించడానికి సంసిద్ధంగా ఉండడం. భగవంతుణ్ణి తెలుసుకొనుటకు నీకు నిజమైన వైశ్యభావండుండితీరాలి. నీఆస్తికి జాతితరఫున యాజమాన్యం వహించడమే నీకర్తవ్యం కానీ, ఇహంలోగానీ, పరంలోగానీ, బ్రహ్మానందాన్ని రాముణ్ణి తెలుసుకోవాలంటే, మనోమయమైన నీ ఆంతరంగిక ధర్మానికి సజీవమై, స్థూలరూపమైన సత్యాన్ని ఇవ్వడానికి నీవు యీ సన్యాసభావం అనుష్ఠించాలి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వీరత్వం ద్వారా, ఒకప్పుడు పవిత్ర శూద్రసోదరుల పైన నెట్టివేసిన కాయకష్టం, నీ సర్వశరీరాన్ని వినియోగించడమే. సన్యాసభావానికీ హరిజనులకూ పెండ్లిచెయ్యి! నేడు ఇది ఒక్కటే మార్గం! మేలుకోండి! మేలుకోండి!!

ప్రపంచంలోకల్ల బ్రాహ్మణభూమి యైన మనభారత వర్షానికి, పరదేశాలుకూడా తమ అనుభవం ద్వారా యీ రోజు బోధిస్తున్నది యీ ధర్మాన్నే.

ఒకజపానీ యువకుడు, తన తల్లితోకూడిన అవరోధాల చేత, (సంసారిక ధర్మంచేత) సైన్యంలో చేరడానికి ఒప్పుకోనప్పుడు, తల్లి ఆత్మహత్య చేసుకుంటుంది. ఉత్తమ (జాతీయ) ధర్మానికై సామాన్య (సంసారిక) ధర్మాన్ని బలిచేసింది.

ఆదర్శ దివ్యగురువు (గోవిందసింగ్) విషయంలో జాతీయధర్మంకోసం చేసిన వ్యక్తిగత సంసారిక సాంఘిక ధర్మపరిత్యాగంతో ఏ వీరకర్మలు సాటి రాగలవు ?

జనులు శక్తికోసం వాంఛిస్తారు. సర్వజాతి హృదయంతో నీ హృదయం ఐక్యమై నిల్చినప్పుడు నీవు ఆజ్ఞయిస్తే, ఏ అనంతశక్తి నీకు లభ్యంకాదు? ఉపసంహారంలో భావాన్ని యిస్లాము ప్రవక్త మనోహర వచనాలతో నిర్వచిస్తాను.

"నా కుడిచేతిమీద సూర్యుడు, ఎడమ భుజంమీద చంద్రుడూ నిల్చొని, వెనుకకు తిరుగమని ఆజ్ఞ యిస్తున్నా నేను లొంగను."

ఓం ఓం ఓం

---

ఓ౧.

# భారతదేశ సమస్య

[ఈ పత్రం స్వామిరామతీర్థులవారిచే లాహోరు యువజన భారతీయ సభా సాంవత్సరికోత్సవంలో చదవడానికి లాలా హరిదయాళు, యం. ఏ. వారికి పంపబడింది. ప్రాక్పశ్చిమాలలో, ప్రబుద్ధభారతాని కది సామాన్య సందేశంగా చూడబడింది.]

ఐకమత్యం, ఐకమత్యము- ఐకమత్యావశ్యకత అందరికీ తెలుసు. లక్షలకొలది శక్తులు, పరస్పరసంఘర్షణ చేస్తున్నవి. అయితే ఫలితశక్తి లేదు. కోట్లకొలది మేధస్సులు, చేతులూ కొట్టుకపోతున్నవి. నెట్టుకపోతున్నవి. ఎక్కడకో ఎవరు చెప్పగలరు? వేలకొలది సంఘాలు, జాతులు, దేనికది తన కిష్టం వచ్చిన గమ్యస్థానం చేర్చాలని పడవను నడుపుతున్నాయి.

సక్రమంగా నడపడం లేదు! తెప్పు ఎక్కడవున్నవో అక్కడ ఉంచండి. మీ స్థానంలో మీరు ఉండండి. కదలవద్దు. అయితే ఒకే పథంలో పడవను నడపండి. అలాంటి అనుకూల శక్తి నానావిధ సంఘీభావం, అభ్యుదయాన్ని భద్రపరుస్తుంది. ఆ విధంగా, మీమీ స్థానాల్లో పనిచేస్తూ, గానం చెయ్యండి; ముందడుగు వెయ్యండి. జాతీయప్రయోజనం పై విధంగా శాసిస్తున్నది. సర్వుల ప్రయోజనంలో ప్రతివాని వ్యక్తిగత ప్రయోజనం ఉన్నది.

ఆ విధంగా మాట్లాడడం చాలా సులభమే. అయితే, యిన్ని వున్నా ఐకమత్యభావం, సమరసత్వం- భారత దేశంలో యింతకాలం నుంచి లేదు. ఈ విచిత్రం ఏమిటి?

ముఖ్యకారణాలు:—

(1) అనుభవజ్ఞాన శూన్యత.

(2) అత్యధిక జనసంఖ్య.

వాటిని క్రమంగా మనం చర్చిద్దాము.

మహమ్మదీయులు హిందూదేశం పరిపాలించడానికి పూర్వం 'ఖొరాసాను (Khurasan) దేశీయుడైన 'అబ్బెరూని' హిందూదేశమంతా సంచారం చేశాడు. అతడు మంచి తత్త్వవేత్త. గొప్ప విద్వాంసుడు. అతడు సంస్కృతం చదివాడు. ప్లేటో, అరిస్టాటిలు మొదలైనవాండ్ల సిద్ధాంతాలను ఎంత సామర్థ్యంతో పఠించాడో, మన మతగ్రంథాలు కూడా అంత జాగ్రత్తగా చదివాడు. అతడు తాను చూచిన హిందూదేశపు

స్థితిగతులను గూర్చి విపులంగా వ్రాశాడు. హైందవ కవిత్వ తత్వజ్ఞాన జ్యోతిషశాస్త్రాలను గురించి తాను కలుసుకున్న పండితుల జ్ఞానప్రతిభను గూర్చి మిక్కిలి శ్లాఘించాడు. కానీ, సామాన్య ప్రజాసమూహాలయొక్క స్త్రీలయొక్క స్థితి కడు హీనంగా ఉన్నదని వర్ణించాడు. దైహికంగా, మానసికంగా, నైతికంగా, ఇంకా ఆధ్యాత్మికంగా చాలా హీనస్థితిలో ఉన్నారనీ, ఏ విషయంలో బట్టినా వాండ్లు తిరస్కరింపబడి అణగ ద్రొక్కబడ్డారనీ, సాంఘికంగా, మతవిషయకంగా, రాజకీయంగా, భేదభావాలతో, పరస్పర స్పర్ధలతో, దుర్బల శరీరాలతో, ఉన్నారనీ, సంఘీభావశూన్యులై మహమ్మద్ ఘజినీ క్రింద భారతవర్షాన్ని దోచుకోడానికి ఏటేటా వచ్చిన ముస్లిము దండయాత్రికుల ముందు క్రమశిక్షణ లేకపోవడం చేత, ధూళిలాగా ఎగిరిపోతూ వున్నారని వ్రాశాడు. తరువాత, హిందూదేశం మీదికి దండయాత్ర చేసింది బేబరు. బేబరు హిందువులకు వ్యక్తిత్వం, నేర్పు, పారిశ్రామిక విద్యల్లో అభినివేశం, శిల్పం, వనసౌందర్యం, యుద్ధయంత్ర సామగ్రి మొదలైన నాగరికత-లేదని విమర్శిస్తాడు. కలుపు గోలుతనం లేదంటాడు. అతని వ్యక్తిగతాభిప్రాయాలను అతిశయోక్తులనూ తీసివేసిచూస్తే అది అంతగా నిజం అనిపించదు అనుష్ఠానజ్ఞానం లేకపోవడమే హిందూదేశ పతనానికి కారణం. ఈనాటి విదేశచరిత్రకారులు చెప్పేదానిని ఖండించడం కష్టమేమీకాదు. రాముడి కెంతసులభమో అందరికీ అంతేసులభం. చరిత్రకారులు వ్రాశినవన్నీకూడా నిజం. కంటికి ఎదురుగ్గా

కనిపించేవాటిని నేను ఎట్లా కాదనగలను? సాంఘికదురాచా రాలు అనుష్ఠాన విజ్ఞానం లేకపోవడంవల్ల ఏర్పడ్డవి. సాంఘిక దురాచారాలు లెక్కలేకుండా ఉన్నవి. దైహిక పారిశ్రామిక కుల హీనస్థితి, ప్రకృతి విరుద్ధమైన వర్ణశాఖావిభజనం, సముద్ర యాన నిషేధం, బాల్యవివాహం, స్త్రీలను అజ్ఞానాంధకారంలో అణచిపెట్టడం, మొదలైనవెన్నో దురాచారాలు. ఈ సాంఘిక ఘోరం దుర్భరమైంది. సంస్కరణం ఎంతో కష్టం, బర్కిలా అన్నాడు, "సంస్కారాన్ని దూరంగా ఉంచితే ప్రీతికరంగా కనుపిస్తుంది." ఆచారాల్ని బద్దలుచెయ్యడం చాలాకష్టం. ఆచారాన్ని బద్దలుచేస్తే సంఘంలో ఎన్ని అపోహలు, ఎన్ని విమర్శలు, ఎంతకల్లోలం! ఇలా అని ఊరుకోవలసిందేనా? సంఘంపాటికి సంఘాన్ని పోనిచ్చి నీదారి నీవు చూచుకోవల సిందేనా? అథఃపాతాళంలోకి మునిగిపోతున్న సంఘం నిన్ను విడిచిపెడుతుందా? సంఘం మునిగితే నీవూ మునుగుతావు. సంఘం మళ్లీ ప్రబుద్ధమైతే, నీవూ ప్రబుద్ధమాతావు. సరిగ్గా లేని సంఘంలో ఒక్కవ్యక్తి సరిగ్గా ఉంటాడని నమ్మడం మూఢ్యం. దేహంలోకలిసి ఉన్నంతసేపే చేతికిబలం, కోసేస్తే చెయ్యెందుకు?

హిందూదేశంలో యుగయుగాలనుంచీ, అవైదాంతిక మైన మూఢ్యం గడ్డకట్టిపోయింది. జాతిని పీల్చేసింది. భావి భారతనిర్మాతలైన యువకులు భారతభవిష్యద్భాగ్యోదయం మీ భాగ్యోదయమే! పిరికిపందలు అందరూ ఏమంటే, దాన్ని మూఢంగా నమ్ముతారు. నిజమైన జీవత్ప్రాణి ప్రపంచ

మానవ భావరాజ్యాలను పరిపాలిస్తాడు. రాజెవ్వరైనా కావచ్చు. మనోరాజ్యానికి రాజు వేరు బి.ఏ., కావడానికి యం. ఏ., కావడానికి ఆ డిగ్రీలు యూనివర్సిటీనుంచి తీసుకుంటారు కానీ పిరికిపందకావడమో వీరుడుకావడమో మీరే నిర్ణయించుకోవాలి! మీకేం కావాలో కోరుకోండి. జీవితసామ్రాజ్యానికి నిరంకుశ శాసకులౌతారా? జీవితసామ్రాజ్యంలో బానిసలై బ్రతుకుతారా? చరిత్రకు ముఖ్యప్రాణం స్వచ్ఛమైన జీవితం న్యూటను ద్వితీయచలనసిద్ధాంతంలో శక్తినిగురించి యిలా అంటాడు. "శక్తి అది పనిచేసేవస్తువుయొక్క చలనంలో, మార్పుకలిగిస్తుంది" శతాబ్దాలనుంచీ హిందూదేశంలో ప్రకృతి విరుద్ధమైన ద్వేషభావ తమస్సులు, క్రమ్ముకొనియున్నవి. ఆచారాలను మూఢనమ్మకాలను సహించే బానిసత్వం పేరుకపోయింది. యువకులు మీశక్తిచేతనే యీప్రపంచంలో నవ సంచలనం కలిగించండి. మృతత్వంలో జీవితాన్ని స్థాపించండి! పాతదాన్ని జయించండి. క్రొత్తపంథాలు త్రొక్కండి. వస్తువును క్రొత్తనడకలలో పెట్టండి. పనిచెయ్యండి. భూతకాలం వర్తమానంలో, వర్తమానం భవిష్యత్తులో, సంగమించనివ్వండి. ప్రాచీనుల సంప్రదాయం సంపూర్ణంగా విడిచిపెట్టకూడదు. విడిచిపెడితే నాశనంవస్తుంది. అదిఎక్కువగా అనుసరించినా నాశనమేవస్తుంది. ఆ ప్రాచీన సంప్రదాయ మాఢ్యం ఎక్కువైతే సంఘం కుళ్లి చచ్చిపోతుంది. సత్యం, ఐక్యానికి దారితీస్తుంది. అధైర్యపడవద్దు. అందరూ మిమ్మలను విడిచిపెట్టినా భయపడవద్దు. కార్యరంగంలో ఒక్కరు నిల్చునప్ప

టికీ స్థిరంగా ఉండండి. ఇదే పురుషార్థం! ప్రవాహం మీావైపే తరంగాలు మీావైపే వస్తున్నవి. భవిష్యత్తుమీాది సత్యమైన పథాన్ని తప్పవద్దు. సత్యంకోసం ఐక్యమైన యత్నమే జాతిని రక్షిస్తుంది. అంధకారంలో మ్రగ్గుతూయున్న ప్రజలను వెలుగులోకి తెస్తేనేకాని, ఐక్యంచెయ్యలేము. మాాధ్యం, బానిసత్వం ఉన్నంతకాలమూ జాతిలో, సమశ్రుతి ప్రతిధ్వనించదు. అందరూ నావికులు ఐక్యంతో ఉండికూడా తప్పిదారి పట్టితే నావగతిఏమిటి ? అలాగే సత్యపథయాత్రికూడా సత్యమార్గోన్ముఖి కాని పడవ బ్రద్దలుగా పగిలిపోతుంది. మునిగిపోతుంది స్వర్గంలోనే సంయోగం సాధ్యం. ఐక్యం పవిత్ర సత్యంలోనే సాధ్యం. జాతీయైక్యతకు పాటుపడే ఆదర్శజీవనులారా! మీారు ముందు జాతిని అమానుషమైన ఘోరాలనుంచి విముక్తి చెయ్యండి! త్యాగంమీాదనే భవిష్యద్భాగ్య నిర్మాణం ఆధారపడి ఉంటుంది. త్యాగమే జాతియొక్క ఆధ్యాత్మికతను సూచిస్తుంది.

ఆదర్శమైన ప్రవర్తనకు బాధలేదు. ఆదర్శమైన ప్రవర్తనలో ఒక్క శాంతిమాత్రమే వర్షిస్తుంది. ప్రేమకాంతి వర్షిస్తుంది. వెలుగేచూాడలేని ఒక జాతిలో, వెలుగే బాధాకరంగా తోస్తున్న ఒక జాతిలో, బాధావిహీనమైన శాంతి, ప్రబుద్ధ విజ్ఞానజ్యోతి ఐక్యమై ఎలా ఉంటాయి? ఆదర్శమైన ప్రవర్తనను ఆచరించలేకపోతే ఆచరించకపోయినారు. సత్యాన్నైనా ఆచరించండి, అది ముఖ్యం. క్రొద్దిభావాలు కలిగిన గొప్పవాండ్లవల్ల దేశం బలవంతం కాదు. గొప్పభావాలు కలి

గిన కొద్ది వాండ్లవల్ల దేశం వర్ధిల్లుతుంది. శాంతి అంటే ఏమిటి? అనాగరికమైన నిదురమత్తుకూడా శాంతికరమైనది. చీదర పుట్టించే గోరీకూడా శాంతికరమైనది. మనం జీవచ్ఛాంతికి ఆశిస్తాము. ప్రేతశాంతికి ఆశించము. అంధకారంలో ప్రజలు దారితప్పి పడిపోతున్నప్పుడు వెలుగును వారికి చూపించకుండా దాచుకోవడం, వెలుగు లేకపోవడంకంటే హీనమైంది. ప్రజలు చీకటిలో పడిపోతూవున్నప్పుడు, సహాయవాక్కు పలకనివాడు హంతకుడు.

ఇప్పుడు జనాభా విషయాన్ని గురించి ఆలోచిద్దాం రాజకీయ ఆర్థికవేత్తలైన మల్థస్ (Malthus) మొదలైనవాండ్ల అభిప్రాయాలను ఇప్పుడు ఆలోచించనక్కరలేదు. జీవశాస్త్ర బోధను మల్థస్ ప్రతిధ్వనిస్తాడు. అంతే. ప్రకృతిశాస్త్రవేత్త లేమి చెబుతారో చూద్దాం. ఒక సంఘసంస్థను ఒక పెద్ద అడవిలో ఉన్నతోటకు పోలుస్తాడు హాక్స్లే. సాంఘికపరిణామం తోటపనికి సదృశమైంది. కానీ యీ రెండూ మహాప్రకృతి పద్ధతికి లేక బ్రహ్మాండపరిణామ పద్ధతికి విరుద్ధమైనవి. బ్రహ్మాండం, ఎప్పుడూ అనంతంగా, అస్తిత్వంకోసం, పోరాడు తుంది. తోటపనిలాంటి పరిణామం అలాపోరాడదు. పరిస్థితులు మారితే సంఘం మారుతుంది. 'హెన్రిడ్రమ్మండు Henry-drummond) యీ పరిణామాలు రెంటికీ పోలికలు న్వరూ పాలు నిర్ణయించడానికి చాలా పాటుపడ్డాడు. కానీ డార్విన్ హాక్స్లేలను దాటిపోలేదు. ఇతడుచెప్పిన సిద్ధాంతం సామాన్య మైందే. ఈసిద్ధాంతాన్ని ప్రతిసామాన్యవిజ్ఞుడూ ఒప్పుకుంటాడు.

తోటమాలి తోటలో అవసరమైన మొక్కలను పెరగనియ్యకుండా వుంచి తోట పెంపుదలను నిబంధించి నప్పటికీ ప్రకృతి స్వేచ్ఛావిజృంభణంచేత అనవసరమైన మొక్కలు మళ్ళీ పెరగడం, వాటిని ఖండించడం మొదలైన గందరగోళం జరుగుతుంది. ఈవిధంగానే జనాభా అపరిమితంగా పెరిగిపోయినప్పుడు పోరాటాలు సంభవిస్తాయి. శాంతి నశిస్తుంది. బ్రహ్మాండ పరిణామం అపమార్గం పడుతుంది. భగవదాజ్ఞలు మృతాక్షరాలవుతాయి. ఇలాంటి క్లిష్ట సమయాల్లో పతనం వస్తుంది. రోం. గ్రీసూ మొదలైన దేశాల పతనానికి ఈ జనాభా సమస్య కారణంగా ఉంది. ఇండియాలో యీ కష్టం వచ్చింది. దీనికి నివృత్తి మనమేమీ ఆలోచించలేదు. సకల ప్రపంచంలో, యిండియాలో జనాభా ఎక్కువ. ఇండియాలో దారిద్ర్యం ఎక్కువ, ప్రతి సామాన్య హిందూ గృహస్థ జీవనంలో కూడా సకల హైందవజాతిస్థితి ప్రతిబింబిస్తున్నది. ఒకటేఖర్చు అంతులేనిఖర్చు అనవసరమైన అర్థంలేని క్రూరమైన మూఢాచారాలకు మూఢకర్మలకు ఖర్చు. గాడిలో గడ్డి తక్కువైనప్పుడు జంతువు లెక్కువైనప్పుడు పోరాటం రాక మరేమవుతుంది? ఈ బాధలు తీర్చకుండా వృథాబోధలు చెయ్యడం శాంతిబోధను అవమానించడం. నాదేశీయులు అమాయకులు, హృదయంలో శాంతమూర్తులు మాంసం దేహం, వాండ్లు ఎంతమంచివాండ్లైనా, వాండ్లచేతస్వార్థద్వేష కార్యాల చేయిస్తున్నది. హృదయం ఒప్పుకోవడంలేదు. కానీ దేహం బలవంతంగా ద్వేషపూరితుణ్ణి చేస్తున్నది. ఈ జనాభా

సమస్య ఇలాగేఉంటే, తీరకపోతే జాతీయైక్యత ఒక స్వాప్నిక మిధ్య అవుతుంది.

ఈ సమస్య తీరడమో, లేక చావడమో, జీవశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం బాధలతో ఘోరాలతో క్షోభించి పోతున్న సంఘంలో కారుణ్య నిస్వార్థతలకు స్థానంలేదు. మీ చుట్టూ యింత దారిద్ర్యంలో కల్లోలంగా ఉన్నప్పటికీ ప్రేమాభివృద్ధిని గురించి మీరు ఊహించడం - ఆశకు వ్యతిరేకంగా ఆశించడం. పదార్థ విజ్ఞాన శాస్త్రవిద్యార్థులు యీ సిద్ధాంతంలో నమ్మ్రతారు.

ఒకపదార్థము(Matter)యొక్క పదార్థస్వరూపము(Mass)యొక్క అంతస్సమత, దాని ఆంగికాణువులు ఒకదానికొకటి పరస్పరసమ దూరంలో ఉంటేనే నిలుస్తుంది. ఇలా ఉంటేనే తప్ప అణువుల్లో సమఛందోబద్ధమయిన చలనం జరగదు. ఒక అణువు పరిభ్రమించేటప్పుడు ప్రక్క అణువుకు చోటిచ్చి పరిభ్రమిస్తుంది. అప్పుడే సమత నిలుస్తుంది.

ఇప్పుడు హిందూదేశ పదార్థ స్వరూపంఎలావుంది? హిందేశ పదార్థ స్వరూపంలో అణువులు ఒకదాని కొకటి కొట్టుకోకుండా సమత్వ ఛందోబద్ధ పరిభ్రమణం చేస్తున్నవా? ఒకటితింటే పదింటి కడుపుమాడాలి. జాతియొక్క సమతా స్థాపనకు వెంటనే ప్రయత్నించాలి. ఈ ప్రయత్నం చెయ్యకపోతే మళ్ళీ యిండియా పతనమే. విజృంభితప్రకృతిలో నిద్రపోవాలసిందే! మహర్షులైన వశిష్ఠులన్నట్లు దేశం అంటు

వ్యాధుల్లో, కరువులో వినాశకర యుద్ధంలో, భూకంపాల్లో కాలిపోవాల్సిందే. పాపం శాంతించుగాక! నివృత్తి ఏమిటి? బహుముఖాలగా ఉంది.

1. హిందూదేశాన్ని దాటిపోవడం స్వర్గచ్యుతుల్ని చేస్తుందన్న మూఢ అంధకార అభిప్రాయం తొలిగిపోవాలి. చాలామంది హిందువులు పరదేశాలకుపోయి నివాసాలు ఏర్పరుచుకోవాలి. కూపస్థ మండూకంలా యిక్కడనే పడి వుంటే ఏమి సుఖం? మీరు సుందరమైన హిందూదేశాన్ని ఊపిరాడని చీకటికొట్టుగా చేస్తున్నారు.

2. పూర్వం ఆర్యులు సంతానాన్ని ఒక దివ్యప్రసాదంగా చూచుకొనేవారు. ఆ రోజులు పోయినాయి. జనాభా ఎక్కువైన యీ రోజుల్లో యీ పెద్ద పెద్ద సంసారాలు శాపాలు పుత్రులమీద స్వర్గప్రాప్తి ఆధారపడి ఉంది - అనే మూఢాభిప్రాయం కలిగిన కించిద్జ్ఞులు కండ్లు తెరవాలి. చావక ముందే, సంసారాన్ని నరకప్రాయం చేస్తున్నాడన్న జ్ఞానం కలిగించుకోవాలి. భగవద్గీత రెండో అధ్యాయంలో 42, 45 శ్లోకాల్లో యింద్రియభోగాత్మకమైన స్వర్గసౌఖ్యాన్ని ఆశించే వారిని ఖండిస్తూ శ్రీకృష్ణుడు అర్జునుడితో పుత్రులవల్ల మోక్షం వస్తుంది అన్న సిద్ధాంతాన్ని ఖండిస్తూ చెపుతాడు. ఆశ్లోకాలను బఠించి వాటిని స్వాతంత్ర్యాత్మను అర్థం చేసుకోవడం అవసరం. మనలను చాలా కాలాన్నుంచి క్షోభపెడుతున్న కల్మషసూత్రాలను పూడ్చివెయ్యండి! 'పెండ్లి చేసుకో;

అజ్ఞానాంధుడవై పిల్లలను కను, బంధాలలో చావు' అన్న కల్మషసూత్రాన్ని పరిహరించండి. మనం వెనకబడి ఉన్న దానికి మహమ్మదీయులను తిడతాం- బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తిడతాం. విద్యాపద్ధతిని తిడతాం. మన మతాన్ని దూషిస్తాము. కొంతవరకు యివన్నీ సత్యమే. కానీ అసలు దోషం ప్రపంచములోకల్లా అతిపవిత్రమైన వివాహ సంబంధాన్ని కల్మషం చేయడంలో ఉంది. అన్ని సంస్థల్లోకి వివాహసంస్థ అతిపవిత్రమైంది. కానీ దాన్నే అతి అవమానకరంగా దూష్య భావంతో కల్మషం చేస్తాము. హిందూదేశంలో ఇన్ని జాతకాలతో తిథులతో, లగ్నాలతో, మంత్రపుస్తకాలతో, కర్మతటంగాలతో కూడి యున్నప్పటికీ పెళ్ళిళ్ళు అమంగళంగా, అపవిత్రంగా ఉన్నవి. బాల్యవివాహాలు చూచి గ్రహాలు ఓర్చుకోలేవు. పశుత్వంకంటే హీనమైన, అమానుషమైన, ఘోరమైన బాల్యవివాహదృశ్యం చూచి గ్రహాలు వణికి రాలిపోతాయి. వాళ్ళను వాళ్ళు సంరక్షించుకోలేని పసిపిల్లల పెండ్లిండ్లు చూచి వేదపుస్తకాలు పావిత్ర్యాన్ని కోల్పోతాయి. దరిద్రులను శక్తి లేని దోమలను, పుట్టించడానికి చేస్తున్న యీ పెండ్లిండ్ల తుచ్ఛవాసనల్లో పువ్వులు తమ వాసనలు కోలుపోతాయి.

యువకులారా! ఆపండి! ఆపండి! భావిభారతభాగ్య విధాతలారా! ఆపండి! నీతిపేరట, హిందూదేశంపేరట, మీ కోసం, మీ భవిష్యత్ప్రపంచంకోసం. జరుగుతూవున్న యీ

మూఢాంధవివాహాలను ఆపండి. దీనివల్ల ప్రజల్లో పావిత్ర్యం ప్రవహిస్తుంది. ప్రజాసభ్యుల సమస్య తేలుతుంది.

ఈ సలహాలు అసహజమైన వనుకోండి. ఈ సలహాలను అనుసరిస్తే దుర్భిక్షం నశిస్తుంది. మరణం అస్తమిసుంది. అతిశయోక్తి లేదు. సత్యమైన విషయాలు, శుద్ధ సత్యం, యీ మాటల్లో వుంది. ప్రపంచంలో కన్యలుగా ఉన్నప్పుడే విధవలు కావడం కంటే శిశువివాహాలకంటే, అన్యాయం ఘోరం అసహజం యింకేముంటుంది? సూర్యకిరణాలు తగులుతున్న ఏ జాతినైనా అడగండి మీలో మానుషత్వం చచ్చిపోయిందా? మీలో రాక్షసత్వం విజృంభించిందా? మీ కంటి యెదుట అసహజమైన ఘోరమైన అమానుషమైన దుర్భరమైన యీ మూఢాచారాలు, జరుగుతూవుంటే మాన్పరేం? మాన్పకుండా ఎలా విశ్రాంతి తీసుకోగలరు? దీనులైన బాల్యవిధవల పరిశుష్కిత సుకుమార బాహువులు, సహాయంకోసం చాచబడినవి. మీ మూఢాచార కాష్ఠజ్వాలల్లో, జీవిస్తున్న యీ సతులు ఘోరంగా కాలిపోతున్నారు! కన్నీరు రాల్చడంచేత ఎఱ్ఱబడిన అమాయకమైన ఆదీననేత్రాలలో దివ్యత్వం తాండవిస్తున్నది! ఆక్రోశిస్తున్న భవానీదేవిని, మానవుడా! ఎంత కాలం నిరశిస్తావు? నిరశిస్తావా? భవానీదేవి, రుద్రకాళికయై రక్తదాహంతో ప్రళయతాండవం చేస్తుంది! ఆ ప్రళయ తాండవకాళిని చూచి యీ చరాచర జగద్భాండం, వణికిపోతుంది. శాంతి! శాంతి! ఈ రక్తకాళికాతాండవం జరిగేటంతవరకు, శాంతి ఎక్కడిది? యూరప్‌లో తక్కువ జాతికి

చెందిన ప్రజలు త్వరగా పెండ్లి చేసుకుంటారు. కానీ హిందూ స్థానీయు లంత త్వరగా ఎవరూ పెండ్లిచేసుకోరు. ఉత్తమ కుటుంబాలవారు చాలా తక్కువ మంది, ముప్పయి ఏళ్లకు ముందుగా పెండ్లి చేసుకుంటారు. కన్న సంతానం కొద్దైనా బలవంతం కావాలని దీని అభిప్రాయం.

జీవశాస్త్రసిద్ధాంతాల్లో 'హెర్బర్ట్సు స్పెన్సర్' బ్రహ్మాండమైన మానసికాభివృద్ధి ఉన్నప్పుడు, నిస్సారము ఏర్పడుతుంది అంటాడు. ఈ పశుబలంకోసరమని, మనస్సును ఎంతకాలమని అధఃపాతాళానికి తొక్కి ఉంచగలం ? మన శాస్త్రాలప్రకారం గూడా, పావిత్ర్యమే ముఖ్యం. మనశాస్త్రాల్లో బ్రహ్మచర్యం కీర్తించబడింది. బ్రహ్మచర్యంలో ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, బల సంపత్తి ఉంది. స్త్రీ పురుషసంబంధమైన కామశక్తి నిగ్రహించబడినప్పుడు అది ఓజస్సుగా మారుతుందని శాస్త్రవాక్కు.

కామవిజయం అవసరం, కామవిజయం చెయ్యని వాడు పశువు. అతనికి, తన రక్తాన్నే మడకడుతున్నానని తెలియదు. దివ్యమైన యీ కామశక్తిని అవమార్గంలో పెట్టడం చెడ్డచోటులోవుంచిన ధనం లాంటిది. కామాన్ని పశువుతో పోల్చడం దాని నైచ్యాన్ని తెలుపుతుంది. జంతువులు నీచమైనవి. ఈ రక్తపు పోరాటమే ప్రవర్తనకు కళంకాన్ని తెచ్చిపెడుతుంది. కానీ పశువులు అమాయకమైనవి. తప్పని తెలియక తప్పుచేస్తాయి, మానవుడు బుద్ధిమంతుడుకదా మరి. అతను కూడా యిలా తప్పులుచేస్తే యింకేముంది? జంతువులకంటే మరీ మరీ నీచుడుకాడా?

పావిత్ర్యం! పావిత్ర్యం! పావిత్ర్యమే పరమావధి. పరిణామ సంగ్రామ రథచక్రాలక్రిందపడి నలిగిపోతావు - పవిత్రుడివికా! పావిత్ర్యమే ఆశ - అనాగరికుల్లో పరిణామంవల్ల పావిత్ర్యం అభివృద్ధి అయింది. యీనాడు ప్రపంచం స్థితి, మిమ్ములను పావిత్రాన్ని కోరుతున్నది. హిందూదేశ ప్రజలారా! పావిత్ర్యంలేనిదే మీరు బ్రతకలేరు. కష్టమైనాసరే సులభమైనాసరే, పావిత్ర్యం తెచ్చుకోవలసిందే! హిందూదేశం కోసం, మీ దేశాలకోసం, మీ మనస్సులకోసం, మతం కోసం, యిహపర ప్రపంచాలకోసం, పవిత్రులు కాండి! పావిత్ర్యంలేని వీరత్వం లేదు. పావిత్ర్యంలేని ఐక్యం లేదు. పావిత్ర్యంలేని శాంతిలేదు.

విద్య - అమెరికాలో గానీ, ఇంగ్లాండులో గానీ, పాఠశాలలకు పోని సాధారణప్రజలు సహితం, మన దేశంలోని విద్యావంతులకంటె ఎక్కువ జ్ఞానవంతులుగా ఉన్నారు. ఎందువల్ల? వాండ్లవిద్యకు ముఖ్యాధారం చౌకఖరీదుకు వచ్చే దినపత్రికలు. ఇంగ్లండులో, అమెరికాలో, జపానులో విద్యాలయాలకంటే వార్తాపత్రికలే విజ్ఞానాన్ని వ్యాపింపచేస్తవి. మనదేశంలో ఒకస్థితి (Degree) వరకూ విద్యావ్యాపనంచేస్తున్నందుకు, మన ప్రభుత్వానికి యితరసంస్థలకూ మనం నమస్కరిస్తాము. కానీ వాటివల్ల క్రియారూపకంగా ఏమీ జరగడంలేదు. మన ప్రజాసామాన్య అజ్ఞానానికి, స్త్రీలయొక్క అంధకార భయంకరస్థితికి ఎవరినీ నిందించ నవసరం లేదు. మనమే బాధ్యులం. అంతఃకలహాలలో, దుష్కార్యాలలో

యిపుడు వృథాగా వ్యయపరుస్తున్న జీవశక్తిని, స్త్రీసముద్ధరణా ప్రయత్నానికి, ప్రజాసామాన్యానికి విద్యగరపడానికి, మిమ్ము లను మీరు సముద్ధరించుకోవడానికి, జాతిని ప్రబుద్ధం చెయ్యడానికి, వినియోగించండి! ఈ కార్యానికి సులభమైన దగ్గర మార్గం భారతీయ పత్రికాపరిస్థితిని అభివృద్ధిచేయడం నిజంగా ఉపయోగకరమైన పత్రికలు స్థాపించండి. స్త్రీలకూ జన సామాన్యానికి తగిన మాతృభాషల్లో వాటిని అభివృద్ధిపరచండి. బహుశా ఇదివరకే ఒకటి రెండుసార్లు, యీ విధంగా చేసిన కొందరి ప్రయత్నాలు భగ్నమైనవి. ఎందుకంటే సామాన్యంగా పెద్ద తరగతి విద్యార్థులు, మాతృ (దేశీయ) భాషను స్వీకరించడానికి అలక్ష్యం చేస్తారు. మీ మాతృ భాషను గౌరవించడం మీరు నేర్చుకోవాలి! భారతీయ యువజన సంఘము, త్వరలో ఒక పత్రికను, సులభమైన హిందీ - లేక పంజాబీ వాడుక బాషల్లో ప్రారంభిస్తారుగాక, సాధ్యమైనంతవరకూ, పారశీక, సంస్కృత పదాలు వాడకుండా వాడుక భాషలో ఉండాలె. సహజంగా ఉండండి, మీకు తోచినట్లు వ్రాయండి. ఎవరినీ అనుకరించవద్దు. కాలేజీ విద్యార్థులు చిన్న వ్యాసాలు యివ్వవచ్చు. నీవు ఫలించేటప్పుడు వచ్చే ఉత్తమభావాలు, నీమాతృభాషలో వ్రాయడానికి తరచుగా ప్రయత్నించడం, మీ కంటే పాఠకులకు ఎక్కువ లాభప్రదమని యితర్లనుకున్నా పాఠకులకంటె మీకే ఎక్కువ లాభప్రదం. ఈ కార్యానికి నిన్ను అలసటపెట్టే వివరాలేమీ లేకుండుగాక! మొదటి

సంచికను హిందీభాషలో ప్రథమంలో అక్షరాలు, తరువాత మాటలు, తరువాత వాక్యాలు, కథలు, చివరకు వ్యాసాలు, వాండ్లంతట వాండ్లు చదివి అర్థంచేసుకొనేలాగా స్త్రీలనిమిత్తం తక్కువజాతులనిమిత్తం క్రమవికాసప్రదంగా నడపాలి. చదువు రాని అక్కచెల్లెండ్లకు, తల్లులకు, భార్యలకు, కుమార్తెలకు యింకా యితర స్త్రీబాంధవులకూ చదువడం, వ్రాయడం నేర్పండి. ప్రభుత్వ పాఠశాలావిధానాలకోసం వేచియుండ వద్దు. ఈ పవిత్రయాజమాన్యం మీభుజాలమీద ఉన్నది. భారతదేశం జీవించాలంటే, స్త్రీవిద్య తప్పక బహుళంగా వ్యాప్తం కావాలె. అలాంటి సమయంలో యీ కార్యం మీరెందుకు పూనకూడదు? దేశంలో ఒక్కస్త్రీ కూడా, దరిద్రుడు కూడా బీరుపోకుండా, విద్యావిహీనంగా ఉండ కుండా చూడండి. దేశముఖంమీద ఉన్న యీ మచ్చను తుడిచివెయ్యండి. నీపొరుగున కడజాతి స్త్రీకి ప్రబోధించడానికి నీవు సిగ్గుపడ్డావా? భయపడ్డావా? ఛీఛీ! అయితే నీ ప్రవర్తనలూ, నీతులూ నిష్ప్రయోజనాలు! పేదవాండ్ల దగ్గరికి, అజ్ఞాన ప్రజాసమూహాల చెంతకూ మాతృకారుణ్యంతో, ప్రేమతో పోయి, వాండ్లకు విద్య నేర్పండి, ఎంత దివ్యకార్యం! క్రమంగా ప్రాథమిక పదార్థ విజ్ఞాన శాస్త్రం, (physics), జంతు దేహధర్మశాస్త్రం, (physiology), జ్యోతిషశాస్త్రము (Astromony), దేశచరిత్ర (History), ఆర్థికశాస్త్రము (political economy), మనస్తత్వ శాస్త్రము (psychology), మొదలైన వాటిమీద నీవు వాండ్లకు ఎలాచెబితే బాగుంటుందో

ఆ విధంగా సులభంగా పాఠాలు చెప్పు. క్రమక్రమంగా శైలి ఎక్కువ శ్రేష్ఠంగా ఉంటుంది. రాముడు పత్రికకు హిందీ అక్షరాలనే ఉపయోగించడంటాడు. ఎందుకంటే, భారత భాషలో, హిందీ సుందరస్థానం వహిస్తుంది. స్త్రీలకు, దరిద్రులకు విద్యనేర్పడం, నీ ప్రధానవిధి. ఆ కార్యంలో నీవు మగ్నుడవు కావాలె. మునిగిపోవాలె. అయితే మరిచిపోవాకండి. ఇంకోముఖ్యమైన, అవశ్యమైన పనివున్నది. బాగా అభివృద్ధిలోవున్న పరదేశాల్లో, వ్యవసాయకళలు, పరిశ్రమలు నేర్చుకొని, ఆ ఉపయోగకరమైన విజ్ఞానాన్ని భారతదేశంలో వ్యాపింపచేయాలి. వెదచల్లాలె.

మతం——ఈ రచన మీ ఓర్పును పరీక్షచేస్తున్నదా ? మీకు వింటానికి విసుకుపుడుతున్నదా ? కానీ రాముడు మీకు చెప్పవలసిందంతా చెప్పిగానీ ఊరుకోడు. ఓ వివాహ స్వాగత కుమారులారా ! మీరు మీ విధులు నిర్వర్తించుకోను వెళ్లాలా? వెళ్లాలసివుండవచ్చు- కానీ యీ ప్రాచీన మారినర్ తను ఎందుకైతో పుట్టాడో అది చెప్పకుండా వదలిపెట్టడు. రామ సందేశాన్ని వింటందప్ప ప్రధానధర్మం ఏమీలేదు.

గృహస్థ సాంఘిక జాతీయ విధులన్నీ కర్మకాండ- అంధకారంలో తేజోమయమైన కార్యాలు జరుగవు. అంధకారంలో అజ్ఞానవిధులే చేస్తారు. విశ్వాసజ్యోతిలేకుండా, హృదయంలో విజ్ఞానజ్యోతిని ప్రజ్వలింపజేసుకోకుండా, ఒక్క అడుగైనా ముందరకు వెళ్లలేరు. ప్రతిరోజూ, చెవులకు వినిపించే, అనేక ప్రాపంచిక విషయాలు, దేహంవంటివి. ఆత్మలేకుండా దేహం

నిలువదు. విజయోద్యమం యొక్క ప్రాణం, జీవద్విశ్వాసం; ఉజ్జ్వలజ్ఞానం, భౌతికవాదం, సంశయవాదం, విశ్వవాదం, నాస్తిక వాదం, వీటిని ప్రతిపాదించిన వాండ్ల గెలుపునకు మరణం, వాండ్లకు తెలేకుండానే వాండ్లల్లో ఉన్న మతచైతన్యమే! కొన్ని కొన్ని విషయాల్లో, వారు మతాచార్యులకంటే ఎక్కువ మతాన్నే జీవించారు. ఇది చూడండి. రబ్బరు ఫాక్టరీ, వేన వేలమందికి, నిరుద్యోగులకు ఉద్యోగం యిస్తుంది. జాతీయ వ్యాపారం అభివృద్ధిచేస్తుంది. జాతిధనాన్ని ఎక్కువచేస్తుంది. దరిద్రశ్రామికులను పైకి తీసుకవస్తుంది. స్త్రీమరుకంపెనీలకు లాభంకలుగుతుంది. రైల్వే ఉద్యోగులకు పోస్టాఫీసులకు పని యిస్తుంది. అయినా యిదంతా ఎలాజరుగుతుంది. ఒక్క రసాయనిక సమీకరణం లేకుండా, ఒక అదృశ్యాంతర ప్రతిచలనం లేకుండా, యిదంతా ఎలాజరుగుతుంది? అలాగే, మీ గృహస్థసాంఘిక రాజకీయ, యత్నాలుకూడా, అంతఃప్రతిచలనం మీద, హృదయ పరివర్తనంమీద, మానసిక సంస్కరణంమీదా, ఆధ్యాత్మిక సమీకరణంమీదా, అంతరాత్మలో భగవద్విప్లవం మీద ఆధారపడి వుంటాయి. 'విశ్వాసంగొప్పది. జీవితాన్నియిస్తుంది' అంటాడు కార్లాయిల్. నమ్మకంచేతనే జాతిచరిత్ర ఫలిస్తుంది. జాతిచరిత్ర ఉన్నతమవుతుంది. అరబ్బులు, మహమ్మదు జన్మావకాశాన్ని చూస్తే - నిరామయమైన అంధకారంలో అజ్ఞాతమైన ఎడారిలో వెలుగుచుక్క రాలినట్లుంటుంది. ఆ యెడారి యిసుకలే ఫలించాయి స్వర్గీయమైనవి. 'అల్లాహో అక్బర్' భగవంతు డొక్కడే గొప్పవాడు!

నిజంగా గొప్పది ప్రతిదీ - అంతరాంతరాల్లోనుంచి, జన్మిస్తుంది. భగవద్భావంలో నివసించేవాడిదే సంపూర్ణ జీవితం. ఇతర్లది ఎంతలౌకిక భాగ్యంలో తులతూగుతూ ఉన్నప్పటికి, జీవితంకాదు; చావు.

'స్పెన్సర్' ఒక పుస్తకం వ్రాశాడు. అది అతని చివర పుస్తకం 'హంసయొక్క అంత్యగీతము' వంటిది. ఆపుస్తకంలో 'హాక్లే' ప్రయోగాన్ని (Experement)గురించిచెబుతూ ఇలా అన్నాడు. 'భావవ్యక్త స్థితియొక్క స్వరూపంలో అనుతాపం ఉంటుంది. దానిదేహం మాత్రం మేధస్సు. మనస్సునుగురించి మాట్లాడుతూ, మనం ముఖ్యంగా మఱచిపోయే ప్రధాన మనోభావం' ఉద్రేకం. ఉద్రేకం ప్రభువు, మేధస్సు దాసుడు, ఉద్రేకం సామాన్యంగా హృదయగతం అంటారు. హృదయం విశ్వాసానికి, మతానికి చోటు. ఉద్రేకమే పనులను చేయిస్తుంది. స్పెన్సరిలా అంటాడు; 'హృదయాన్ని పెంచకుండా, మేధస్సును పెంచితే ఎక్కువ పనిజరగదు! ఈ యుగంలో మహామనస్తత్వవేత్త అయిన ప్రొఫెసర్ జేమ్సు, యిలా అంటాడు. 'ఇంద్రియ సాధ్యమైన అనుభూతుల మాదిరే, మతానుభూతికూడా సత్యమైంది. తర్కఫలితాలకంటేకూడా, మతానుభూతి ఎక్కువ సత్యమైంది." ప్రకృతి అంతరాంతరాల్లో, జీవించు అగాధమైన అంతస్తత్వాన్ని ధ్వనింపచెయ్యి! అంతస్సత్యాన్ని కనుక్కో! సత్యమే ప్రకృతియొక్క అంతస్సత్యం నీలో తత్త్వమసి మూర్తీభవిస్తుంది.

(1) నాకు చోటివ్వగా నొక ప్రక్కకొదుగు
సకల ప్రపంచంబు సంభ్రమంబునను
చండ తేజంబేను చనుదెంచుచుంటి
నీడలు భయమొంది పారిపోవలయు.

(2) ఓపర్వత శ్రేణులార జాగ్రత్త
నామార్గమున కడ్డురావద్దు మీరు
ఈనాడు మీ శిఖరాగ్రంబులెల్ల
పొడిపొడి గావింపబడును జాగ్రత్త.

(3) ఓరాజులార ! సేనాపతులార !
నా ఆటవస్తువులార ! ఇచ్చోట
ఉన్నదొక్క మహోగ్ర దావానలంబు
పసిబాలులార ! మార్గంబునలెండు.

(4) విధులను దేవతా సముదయంబులను
బంధింతు నామహారథ రాజమునకు
మేఘగర్జా శతఘ్ని రవంబులను
ప్రకటింతు దాని దిక్సీమాంతరముల.

(5) ఛేదించు ఛేదించు మాయావనికల,
మేలుకో! మేలుకో! ముక్తినిపొందు
స్వేచ్ఛ! మహాస్వేచ్ఛ! నిర్భయస్వేచ్ఛ!

జ్ఞానానికి అఖండమైనశక్తి ఉండడమేకాకుండా, అన
శాంతికూడా ఉన్నది.

వానజల్లులరీతి యమృత ప్రశాంతి
వర్షించుచున్నది వర్షింపుచున్న
దమృతంబు దివ్య సంగీతవర్షముగ
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!
నా కీర్తి మేఘంబు లానందముగను
విహరింపుచున్నవి విచ్చల విడిగ
వానిలోనుండి ముత్యాల చందముగ
రాలుచున్నవి జగద్గోళ బృందములు
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!
పరిమళధర్మ వాయువు నాదుశ్వాస,
వీయుచున్నది మనోహరలీల నహాహా!
చిన్నకొమ్మలరీతి కొన్ని వస్తువులు
ఊగుచున్నవి, మరికొన్ని వస్తువులు
మంచుబిందువులట్లు పడుచున్న వహాహా!
చినుకులు! చినుకులు!! చినుకులజల్లు!!!
గంభీర కాంతి యన్నాల సంద్రంబు
అలలతో మృదువుగా కులుకుచున్నయది
వానజల్లుల ప్రపంచంబు సృష్టించు
చున్నది; నేను నక్షత్రాల వర్ష
బిందువుల్ కురియుచున్నాడ దివ్యముగ
చినుకులచిందులు! చినుకులచిందు
లమృతంపు శాంతి వర్షపు జల్లు లహాహా!

ఓం ఓం ఓం

---

ఓం

# భావి భారతము

(ఒక పుస్తకానికి ఉపోద్ఘాతంగా వ్రాయబడింది).

భారత దేశంయొక్క ఆశా కాంతి మయమైన భవిష్యత్తును గురించి రాముడు ఇప్పుడు కొన్ని మాటలు చెప్తాతాడు.

ప్రపంచంలో ప్రతి వస్తువూ ఒక మహాఛందో బద్ధంగా నడుస్తూ వుంటుంది. ఈప్రకృతి నంతా ఒక ఛందోధర్మం పరిపాలనం చేస్తూవుంది. ఈ ఛందో ధర్మానికి బద్ధుడై సూర్యుడూ పరిభ్రమింప వలసిందే. భాగ్యతారకలూ పరిభ్రమింప వలసిందే, ఒకనాడు భారతదేశ గగనమండలంలో విజ్ఞాన భాగ్య భానుబింబం ప్రచండంగా వెలిగిన రోజులున్నవి. చారిత్రికదృక్పథంతో చూస్తే ఈ స్వర్గీయమైన తేజము ఇతర స్వర్గీయమైన తేజోగోళాల మాదిరి పాశ్చాత్యదిశకు నడిచింది. పర్షియా వెళ్ళింది. అస్సీరియా దాటింది. మరీ పడమటికి వెళ్లింది. ఈజిప్టులో వెలిగింది తర్వాత గ్రీస్‌లో వెలిగింది. ఈ మహాధర్మ సూర్య మధ్యాహ్నాన్ని రోంనగరం అనుభవించింది తరువాత. ఈ వెలుగు జర్మనీని మేలుకొలు పింది. ఫ్రాన్సును నిద్రలేపింది. స్పెయిన్ను ఆవరించింది.

చివరకు ఆంగ్లేయ దేశంలో కండ్లు మిరుమిట్లు గొలిపే యీ వెలుగు వర్షించింది. పాశ్చాత్యానికి. ఓహో! ఈవిజ్ఞాన భానుబింబం అమెరికాకు పయనించింది. అమెరికాను భాగ్య డోలికల్లో ఊపింది. చివరకు ఈ వెలుగు ప్రయాణం చేసిచేసి క్యాలిఫోర్నియా చేరింది. హిందూదేశంలో పగలు ప్రకాశిస్తు

న్నప్పుడు అమెరికా అజ్ఞాతం. ఇప్పుడు అమెరికాలో పగలు హిందూదేశా కాశంలో యిప్పుడు దరిద్రబాధామయరాత్రి ప్రేలాడుతూ వుంది, కాదు విజ్ఞాన భానుబింబం ఫసిఫిక్ సముద్రాన్ని ఉత్తరిస్తున్నది. జపానుదేశం ప్రపంచంలో శక్తి వంతమైన దేశాల్లో ఒకటి అవుతూవున్నది. ప్రకృతి ధర్మాను బద్ధంగా విజ్ఞాన భాగ్యసూర్య బింబం ప్రపంచ పరిభ్రమణం ముగించుకొని హిందూదేశాకాశంపైన మళ్ళీ ప్రచండమైన తేజస్సుతో వెలుగబోతున్నది! శివం!

గతకాల చరిత్రను పరామర్శిస్తే ప్రస్తుతం హిందూ దేశాన్ని ఆవరించిన యీ మహా దరిద్ర రాత్రికి కారణం ఒకటి కనుపిస్తుంది. ఆకారణం స్వార్థం. హిందూదేశ మంది రంలోయున్న విజ్ఞాన తేజః పుంజాలన్నీ నాదేనన్న స్వార్థంతో మనం తెరలు వేసుకొని తలుపులు మూసుకొని లోలోపల కుళ్ళి పోయాము. ఈ హిందూజ్యోతిని గుత్తకు తీసుకుందా మనే దుష్టేచ్ఛ మనమీాద చీకట్లను కక్కింది. భగవంతుడు మానవులను గౌరవించడు. భాగ్యం భూగోళ రేఖలను దాటి పోయింది. మనం మన జీవితంలో తత్త్వమసీ అనే సత్యాన్ని సుప్రతిష్ఠితం చెయ్యలేక పోయినాము. విభజింపబడి బలహీను లమైనాము. జాతియొక్క నాయకులు చేసిన మహాఘోరమేమి టంటే వారికి పోయిన హక్కులకు మీారుపోట్లాడారే కాని హక్కులియ్యక వారు అణచిన నీచజాతుల కోసరమని పోట్లాడ లేదు. ఆశాతారక కనుపిస్తున్నది! సుఖ నిద్రపోయినవారు సుఖంగా లేస్తారు. హిందూదేశం మహాదీర్ఘ నిద్రపోయింది

ఈ నిద్రామైకం పగిలిపోతుంది. ఛాందసాచారాలు బద్ధలై మారి స్వేచ్ఛాచారాలుగా మారేరోజులు వస్తున్నవి!

అభ్యుదయం ఆత్మమీద ఉద్రేకం మీద ఆధారపడి వుంటుంది. వర్ణాశ్రమాలు జాతి అభ్యుదయంలో కలిగిన ఒక పరమ సుందరమైన విభజన, పరిశ్రమ, వృత్తి, ఆత్మ, హృదయ సంధానమూ, వీటివిభజన. కొన్నాళ్ళకు ఆత్మకంటే యివే ప్రముఖమైనవి. అందుచేత ఇవి నాశనమయ్యే రోజులువస్తున్నవి. ఒకవర్ణంలో వాడు యింకొక వర్ణంలో వాడి పని చేస్తున్నప్పటికికూడా యీ వర్ణకుల సంబంధమైన భావాలు వదలుకో లేదు. కుల దేహ భ్రాంతి కక్షలు అపరిమితంగా పెరిగి, పేర్లు, దేహభ్రాంతులు మొదలైనవాటితో కూడిన ఒకపెద్ద పెంటదిబ్బలో ఆత్మను పూడ్చిపెట్టాయి. 'శృతి' (ఆత్మను గురించిన వేదజ్ఞానము) చనిపోయిన అక్షరమయింది. స్మృతి (పూర్వాచారాలను గురించిన ధర్మశాస్త్రాలు) నిరంకుశ రాక్షసాధి కారిణి అయింది- స్మృతి ఆత్మను అజ్ఞానంచేత ఆచ్ఛాదితం చేసింది. ఒక రీ విధంగా అన్నారు. 'వ్యాకరణం, భాషకు కట్టిన గోరీ'. వ్యాకరణాన్ని కాపాడడానికి పాటుపడితే భాష చచ్చి వూరుకుంటుంది. ఈ విధంగానే కఠినమైన ధర్మాలు, ఆచారాలు, కర్మకాండలు, జాతియొక్క బలాన్ని నాశనం చేస్తాయి. కొన్నాళ్లువరకూ, ఇవి జాతి యనే మొక్కను కాపాడడానికి సహాయపడినవి. కాని, తరువాత మారనందువల్ల, యివే జాతియొక్క అభ్యుదయానికి కారాగారాలై జాతి జీవనాన్ని నాశనంచేశాయి. ప్రియమైన మానవులారా! మీ

మనస్సులో జ్ఞాపకం ఉంచుకోండి ! ఈ ధర్మాలు, స్మృతులు మీ కొరకై నిర్మింపబడినవి. కానీ,మీరు వాటికొరకు నిర్మింపబడ లేదు. నిత్యమైన శృతి సత్యాన్ని బ్రహ్మాండంలో వ్యాపింపచెయ్యండి ! కానీ, దినావసరాలకు మాత్రమే స్మృతులను ఉపయోగించండి ! స్మృతిసాంప్రదాయము మీకు చెందనివ్వండి. మీరు స్మృతిసాంప్రదాయానికి బద్ధులు కావద్దు. భారత దేశంలో, నదీశయ్యలు మారిపోయినవి. మంచుకొండలు కరిగిపోతున్నవి. అడలు పడిపోతున్నవి. పొలాలు పండుతున్నవి. భారత దేశమే నవ్యస్వరూపధారణ చేసింది ! ప్రభుత్వం మారింది. భాష మారింది. అన్నీ మారిపోతున్నవి. మారిపోయే మహాప్రాహికమైన యీ ప్రపంచంలో, చనిపోయిన, గతాచారాలను నిలువబెట్టడానికి యింకా మీరు ప్రయత్నంచేస్తారెందుకు ? మీరు ఎంతటి మహాదుఃఖ పరిస్థితిలో ఉన్నారు ? ముందుకు పోదామనుకొని వెనక్కు చూస్తున్న వాడిలాగా యున్నారు. ఇలాంటి వాడు ప్రతిఅడుగులో పడిపోవలసిందే !

వారసత్వమూ, అన్వయమూ అన్న సూత్రాలమీద జీవితం తిరుగుతూవుంది. వారసత్వము అధోరాజ్యాల్లో పరిపాలిస్తుంది. మానవుడికీ, యితర జంతుజాలానికీ భేదం విద్యాసూత్రం. ఒక పసిపాప ఒక చిన్నకుక్కపిల్ల మాదిరే, జ్ఞానం లేకుండా ఉంటుంది. ఈ చిన్నకుక్కపిల్లకాని, లేక ఒకచిన్న పక్షిగాని, పుట్టినప్పుడే దాని జీవిత సంపూర్ణత్వానికి కావలసినవన్నీ, తల్లిదండ్రుల దగ్గరనుంచి తెచ్చుకుంది. ఈ పసిపాప

(మానవుడు) విద్యద్వారా సకలప్రపంచాన్ని తనకు అన్వయం చేసుకుంటాడు. యిది జంతువుకూ మానవుడికీ భేదం.

నా ప్రియమైన హిందువులారా! విద్యా శత్రువులై, పాతవాటికి పట్టుకొని వ్రేలాడి మనుష్యస్థితికంటే, అధమస్థులు కా వాకండి! మీరు- వాతావరణంలోనే జీవించడంలేదు. కాలంలో కూడా జీవిస్తున్నారు. మీరు హిందూదేశంలోని పూర్వర్షులలోనుంచి అవతరించినవారు అయినా, యీ యుగంలో బ్రిదుకుతున్నారా లేరా? రైల్వే, స్టీమరు, టెలి గ్రాఫ్- యివన్నీ మీ దగ్గరగా ఉన్నవి. ప్రస్తుత ప్రపంచం నుంచి విడివడి మిమ్ములను మీరు గదుల్లో మూసుకొని కూర్చో లేరు. యీనాడు మీ జీవిత సంగ్రామంలో యోధులెవరో తెలుసా? నేటి శాస్త్రవేత్తలు కళావేత్తలు యూరప్‌లో అమెరికాలో శ్రామికులు! దీన్ని మీరు తప్పించు కోలేరు. జాగ్రత్తగా చూచినట్లైతే, యీ నవయుగ మహో జీవితంతో మీ జీవితాన్ని అన్వయించుకుంటే తప్ప బ్రిదుక లేరు. ఈ నవజ్యోతిని స్వదేశ సనాతనజ్యోతి ఆలింగనం చేసుకోను మీకు యిష్టం లేకపోతే, వెళ్ళి మీ పూర్వులతో కలసి పితృలోకంలో నివసించండి! ఇక్కడ ఎందుకు వెళ్లండి!

మీరు జాతీయతనుంచి పతనం కావాలని, రాముడి అభిప్రాయంకాదు. ఒక మొక్క చుట్టూ వాతావరణంలో వున్న, నీటినీ, గాలినీ, ఎరువునూ, తీసుకున్నా ఆ మొక్క నీరూ, గాలీ, ఎరువూ కావడంలేదు. ఆ విధంగానే, మీరు నవ ప్రపంచాన్నంతా మీలో యిముడ్చుకొన్నప్పటి,, మీ

హృదయాంతర రక్తనాళాలలో అనంత శృతి జీవితం స్పందిస్తునే వుంటుంది!

దేశంలోని ఫలితాలను, ఉపయోగించు కొనేటట్లు చేసుకోవడమే విద్య యొక్క అభిప్రాయము. నిజమైన విద్య వల్ల మానవుల్లో ఉత్తేజం వికసించి భూములు పుష్కలంగా ఫలిస్తవి. గనులు అపరిమితమైన భాగ్యాన్ని వర్షిస్తవి. వ్యాపారము ప్రఫుల్లమవుతుంది. దేహాలు ఉత్సాహ పూరితము లౌతవి. మనస్సులు వ్యక్తిత్వంతో భాసిస్తవి. హృదయాలు పవిత్రమై పరిశ్రమలు అనంతంగా అభివృద్ధిచెంది జాతిలో ఐక్యత అచంచలమై వెలుగుతుంది. పూర్వ గ్రంథాల్లోని పెద్దపెద్ద శ్లోకాలను వప్పజెప్పడం, దంభపాండిత్య ప్రకటనం చెయ్యడం తెలివితేటలచేత పూర్వగ్రంథాలకు అపవ్యాఖ్యానం చెయ్యడం జీవితానికి అనవసరాలైన విషయాలను గురించి తర్కించడం విద్యకాదు. జీవితంలో ప్రవహింపజేసుకోలేని విజ్ఞానం, ఆత్మీయమైన మనస్సంబంధమైన ఒక పెద్దరోగం!

హిందువులు ఎన్ని అడ్డంకులు ఉన్నప్పటికీ సత్యమైన విద్యను సంపాదిస్తున్నారు; కఠినమైన వర్ణాశ్రమ పద్ధతి ధర్మాలు నెమ్మదిగా మారుతూవున్నవి! పాశ్చాత్య విజ్ఞానాన్ని బ్రహ్మ యొక్క స్నేహితురాలి మాదిరి హిందువులు ఆహ్వానము చేస్తూన్నారు.

హిందూ వివాహంలో వయస్సు మారిపోతూవుంది. వర్ణాంతర వివాహాలు గూడా జరుగుతూవున్నవి.

ఇదివరకు అన్నం తినడాన్ని గురించి అనవసరమైన ప్రాముఖ్య మివ్వబడింది మన మతంలో. అందుచేతనే మన మతాన్ని వంటయింటి మతమని పిల్చారు. మనం శాస్త్రీయంగా ఆహారాన్ని గురించి ఎన్నడూ విచారించలేము. ఆహారం యొక్క ప్రభావం మనస్సుమీదకూడా కొంతవరకు ఉంటుంది. ఒక యంత్రం. దానికి వేసే ఆహారాన్ని బట్టే నడుస్తుంది. మనం కాయగూరల్లో పండ్లల్లో గింజల్లో దేహము యొక్క మనస్సుయొక్క చురుకు దనానికి కావలసిన నైట్రిడ్సును పాస్ఫేట్సును పేరుకోవచ్చు. మనము బలంలేని నెయ్యిని తింటాము. కాని బలంకలిగిన బార్లీని తినము. కొన్ని ఆహారపదార్థాలు పెప్పర్ మొదలైనవి జబ్బును తెచ్చిపెడతవి. వెన్న, పంచ దార మొదలైన కార్బనేడ్సు వూపిరితిత్తులకు మాత్రం బలాన్ని యిస్తవి. కానీ మేధస్సుకు బలాన్ని యివ్వవు. జ్ఞానమే అన్నాన్ని శాశిస్తుందిగాక!

హిందూదేశంలో సాధువుల విషయం విచిత్రంగా ఉంటుంది. ప్రవహించని నీటిమీద పాచి పేరుకున్నట్లు హిందూ దేశంలో 52 లక్షల సాధువులున్నారు. అందులో కొందరు నిజంగా సరస్సులో పద్మాలవంటివారు. సరస్సుకు అలంకా రాలు కొందరు పాచివంటివారు. నీటిని ప్రవహింప నియ్యండి. నీరు ప్రవహిస్తే పాచి కొట్టుకోపోతుంది. అంధకారమయమైన పూర్వ హిందూదేశ చారిత్రిక యుగం యొక్క సహజమైన యుత్పత్తి యీ సాధువులు. ఇప్పటి సంస్కారం గృహస్థులనే కాక సాధువులనుకూడా మారుస్తూవుంది. ఇప్పుడిప్పుడు అవ

తరిస్తున్న నవీన సాధువులు జాతీయతా మహావృక్షానికి వేరు పురుగులుకాక, ఎరువే అవుతున్నారు.

ఈనాడు, భారతదేశంలో, కృష్ణభూమిలో, పరిశ్రమ యొక్క గొప్పతనమూ, నిష్కామకర్మయోగమూ, గీతా తత్త్వమూ, తెలుసుకోబడుతూ వున్నది !

లాభాలాభాలను, ప్రతిష్ఠను అప్రతిష్ఠను, మంచీచెడ్డను సమానంగా చూచి, కర్మయోగివికా !

అఖండమైన భక్తి అభ్యుదయం పొందుతూవుంది ! హిందూదేశముయొక్క బహిర్గత అంతర్గత సనాతన అధునాతన జీవితాన్ని సమగ్రంగా తెలిసినవారు, భావిభారతమహామతము అనుష్ఠాన వేదాంతము అని తెలుసుకోగలరు! అనుష్ఠాన వేదాంతం అంటే, కర్మలో ప్రేమద్వారా సన్న్యాసము! సత్యమైన కర్మ, సత్యమైన ప్రేమకంటే సత్యమైన జ్ఞానంకంటే వేరైందికాదు. శ్రుతిమతం, (అనుష్ఠాన వేదాన్తం) మానవ జీవితం, దైవత్వం కొరకు హోమం చెయ్యబడిన కర్మగల ఒకమహాయజ్ఞమని ఉద్ఘోషిస్తున్నది.

వేదాన్త పరిభాషలో దేవ అన్నపదానికి అర్థం శక్తిని ప్రసాదించే జీవశక్తి. ఈ ఇంద్రియాధిదేవత ఇంద్రియ కర్మలకు శక్తిని ప్రసాదిస్తాడు. నేత్రేంద్రియాధిదేవత. సకల జీవ రాసులకు నేత్రేంద్రియాధిదేవత ఆదిత్యుడు. ఆదిత్యుడే ప్రపంచలోచనం. సకల ప్రపంచ శరీరముయొక్క హస్తేంద్రియాధిదేవత యింద్రుడు. చరణేంద్రియాధిదేవత విష్ణువు.

బ్రహ్మాండ శక్తులకు వ్యక్తిని వ్యక్తిగతమైన యింద్రియ కర్మలను హోమం చెయ్యడమే యజ్ఞం. ఇంద్రయజ్ఞమంటే ప్రపంచంలోని అన్ని చేతుల కొరకు చేతులతో కష్టపడడం. ఆదిత్యయజ్ఞమంటే సకల మానవ లోచనాలలో భగవంతుణ్ణి దర్శనం చేసుకోవడం. ప్రతికన్నునూ నమస్కరించడం. నిన్ను క్రోధంగా చూచిన కండ్లనుకూడా శాంతంతో నవ్వులతో ప్రేమతో దయతో అర్చనం చెయ్యడం. నీలోచనాలయాలలో సర్వమహాజ్యోతి వెలిగిపోయేటట్లుచేసుకోవడమే ఆదిత్యయజ్ఞం! బృహస్పతి యజ్ఞమంటే, నీ భావాలను; సకల మానవజన భావాలకు అంకితం చెయ్యడం. ఆ అంకితం చెయ్యడంలో, ఆనందాన్ని అనుభవించడం.

ఒక మాటలో చెప్పవలసివస్తే యజ్ఞానికి అర్థం యిది— "నా పొరుగువాడు నా ఆత్మ! ఈ ప్రపంచమంతా నేనే. నా ఆత్మ బ్రహ్మాండముయొక్క ఆత్మఅయిపోతూవుంది." యజ్ఞమంటే స్వార్థాన్ని శిలువవెయ్యడం. మహాత్మను పునః ప్రబుద్ధం చెయ్యడం. ఈ మహాయజ్ఞంలో ఒకభాగం భక్తి; ఒక భాగం జ్ఞానం.

ఓ సర్వమయుడా! (ఓం)—

వినయంబుతోడ నా జీవితంబెల్ల
నీకంకితముసేతు తీసుకోవోయి!
నీసేవకే చేతులను తీసుకొమ్ము—
గ్రహియించి నా హృదయాబ్జంబుదేవ!
నీలో విలీనంబు చేసుకొమ్మిదియె.

తీసుకో నానేత్రముల తీసుకొమ్మ,
పరమేశ యవిభవ దున్మత్త వశత
అరుణంబులవుగాక! అనుదినంబీవు
వసియించు దివ్యాలయముఁ జేసుకొమ్మ,
నామానసంబును సర్వాంతరాత్మ!

ఈ విధంగా, తన సర్వస్వాన్ని సంపూర్ణంగా దైవాంకితం చేసినవాడే. 'తత్త్వమసీ' అంటే ఏమిటో తెలుసుకోగలడు ;

నీవు ఒక దేశసేవకుడివి కావాలని కోరుతున్నావా? నీ హృదయాన్ని ఈ దేశ ప్రజల ప్రేమతో ఖర్తిగల్పు.నీవూ వారూ ఒకటే అనుకో! నీకూ వారికీ మధ్య ఒక సన్నటి పొర కూడా అడ్డం లేదనుకో! జాతికొరకు ప్రాణత్యాగం చేసిన ఒక ఆధ్యాత్మిక సైనికుడివికా! ఈవిధంగా నీవు భావించు! సకలజాతీ నీతో భావిస్తుంది! పురోగమించు! దేశం నిన్ను అనుగమిస్తుంది! ఆరోగ్య వంతుడివికా! దేశం ఆరోగ్యవంతమవుతుంది! నీబలం జాతినాడుల్లో ప్రవహిస్తుంది నేనేహించూ దేశాన్ని.ఈభారతభూమినాశరీరం.కామరెన్‌నాపాదయుగళం. హిమాలయాలు నాశిరస్సు. నాజటల్లోనుంచి గంగ ప్రవహిస్తున్నది. నాశిరస్సు నుంచి బ్రహ్మపుత్ర ప్రవహిస్తున్నది. సింధు నది పొంగిపోతున్నది. వింధ్యాచలాలు నా కటి మండలమేఖల. కొరమాండల్ నాకుడికాలు. మలబారు నా ఎడమకాలు. నేను భారత సర్వస్వాన్ని! భారతదేశంయొక్క తూర్పు పడమర దిక్కులే నా చేతులు. సకలమానవప్రపంచాన్ని ఆలింగనంచేసు

కోను. దిక్కులనే యీ చేతులను నేను చాచాను. నా ప్రేమ సర్వ విశ్వాన్ని ఆవరించింది. ఇది నా మహా విశ్వరూపము! అనంతమైన ఆకాశంలో నిల్చొని నావిశ్వరూపం ప్రపంచాన్నంతా చూస్తూవున్నది. నేనునడస్తే సర్వభారతం నడిచినట్లుంటుంది! నేను మాట్లాడితే అఖండ భారతం మాట్లాడినట్లుంటుంది! నేను గాలిపీలిస్తే మహాభారతం గాలిపీలుస్తుంది. నేను అఖండ హిందూస్థానాన్ని! నేను శంకరుణ్ణి! నేను పరమశివుణ్ణి! ఇదే దేశభక్తి యొక్క సిద్ధస్థితి! ఇదే అనుష్ఠాన వేదాంతం!

"నాలోన ప్రవహించు నదివోలె శాంతి
నాలో నఖండమా శాంతిసాగరము
పొంగిపోవుచు నున్న దుప్పొంగుచుండె
నాజటాతతినుండి నాకాళ్ళనుండి
అస్మదీయాఖిల దేహంబునుండి
శాంతి మహాగంగ బయలుదేరెడిని.

మధ్యభ్రుకుటీద్వార సీమయందుండి
శాంతిభాగీరథి బయటికేతెంచు
హృదయ స్వర్గంబులో నధివసించెదను
అక్కడ నానందముగ విహరింతు
నన్నెవరును వీడిపోలేరు విడచి.

భూలోకమందైన స్వర్గమందైన
జరిగెడి యీ పెండ్లిముడి సంగమంబు
సకలమర్త్యుల నావరించిన నాదు
దివ్యగాఢాలింగనచ్ఛాయ సుమ్మి.

సూర్యుని కిరణాల మాదిరి నేను
పూలగుండెల దూసుకొనిపోదు మరియు
చంద్రకిరణంబునై సాగర్మికల
విహరింతు నానంద వివశుండ నగుచు.
ఓ మెరుపా ! ఓ ప్రకాశమా ! ఓయి
భావమా ! నాతోడ పరుగిడ గలరె ?
మీరు నాతో పరుగెత్తగా లేరు
ఎందుకు మీ వృథా సంరంభమెల్ల.
పృథివీ! జలంబ! ఓ పంచభూతములు!
నా బిడ్డలార! గొంతెత్తియు మీరు
ఘోషించుడీ! మహా సంగీత మహహా !"
ఓం! ఓం!! ఓం!!!

---

ఓం

# భారతీయ ప్రాచీన ఆధ్యాత్మికత

[1904 జూలై 28 తేదీ యిచ్చిన ఉపన్యాసం]

సభికుల స్వరూపంలోవున్న ప్రియా ! నేను మొట్ట మొదట అమెరికా వచ్చినప్పుడు 'సెలేరు'లో దిగాను. నాకు ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు స్వాగతమిచ్చారు. పవిత్రమైన యీ భూమిలో దిగంగానే వారే నన్ను అహ్వానించింది. వీరిలో నాకు అతిప్రియులున్నారు, గాఢస్నేహితు లున్నారు. పోర్టులాంఢులో ఆరిగన్‌లో వీరు నా ఉపన్యాసాలకు ఏర్పాటు

చేశారు. దక్షిణఅమెరికాలో అనేకులను ఆధ్యాత్మిక తత్త్వ వేత్తలను కలుసుకున్నాను. వారందరూ మధురాత్ములు, అమెరికాదేశ ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు, విశాల హృదయులు, కరుణాంతరంగులు, సత్యవంతులు, నిజంగా క్రైస్తవులు. మళ్ళీసమావేశమైన నా ప్రియులమధ్య ఉండడం నాకు ఎంతో ఆనందంగాఉంది. నేను అమెరికా విడిచిపెట్టి పోతున్నాను. నన్ను ఈదేశంలో ఆహ్వానించిన ప్రియస్నేహితులతో మాట్లాడడానికి యిప్పుడు అవకాశం చిక్కింది.

ఇక్కడ మనమందరమూ అన్నదమ్ములం, మనం యిప్పుడు పొదలతో అందమైన దేశంలో నివశిస్తూ ఉన్నాము. ఆకాశం మనకు రాజచ్ఛత్రం. ఈ చెట్లూ, యీ మేఘాలు, మనకు ఛత్రాలు పడుతున్నవి. మీకు మొట్టమొదట హిందూ దేశంయొక్క ప్రాచీన ఆధ్యాత్మిక తత్త్వాన్ని గురించి చెబుతాను.

హిందూదేశ ప్రాచీన ఆధ్యాత్మికతత్త్వం ఈ దేశంలో ఉన్న ఆధ్యాత్మిక సంఘాలవంటిదికాదు. కానీ, ప్రాచీన వేద సాహిత్యంలో దివ్యదృష్టిని గురించి అనేకచోట్ల సంకీర్తింపబడి ఉంది.

నేను వ్రాస్తున్నాను, చదువుతున్నాను, పనిచేస్తున్నాను, శాశిస్తున్నాను. ఇవన్నీ దివ్యదృష్టితో చేస్తున్నాను. దివ్యదృష్టిఅంటే దివ్యదీప సందర్శనం. మీరు భగవద్గీతను గురించి చాలా చదివారు. భగవద్గీతను జెప్పినది సంజయుడనే మానవుడు. భగవద్గీత మొదటిలోనే యితని సంగతి ఉంటుంది.

సంజయుడు అర్జునుడికి గీతబోధింపబడిన యుద్ధరంగంలో ఒక మనిషి. యుద్ధరంగానికి 200 మైళ్లదూరంలో ఉన్నాడు. అందు చేత గీతాచార్యులు సంజయుడికి దివ్యదృష్టి యిచ్చాడు. రెండు వందలమైళ్ల దూరంలో ఉండి, సంజయుడు యుద్ధరంగాన్నంతా అవలోకించాడు. యుద్ధరంగంలో భగవద్గీత గానం చెయ్య బడింది. మీకు జ్ఞాపకం ఉండే వుంటుంది. ఈ దేశంలో కొన్ని రచనలనూ సందేశాలనూ 'మీడియంసు' అని పిలుస్తారు. ప్రపంచంలోకల్లా మహత్తర గ్రంథాల్లో యోగవాశిష్టం ఒకటి. యోగవాశిష్టం చదువుతూ వుంటే భగవత్తన్మయం కలుగుతుంది. సర్వైక్యం లభిస్తుంది. ఇది అలాగే వ్రాయ బడింది. హిందూదేశంలో మరొక మహాగ్రంథం రామా యణం. రామాయణంకూడా, రామకథ జరగడానికి చాలా పూర్వమే వ్రాయబడింది.

మహాభారతం ప్రపంచంలోకల్లా మహోత్తమగ్రంథం. మహాభారతంలో నాలుగువందలవేల శ్లోకాలు ఉన్నవి. కథలో ఒకరాజ్ఞి కలలో ఒకసుందర రాజకుమారుణ్ణి చూస్తుంది. అతణ్ణి ప్రేమిస్తుంది. ప్రేమానుతాపంలో ఆరాజకన్యకు జ్వరం వస్తుంది. రాజకన్యతండ్రి అనేకవైద్యులను పిలిపిస్తాడు. కానీ ఎవ్వరూ జబ్బేమిటో చెప్పలేకపోతారు. చివరకు ఎవరోఒకరు ప్రేమ అని కనుక్కుంటాడు. ప్రధాని ఆమెదగ్గరకు వస్తాడు. ఆమె నాడి చూస్తాడు. ఒక చిత్రకారిణిని పిలిపించి, ఇండియా లోవున్న సుందరమైన రాజులందరి చిత్రాలూ, గీయ మంటాడు. ఆమె చిత్రకారిణి. పూర్వం ఇండియాలో

స్త్రీల స్థితి మాహాత్మ్యాన్ని యిది తెలుపుతుంది. చిత్రకారిణి వస్తుంది. ఫలకంమీద బొమ్మ గీస్తుంది. అనేకమంది సుందర మైన రాజులబొమ్మలు గీస్తుంది. ప్రధాని రాజకన్య నాడి చూస్తూఉన్నాడు. చిత్రకారిణి శ్రీకృష్ణుడి బొమ్మ గీస్తుంది. ప్రధాని నాడిచూస్తాడు. నాడి ఎక్కువగా కొట్టుకుంటుంది. ప్రధాని అనుకున్నాడు; కల్లో కనిపించిన పురుషుడితడే నని అను కుంటాడు. కాని నాడి మళ్ళీ వేగం తగ్గుతుంది. చిత్రకారిణ్ణి మళ్ళీ బొమ్మలు గీయమంటాడు. కృష్ణుడి చివరకొడుకు బొమ్మ గీస్తుంది. ఆబొమ్మ గియ్యగానే రాజకన్య నాడేకాదు,హృదయం కూడా కొట్టుకొంటుంది. ప్రధాని నిర్ణయించుకుంటాడు. రాజ కన్య దుఃఖాన్ని తీసివేసే మనిషి యితనే నని; ఇది వట్టికథ కాదు. చారిత్రికమైంది.

ఈచిత్రకారిణి విషయం ఏమిటి? దేశంలోవున్న రాజ కుమారుల నందరినీ చూచిందా? లేదు. దివ్యదృష్టి సర్వైక్యత ప్రకృతిగ్రంథం తెరుచుకున్నది, దాన్ని చిత్రకారిణి చదివింది. ఈరకంవి అనేకం ఉపమానా లున్నవి. ఒకదివ్యస్వప్నంఉన్నది. ఈ అంతర్జ్యోతివల్లనే సకల ప్రపంచ మహావిజ్ఞానం పొంద గలుగుతాము.

అందమైన ఉపమానాలవల్ల వేదాన్తం ప్రచారంలోకి వచ్చింది. ఈ అంతరాధ్యాత్మిక మహాస్వప్నానికి ఒక ఉదా హారణ చెపుతాను. ఈమహాదర్శనంవల్లనే, యూనివర్సిటీల్లో ప్రొఫెసర్ల నుంచి చదువువస్తుంది.

ఒక రాజకుమారు డున్నాడు. అతనొకసారి యాత్ర

వెళ్ళుతున్నాడు. ఎందుకంటే ఆయాత్రి. ఒక సుందరమైన భవనపు చిత్రాన్ని గీయించుకోందామని. రాజకుమారుడి దగ్గరికి చాలామంది చిత్రకారులువచ్చారు. రాజకుమారుడు వారికి పరీక్షపెట్టాడు. రెండు గోడలున్నవి. ఇద్దరు చిత్రకారుల్ని పిలిచి, వాటిమీద బొమ్మలు వేయమన్నాడు. ఒకరి దొకరు చూడకుండా ఉండటం కోసమని ఫలకాలకు తెరలు గట్టబడ్డవి. బొమ్మలు రెండు వారాల్లోపల గీయాలి. ఒక చిత్రకారుడు ఫలకంమీద మహాభారత చిత్రాలను అద్భుతంగా గీశాడు. రెండో చిత్రకారుడు ఏంచేస్తున్నాడో తెలీదు. రెండు వారాలూ గడచినవి. రాజకుమారుడు వచ్చాడు. ఒక ఫలకం తెర ఎత్తబడింది. దానిమీద మహాభారత చిత్రాలు మహాద్భుతంగా ఉన్నవి. అతనికే బహుమానం యివ్వమన్నారు ప్రజలందరు. రాజకుమారుడు రెండవఫలకం తెర ఎత్తమన్నాడు. తెర ఎత్తబడింది. ప్రజలు ఆశ్చర్య చకితులైనారు. కనురెప్పలు వాల్చలేదు. గాలి పీల్చలేదు. ఈఆశ్చర్యం ఎందుకు? ప్రజలనుకున్నారు 'ఇందులో కూడా మహాభారత చిత్రాలున్నవి. ఇవి మొదటి ఫలకం మీదకంటె ఎక్కువ అందంగా ఉన్నవి. మృదువుగా వున్నవి' ఎందుచేత? ఆశ్చర్యపడ్డారు. మూడడుగుల్లోనే బొమ్మలన్నీ గీయబడ్డాయి. ఈరహస్యమేమిటి? ఈఫలకాన్ని రెండవ చిత్రకారుడు అద్దంలా ప్రతిబింబించేంతవరకూ సానపెట్టాడు. అందుచేత మొదటి చిత్రకారుడి చిత్రాలు ప్రతిఫలించాయి. అద్దంలో వస్తువులు సమంగా ఉన్నట్లుగా కనిపిస్తాయి.

అలాగే విజ్ఞాన సంపాదనకు రెండు మార్గాలున్నవి. ఒకటి బైటిదంతా లోపలికి కుక్కుకోవడం, బైట ఏవోగీతలు గీయడం, బొమ్మలు గీయడం, భూగర్భశాస్త్రం, గ్రహ శాస్త్రం, భగవచ్ఛాస్త్రం, భాషాశాస్త్రం యీ అనుష్ఠాన విహీనములైన గాలిమేడలవంటి శాస్త్రాలన్నీ నేర్చుకోవడం — ఇది ఒకరకమైన విజ్ఞాన సంపాదన. మరొక మార్గం — ఇది శుద్ధమైన మార్గం. ఇది లోపలికి కుక్కోటం కాదు. ఇది అంతస్సును పరిశుద్ధి చేసుకోవడం. హృదయాన్ని దేవుని తో శృతిగల్పడం. 'ఎమర్సన్ ప్రకృతి హృదయంతో నీ హృదయాన్ని శృతి కలుపు, దిగంతాలు స్వచ్ఛమై పోతాయి' అన్నాడు. ఆత్మే అంతా అని తెలుసుకొనే పద్ధతి యిది. 'వాల్టు విట్ మాన్' యిలా అన్నాడు. 'నీవు అన్నింటిని అనుభవిస్తేనేకాని అన్నింటిని తెలుసుకోలేవు.''

ప్రతిభాశాలురు వారి విజ్ఞానాన్ని ఎక్కడనుంచి తెచ్చుకున్నారు? బ్రహ్మశాస్త్రంలో ఆచార్యులున్నారు. దివ్యత్వం తెలుసుకున్న ఆచార్యు లున్నారు. మతప్రవక్త లున్నారు. ఆలయాధిపతు లున్నారు. గ్రంథాలయాలకు జీవితం అర్పణ చేసినవారున్నారు. కాని వీరి వాక్యాలు అమృతమయుడైన క్రీస్తు 'మధురాధరాల్లోనుంచి వెలువడిన తియ్యని బోధలమాదిరి వుండవు. అనేకులు రచయితలున్నారు. వక్తలున్నారు. కాని ప్రియులారా! అమెరికాలో యిచ్చినఅన్ని ఉపన్యాసాలలోకి ఏడుమాటల ఉపన్యాసంగొప్పది. ఆఏడు మాటలఉపన్యాసం ఏమిటో తెలుసా? "స్వాతంత్ర్యం ఇవ్వు, లేక

షో లేదా చంపు" (Give me liberty or give me death) గణిత శాస్త్రంలో తత్త్వశాస్త్రంలో పెద్దవేత్తలున్నారు. కానీ ఒక్కరైనా న్యూటన్‌లా సిద్ధాంతాన్ని కనిపెట్ట గలిగారా? ఈ విజ్ఞానం ఆతనికి ఎక్కడనించి వచ్చింది. అతను పుస్తకాల్లో నేర్చుకున్న విజ్ఞానంకంటే, ప్రపంచానికి యిచ్చిన విజ్ఞానం గొప్పది. ఈ విజ్ఞానానికి మూలం - ఏదో ఉన్నతమైనది. యూనివర్సిటీలో, షేక్స్పియర్ పుస్తకాలు చదువుతారు. యం. ఏ. చదివేవాండ్లు చదువుతారు. షేక్స్పియర్ ఏ యూనివర్సిటీలో చదవలేదు. పట్టభద్రుడుకాడు. కానీ పట్టభద్రులు అతని పుస్తకాలు చదవాలి. నేటి మహావిజ్ఞానశాస్త్రవేత్త అయిన హెర్బర్ట్ స్పెన్సర్ పట్టభద్రుడుకాడు. ఇతన్నడిగారెవరో యిట్లా—"మీరు చాలా ఎక్కువగా చదువుతారా?' అనిఅడిగారు. అప్పుడు స్పెన్సర్ యిలా అన్నాడు, "నేను చదవను- నే నెక్కువగా చదివితే వాండ్ల మాదిరేమొద్దు నయ్యేవాడినే." ఈ ప్రతిభాశాలురు విజ్ఞాన శాస్త్రాన్ని అధిగమింపచేసిన వాండ్లు; వాండ్ల భావాలను, పూర్వగ్రంథాల్లో నుంచి అప్పు తెచ్చుకోలేదు. ఆలాచేసినట్లైతే, వీండ్లభావాలు స్వంతం ఎలాఅవుతాయి? అసలు విజ్ఞానం ఎక్కడినుంచి వస్తుందీ అని ప్రశ్న?

ఆనందమయులారా! ప్రియులారా! వినండి. ఈ విజ్ఞానానికి మూలం ఒకచోటఉంది. అది అంతస్స్వర్గంతో శ్రుతి గల్పడం. అంతర్జీవితంతో శ్రుతిగల్పడం. అంతర్దృష్టితో శ్రుతి గల్పడం. అక్కడవుంది "అసలుమూలం ఆత్మే వికాసానికి

మూలం. జీవితానికిమూలం. ఆత్మే స్వర్గాలకు స్వర్గం! నాలో"
మానవుల్లో జీవితం అఖండజ్యోతి ప్రకాశిస్తుందన్న భావనా
సమాధిలో, విలీనమై నిశ్శబ్దశాంతి వహిస్తాముగాక !

ఆర్యఋషులు బ్రహ్మస్వప్నం ఎలాకన్నారో చెపుతాను. వేదాలు భగవంతుడు వ్రాసినవని అంటారు. ఋషులు వ్రాసిన వనీ అంటారు. దీనికి అర్థం యిది. వేదం వ్రాసినవారికి వ్రాసే టప్పుడు, దేహవిస్మృతి కలిగింది. అందుచేత వేదాలు పాడిన వారిని ఋషులు అంటారు. ఋషులు వేదాలకు కర్తలుకారు. ఋషి అంటే దివ్యజ్యోతిని దర్శించినవాడని అర్థం. హిందూ ప్రమాణ గ్రంథాల్లో మరొకచోట యిలాఉంది. "ఓంకార మనే బీజంలోనుంచి పెరిగినచెట్టు వేదం—అని" ఓంకారం అనే బీజంలోనుంచి వేదాలనే చెట్టు పెరిగింది. ఇదేమిటి. యీ భావనావైచిత్ర్యం? వేదాలు, వ్రాయని వాండ్లలోనుంచి ఎలావచ్చాయి? సహజంగా వచ్చాయి. గులాబిపూవునుంచి వాసనలాగా, దీపంనుంచి వెలుతురులాగా, వేదాలువచ్చాయి. వేదాలు రావడానికి ఇదీకారణం. ఓంకారం గానం చెయ్యడం చేత, ఋషులకు బ్రహ్మదర్శనం కలిగింది. అహంకారాన్ని అధిగమించారు. సంకుచితమైన స్వార్థాన్ని దాటిపోయారు వెలుగు వెలిగింది.

ఓంకారం జపించడమంటే గొంతులో నుంచి అనడం కాదు. మరొకటి. పెదవులూ కంఠమూ, శరీరకంగా స్మరిస్తు న్నప్పుడు మనస్సు-మేధస్సుతో స్మరిస్తుంది. హృదయం ఉద్రే కంతో స్మరిస్తుంది. ఈ విధంగా మనస్సూ దేహమూ

హృదయం ఓంకారాన్ని జపిస్తాయి. సర్వైక్యం కలుగుతుంది. దివ్యజ్యోతి కనుపిస్తుంది. ఇదీ పద్ధతి. ఓంకార మంత్రమంటే ఏమిటో చెబుతాను. అది మరొకనా డెప్పుడైనా చెబుతాను. ఓంకారమంత్రాన్ని గురించి చెప్పబోయ్యే ముందు యీ చిన్న మంత్రంలో ఉన్న దివ్య తన్మయతనుగురించి చెబుతాను.

భగవంతుడు మాటలను గౌరవిస్తాడా? ఈ ప్రతివారికీ గలిగే సందేహం.

ఓంకారం అతిసహజమైంది. అతిపవిత్రమైన దివ్యత్వం యొక్క పేరు. ఇది ఒక భాషకు చెందిన శబ్దంకాదు. హిందువులు తీసుకున్నారని సంస్కృత శబ్దంకాదు. ప్రకృతి పేరు. ప్రకృతిమాట, ప్రకృతియొక్క వాక్కు! ప్రకృతి మంత్రం! కొంతమంది సంస్కృతమని యీ మంత్రాన్ని నిరశిస్తారు. ప్రతివాడూ తను నమ్మే తత్వాన్నే సత్యం అనుకుంటాడు. ఇతరది విరుద్ధ మనుకుంటాడు. ఆచారవంతులు వాళ్ళముద్రతో వస్తేకాని దేన్నీ ఒప్పుకోరు. సంస్కృతం ఆర్య ప్రజలకు సంబంధించిందని మీరుదీన్ని తిరస్కరించ వాకండి. సంస్కృతం లో, ఓంకారం, శబ్దశాస్త్రానికి అతీతమైనది. ఇతర సంస్కృత శబ్దాలను బంధించినట్లు వ్యాకరణం ఈ శబ్దాన్ని బంధించదు. అందు చేత ఓంకారం సంస్కృత పదంకాదు. అది స్వతస్సిద్ధమైన ప్రకృతివాక్కు. హిందువులుదాన్ని తీసుకున్నారు, అంతే. ప్రతిపసిబిడ్డా ఈ శబ్దంతోనే జన్మిస్తాడు. పసిబిడ్డ పుట్టంగానే మొట్టమొదట ఉచ్చరించే శబ్దంఏమిటి? 'అం' అంటాడు. ఉం. అంటాడు. ఓం అంటాడు. 'మ' అంటాడు. ఓ. అ. ఊమ్. ఈ

మూడు ధ్వనులూ ఓంకారంలో ఉన్నవి. ఫ్రెంచి భాషలో ఓ, ఆ, అన్న శబ్దాలు కలిసినప్పుడు 'ఆ' అవుతుంది. ఆ విధంగానే సంస్కృతంలో కూడా ప్రపంచంలో ప్రతి పసిబిడ్డ ఈ శబ్దాలను స్వర్గీయమైన లోకాలనుంచి ఈ లోకంలోకి తెస్తాడు? జబ్బుతో బాధపడుతున్న మనిషి ఏశబ్దంలో ఉపశాంతి పొందుతాడు? 'ఊమ్ ఊమ్ ఊమ్' అని మూల్గడంచేత ఉపశాంతి పొందుతాడు, జ్వరంతో బాధపడుతున్న మనిషికి యీ మూలుగే ఓంకారం. ఈ శబ్దం మనస్సుకు అతీతమైన స్థితిలో ఉంటున్నది. సంకుచితమైన స్థానికమైన వ్యక్తిగతమైన, వ్యక్తిత్వానికి అతీతమైనది యీ ఓంకారం. సంకుచితమైన అహంకార పరిధులను దాటిన వా రడుగులు మొదలైన పరిణామాలను దాటి దుస్తులు మొదలైన భ్రాంతులను దాటిపోతే ఓంకారం నీలో నినదిస్తుంది. ప్రపంచ భాషల్లో కల్లా ఓంకారం ప్రప్రథమస్థానాన్ని అలంకరిస్తుంది. సర్వవ్యాప్తత ఓంకారంతో ప్రారంభిస్తుంది. తరువాత అనునాసికధ్వని సర్వప్రత్యక్షం సర్వశక్తిత్వం యివిభగవంతుడికి మధురమైన నామాలు భగవంతుడికి మధురమైన యీ నామాలన్నీ ఓంకారంలో నుంచి ప్రభవిస్తున్నవి. ఈ ప్రార్థనల్లో మీరు వాక్కుకు అతీతమైన స్థితిలోకి పోయినప్పుడు ఆమెన్ అన్నశబ్దాన్ని ఉచ్చరిస్తారు. పర్షియన్, భాషలో, హిందూస్థానీలో, అరెబిక్, భాషలో యింగ్లీషులో ఏమిన్ అంటారు. ప్రపంచంలో నాగరికత జాతిగల ప్రజలందరూ ప్రార్థనల్లో వాక్కుకు అగోచరమైన దివ్య గంభీర నిశ్శబ్ద శాంత స్థితిలోకి పోయినప్పుడు అంతరాంత

రాల్లో ధ్వనికి అతీతమైన ఒక మహాధ్వని ప్రతిధ్వనిస్తుంది. ఆ మహా పరమప్రశాంత స్థితిని హైందవులు ఈవిధంగాఅన్నారు.

"యతోవాచోనివర్తంతే అప్రాప్య మనసఃసహా" దీనికి అర్థంయిది—ఒక గోడకు బంతి కొట్టినప్పుడు తిరిగి వచ్చినట్లు ఆమహాస్థితి దగ్గరకు వాక్కు వెళ్ళివెళ్ళలేక తిరిగి వస్తుంది. ఈస్థితిలో 'ఏమెన్'అనేశబ్దమే మీకూ ప్రపంచానికీ అభేదత్వాం కల్పిస్తుంది. ఏమెన్ అన్నశబ్దము ఓంకారముయొక్క ఛాయ. ఓంకారమే పవిత్రాల్లోకి అతిపవిత్రమైనది. భగవంతుని సహజనామం.

మీరు ఉచ్ఛ్వాసనిశ్వాసాలను విడుస్తున్నప్పుడు కలిగే శబ్దాన్ని ఎప్పుడైనా విన్నారా? 'సోహం—సోహం' అని విని పిస్తుంది. ఒంటరిగా గాలిపీల్చండి 'సోహం' అని వినిపిస్తుంది. సంస్కృత భాషలో 'సోహం' అన్నశబ్దానికి ఒక అర్థం ఉన్నది. మరచిపోకండి. సంస్కృత భాషలోదానికిఅర్థం ఉంటే యింగ్లీషు భాషలో కూడా దాన్ని మీరు పరిగ్రహించాలి. భాషా శాస్త్రం యింగ్లీషు, ఫ్రెంచి, స్కాండినేవియా, రష్యన్, గ్రీకు, పర్షియన్ భాషలు సంస్కృతభాషకు కూతుళ్ళని రుజువుచేస్తుంది ఆనందమయులారా! సంస్కృతభాష మీయింగ్లీషు భాషకు తల్లి. తల్లికి చెందిందాన్ని కూతురుకూడా పరిగ్రహించాలి సిందే! 'సోహం' అన్నదానికి అర్థం యిది. 'సో' అంటే అది. 'హం' అంటే నేను ఉన్నాను. నేను అది దీనితో సంబంధిం చింది, గాలిపీల్చడంకూడా. గాలి పీల్చడంలో ధ్వనిస్తున్న (So-aham) 'సోహం' లో రెండు హల్లులు వున్నవి. రెండు

స్వతంత్ర శబ్దా లున్నవి. మొదట హల్లైన S, సకారం, రెండో హల్లైన H హకారం తీసివెయ్యండి. అప్పుడు om (ఓం) మిగులుతుంది. మానవుడి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు, ప్రాణం, ప్రపంచ జీవనమూ. ఓం అన్న స్వతంత్రధ్వనిమీద ఆధారపడి ఉంది. ఇతరశబ్దాలన్నీ దానిమీదనే ఆధారపడి ఉన్నవి. ఆధారపడి ఉన్న శబ్దాలు తీసివేస్తే, స ప్రాణమైన ఆత్మశబ్దం 'ఓం'. మీ ప్రాణాలకు ప్రాణం ఓం. మీ ప్రాణానికి ఆత్మ ఓం. మీలోపలి స్వర్గానికి భగవంతుడు ఓం. ఆత్మకు సహజమైన పేరు ఓం, మీ ఆత్మలకు ప్రకాశజ్యోతి ఓం. జీవితాల జీవితం, ఆత్మల ఆత్మ ఓం.

ఓంకారాన్ని గానంచేస్తే తరంగితమయ్యే మహాస్థితిని గురించి సశాస్త్రీయంగా మీకు చెబుతాను.

ధ్వనులు రెండురకాలు. మీకు తెలుసు; వ్యాకరణంలో వ్యక్తధ్వనులు, అవ్యక్తధ్వనులు. సంస్కృతంలో వ్యక్తధ్వని సాక్షరంగా పలికేది.అవ్యక్తధ్వని అక్షరవిహీనమైంది. సాక్షరమైన శబ్దం ఒక ధ్వని. సాక్షరంకాని శబ్దం ఒకధ్వని. సాక్షరమైన వ్యక్తధ్వని మేధస్సుకు సంబంధించింది. అవ్యక్తధ్వని హృదయానికీ ఉద్రేకాలకు సంబంధించింది. ఇది మన తత్వశాస్త్రవేత్తలు చెప్పింది. వ్యక్తధ్వనికి అర్థం ఉన్నది. కానీ కొందరికే తెలుస్తుంది. నేను మీతో యిప్పుడు యింగ్లీషుతో మాట్లాడుతున్నాను. యింగ్లీషు రానివాండ్లకు ఈ ఉపన్యాసం అర్థంకాదుకదా! కాబట్టి ఏభాషవచ్చిన వాండ్లకు ఆ భాషలో ఉపన్యాసమే అర్థమవుతుంది. ఎవ

రైనా యిప్పుడు మీతో పర్షియన్ భాషలోగాని, సంస్కృతం లోగాని, రష్యాభాషలోగాని మాట్లాడితే అర్థంకాదు. అతను యింగ్లీషు రాకపోయినా పెద్దగా ఏడుస్తా డనుకోండి. మీకు తెలుస్తుంది. అతను దుఃఖంలో ఉన్నాడనీ, సహాయార్థి అనీ తెలుస్తుంది. ఒకడువచ్చి సంస్కృతంలో, పర్షియన్‌లో జపానుభాషలో మాట్లాడుతా డనుకోండి. మీకు తెలియదు. నవ్వితే మీకు అర్థమవుతుంది. ఈనవ్వు సాక్షరమైన భాష కాదు. అవ్యక్తమైన ధ్వని, ఒక పసిబిడ్డ మాట్లాడ లేదు. కానీ అవ్యక్తమైన ప్రేమభాష. అర్థంకాని చోటు లేదు. ఇక్కడికొక పిల్లి వస్తుంది. దాన్ని తోలా లనుకుంటావు. దానికోటి సంస్కృతంలో మాట్లాడు. అరబిక్‌లో, యింగ్లీషులో మాట్లాడు. అర్థం కాదు. కాని చప్పట్లు చరిస్తే అర్థమై వెళ్ళిపోతుంది. ఇది అవ్యక్త ధ్వని - వ్యక్తధ్వనికాదు. అవ్యక్తధ్వని, వ్యక్తధ్వనికంటె సద్యఃఫల మిస్తుంది. అందుచేతనే, అవ్యక్తధ్వని సకలబ్రహ్మాండ భాష. మేధస్సుకంటే సూక్ష్మమైన హృదయానికి సంబంధించిన మధురభాష, యీ అవ్యక్తధ్వని. 17, 19 శతాబ్దాల తత్త్వవేత్తలు మానవుణ్ణి పరిపాలించేది మేధస్సంటారు. ఈనాడు దీనిలోపం కనుక్కోబడింది. ఇప్పుడు వైదాంతిక జగత్తు మానవుణ్ణి పరిపాలిస్తున్న ప్రకృతియొక్క స్థానం, హృదయమని గ్రహించింది. మానవుణ్ణి పరిపాలిస్తున్న ప్రకృతియొక్క సింహాపీఠం హృదయం. అవ్యక్త మధురధ్వని భాష, యీ హృదయాంతరంలో నుంచే వస్తుంది. ఒక స్త్రీ యీ విధంగా అంటుండంగా నేను విన్నాను— "మీరు నాకు చర్చిల్లో

బోధించి, నన్ను కరిగించలేరు. చర్చిల్లో గానామృతంచేత మీరు నన్ను కరిగించగలరు." చర్చిల్లో బోధలకంటే, గానం అద్భుతమైంది. ఎందుచేత ? మీరు దుఃఖంగా ఉన్నారనుకోండి. ఒకరెవరో 'పియానో' మీద గాన తరంగాలను *మధురంగా ప్రవహింపచేస్తే, అప్పుడు మీ మనస్సు శాంతిపడుతుంది. నాకు ప్రాచ్యఅరోరాలో ఒక స్నేహితు డున్నాడు. అతను పనివాండ్లకు విసుకుపుట్టినప్పుడు, పని ఆపెయ్యమని చెప్పి, పియనో మీద పాడించేవాడు. అప్పుడు మళ్ళీ అంతా చక్కబడింది. సంగీతం ఉద్ధమధురమైంది. ఫ్రాంకో, పర్షియన్; యుద్ధంలో సంగీతం వినడంచేత కొంతమంది ఫ్రెంచివారికి యింటిమీాద గాలిమళ్లింది. శెలవు పెట్టారు. యుద్ధం చెయ్యలేకపోయారు. యుద్ధరంగంలో ప్రజలను సంగీతం మహా ఉద్రిక్తులను చేస్తుంది. మీరు అపోలో సంగీతంవల్ల 'రాయి' అనే పట్టణ స్థాపనను గురించి వినేవున్నారు. సంగీతంవల్లనే ఆ పట్టణం వచ్చింది. ఒక ద్వీపం ఉండేది. ఆ ద్వీపంలో కొంతమంది మోహినులుండేవాండ్లు. వాండ్లు క్రూరులు. సంగీతం పాడి, బాటసారులను ఆకర్షిస్తారు. ద్వీపంలోకి తెప్పించి, మూడు రోజులు వారితో ఆనందించి, చంపి తినేవాండ్లు. సంగీతం అంత మహత్తరమైంది.

ప్రపంచంయొక్క ఆకర్షణలను గురించి యిది చెబుతూవున్నది. ఆకర్షణలు ఎంత క్రూరమైనవి. మూడు రోజులు సుఖమిచ్చినట్లే యిచ్చి చంపుకోని తింటాయి. అయినా ఆకర్షణలోకె పోతారు జనులు. 'ఆర్ఫియస్' అనే అతను

పాడినప్పుడు అతని గానామృతాన్ని వింటానికి సెలయేళ్ళు నిశ్చలమై ప్రవహించకుండా ఆగిపోయేవి. జంతువులు చెవులు నిక్కపొడుచుకొనేవి. ఒకవైపు సింహం వినేది. ఒకవైపు గోవు వినేది. ఒకవైపు మేక వినేది. ఒకవైపు తోడేలు వినేది. కానీ సర్వజంతువులూ ఆ గాన మాధుర్యంలో ఒళ్ళు మరిచిపోయేవి. 'సెయింటు శెశీలా' ఒక దేవతను సంగీతంవల్లనే తెచ్చింది. అలగ్జాండ రను దివ్యస్థితిలోకి తీసుకోపోయిన ఒక గానాన్ని గురించి 'అలెగ్జాండరున్ఫీస్టు' అనే గ్రంథంలో మీరు వినే ఉంటారు.

'అతను ఛేమ్యాన్ని ఆకాశంలోకి తీసుకవెళ్ళాడు. ఆమె (శెశీల) దేవతను భూలోకంలోకి దించింది'

ఈగాయకుడు శెశీలాకంటే ఉన్నతస్థితిలో ఉన్నాడు. సంగీతం భాషకతీతమైన ఒక అవ్యక్త మధురధ్వని. ఎంతమధుర మైంది సంగీతం! విజ్ఞానశాస్త్రం ఒక్కొకధ్వనికి ఒక్కొక ప్రభావం ఉంటుందని రుజువుచేస్తుంది. అది నిజం. ఇది మీ మనస్సుల్లో ఉంటుంది.

ఓంకారం యీ అవ్యక్త మధురధ్వని. ఈ అవ్యక్త మధురధ్వనివల్ల; సర్వుల్లోని ఆత్మానుసంధానం కలుగు తుంది. ఇప్పుడుదీన్ని రుజువు చేయలేకపోయినా ఇంకా కొంచెం అభివృద్ధిపొందితే విజ్ఞానం శాస్త్రంకూడా యీ ప్రభావాన్ని రుజువు చేయగలదు. అనేక మహానుభూతులను నిర్మథించి మీముందు వేదాంత తత్వ భాగ్యరాసులను పోశాను. ఈ

మార్గంవల్లనే హిందువులు దివ్యదార్శనికులైనారు. ఆత్మజ్యోతిని కన్నారు!

ఓం. ఓం. ఓం.

నాలోన ప్రవహించు నదివోలె శాంతి
నాలో ప్రశాంతి సాగరమట్లు పొరలు
ప్రవహించు శాంతి గంగాధుని యట్లు
నా జటాతతినుండి నా పాదయుగళ
మందుండి ప్రవహించు నమృత ప్రశాంతి
వేగమే తెండు నా పెండ్లిదుస్తులను
ధవళ తేజోవస్త్ర సముదయంబులను
మెరిసెడు బంగారు కిరణముల్ తెండు
ఒక్కసారిగ మాయ తెరల చింపండి!
మోదాశ్రు మాలలారా! స్వచ్ఛలీల
స్వేచ్ఛతో ప్రవహించుడీ! ప్రవహించు
డానంద దివ్యాశ్రు మాలికా వితతి!
ఓ దివ్యజీవనామృతరసవాహి
నీ! ఒహో! యత్యద్భుతానంద మధువు!
ప్రతి రోమ కూపంబులో నిండిపోయె
మన్మానసమునందు పొరలి పొంగెడిని!
ఓ చేపలార! ఓహో కుక్కలార!
ప్రకృతి మహాశక్తులార! రారండి!
పశుపక్షి తతులార! రారండి! రాండి,
వలయువారెల్లరు రారండి! రాండి,

తాగుడీ చిక్కని నారక్తజలము
తినుడి నామాంస ఖండంబులదినుడి,
రండి-యీ పెండ్లి విందున పాలుగొనుడి!
తాండవించెదను నే తాండవించెదను.
చుక్కలలో సూర్యసముదయంబులను
సాగరంబుల స్వేచ్ఛతో తాండవింతు!
చంద్రగోళములందు మేఘజాలముల
వాయువులందు నే తాండవించెదను
వాంఛలో నుద్రేకముల, మానసమున
తాండవించెదనహో తాండవించెదను!
తాండవించెదను బ్రహ్మానందవశత
నేపాడుకొనెదను-నేపాడుకొనెద,
మధురస్వరాపార సాగరంబేను
ఏకశ్రుతిని నేనహో మధుశ్రుతిని
దర్శకుండను మరి దృశ్యవస్తువును
అలలట్లు నాలోన పొరలుచునుండు
నాలోన యీ జగత్రోక బుద్బుదంబు !

ఓం! ఓం!! ఓం!!!

---

# భారతదేశానికి ప్రపంచం ఉన్న ఆధ్యాత్మిక ఋణం

(1904, జూలై 29 తేదీ యిచ్చిన ఉపన్యాసం)

ఈఉదయం విద్యార్థుల్తో ప్రసంగిస్తూ రాముడు యిలా అన్నాడు. "నేనుపుట్టినట్టు నాకు జ్ఞాపకంలేదు. నిజంగా నేను పుట్టలేదు, ప్రపంచంలో యేశక్తిగూడా నేను మరణిస్తానని నన్ను ఒప్పించలేదు." యిండియాలో ఒక మహాసభలో ఉపన్యసిస్తూ రాజకీయ దృక్పథంతో మాట్లాడాను. ప్రేక్షకుల్లో జడ్జీలు, లాయర్లూ, యింకా పెద్ద పెద్ద గవర్నమెంటు ఉద్యోగులూ ఉన్నారు. ఉపన్యాసానంతరం, వారందరూవచ్చి అభ్యంతరంగా యిలా అన్నారు "స్వామీ, యికముందు యీలాంటి ఉపన్యాసా లివ్వకండి, మీరు జైల్లో పడటమో ఉరిస్తంభానికి పోవడమో జరిగే అవకాశం ఉంది" రాముడు చెప్పిన జవాబు యిది. దివ్యులారా! నేను యెప్పుడూ జూడస్ యిస్కారియట్ పాత్రను ధరించి సత్యక్రీస్తును ముప్ఫై నాణాలకు అమ్మలేను. నా ఆత్మచ్ఛేదం చేయగలంతపదునుగలకత్తి, యీలోకంలో ఉందని నన్ను యెవరూ నమ్మించలేరు. అనంత స్వరూపుణ్ణి, జననమరణ రహితుణ్ణి, అయిన నన్ను గాయపరచగల ఆయుధంలేదు. భూతభవిష్యత్తుల్లో మార్పులేని, నేను యెందుకు రాజీపడాలి మీతో?"

నాసంభాషణలు, మీరు తరుచుగా వినడానికి అల

వాటుపడి ఉండకపోవడంవల్ల, కొత్తగా ఉండవచ్చు. అయినా సత్యపదాన్ని వివరించడం నావిధి.

ఈ దేశంలో హిందూదేశాన్ని గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. నిన్నటిరోజున 'మినియ 'పోలిస్' ఉపన్యాసం యిచ్చినతర్వాత ఒకస్త్రీ వచ్చి రాముడితో యిలా అంది. స్వామీ, గంగానదిలోని మొసళ్ళకు (హిందూదేశములో) స్త్రీలు యింకా తమ పసిపాపల్ని పారవేయడం లేదా? "నేను ఆమెతో చెప్పాను" "దివ్యరాలా! నేనుకూడా గంగా నదిలో పారవేయబడ్డాను. కాని మీకథల్లోని జోనాలాగా యీదివచ్చాను.'' అని నిజానికి, నేను గంగోత్పత్తి స్థానం నుంచీ మైదాన ప్రదేశం చేరిందాకా ప్రయాణం చేశాను.. మీలో నాతో ప్రయాణం చేసిన అనుభవం కలవారికి కించిత్ శరీరం రోజుకు 40 మైళ్ళు నడుస్తుందని తెలిసి ఉంటుంది. ఒక చివరినుంచీ యింకో చివరిదాకా గంగా తీరం వెంబడే నడుస్తూంటే, ఆ దివ్యనది నిర్మలంగానూ, స్వచ్ఛంగానూ, వేగవంతం గానూ, కనపడుతుంది. శాస్త్రం పేరుతో మొసళ్లు దానిలో జీవించలేవు. మొసళ్లు చిన్నబురద ప్రదేశాల్లో నివసిస్తాయి గాని ఆనదిలో అవిలేవు. కథాకల్పనా చతురుల మధుర హృదయాల్ని దీవించండి! యిలా ఉంటవి యీ దేశంలో హిందూ దేశాన్ని గురించి ప్రచారంలో ఉన్న కథలు!!!

ఒకరోజున వాషింగ్టన్, సియెటిల్ నుంచీ, ఒకహిందువు విద్యార్థి ఒక కొత్త విషయాన్ని గురించి ఉత్తరం వ్రాశాడు.

ఒకనాడురాత్రి, అతను బస్సుమీద ఒక అధ్యాత్మిక సంఘం నుండి యింటికి వెళుతున్నాట్ట. ఒక పిల్లగూడా ఆ కారులోనే యెక్కింది. యిద్దరూ కలసి వెళ్లుతూ. ఆపిల్లదిగిపోగానే, అతను గూడా దిగాడు:- అతని యిల్లుగూడా ఆసమీపంలోనే. ఒక గంట తర్వాత పోలీసువచ్చి ఆవిద్యార్థిని అరెస్టుచేసి, ఆరు గంటల సేపు అతన్ని జైల్లోఉంచారు. ఉదయం అతన్ని విచారించారు. ఆపిల్ల చేసిన కంప్లెయింటు యిది "అతను నన్ను తన తీక్ష్ణమైన నల్లని ఆధ్యాత్మిక దృష్టులతో చూశాడు. నాకుమత్తు చల్లినట్లైంది. భయపడ్డాను." అని. భగవంతుడా! అమెరికా వచ్చే ముందు హిందువులు తమకళ్లని యెక్కడ దాచిపెట్టుకోనిరావాలి?!!। యీ దేశంలో కొన్ని చోట్ల హిందువుల్ని గురించి యిల్లాంటి భావాలు ప్రచారంలో ఉన్నాయి.

ఇంక మంచిని గురించి చూద్దాం! సనాతన హిందూదేశపు అనంతమైన సంపద గురించి, ఒకదానివెంట ఒకటి సత్యాల్ని ప్రతిపాదిస్తాను. హిందూదేశంలో బంగారపు యిండ్లూ వెండి బజార్లూ ఉన్నాయనీ యూరోపులో అనుకునే వాళ్లు. అందుకని వాళ్లకు ఆశబలిసి, హిందూదేశ సంపదను వేటాడాలని బుద్ధిపుట్టింది. యూరపులో మూల మూలల్నించీ, హిందూదేశాన్ని జయించడానికి దండెత్తివచ్చారు. కొందరు పశ్చిమోత్తర మార్గం ద్వారా వచ్చారు. మీకొలంబసు మొదట్లో యిండియాకు క్రొత్తమార్గం అన్వేషించడం తోనే, బైలుదేరి అమెరికా చేరుకున్నాడు దైవవశాత్తు. అంటే ఒక రోజున యిండియా భౌతిక సంపదతో ప్రపంచాన్ని భ్రాంతి

పెట్టింది. పారశీక గ్రీకు రచయితలు హిందూదేశ దేవాలయాల్ని గురించివ్రాసిన వ్రాతలను మీకు సూచించ వలసి ఉంది. ఒక దేవాలయంలో పదివేల భృత్యులున్నారు. దాని కప్పు లోపలి భాగం రత్నాలతో మణుల్తో చెక్కబడింది. హిందూదేశ భౌతిక సంపదను గురించిన యీ విషయాల వాస్తవత్వం ఋజువు కావడానికి మీకు చారిత్రాత్మకమైన ఆధారాలు కావలసి ఉంటే, వారన్ హేస్టింగ్సు లార్డుక్లైవులను గురించిన, యెడ్మండ్ బర్కు ఉపన్యాసాలను చూడండి.

ఇండియా వైజ్ఞానిక సంపదను గురించి చాలాచెప్పాల్సి ఉంది. యిండియాలో మహా ఆశ్చర్యకరమైన జ్ఞాపక శక్తిని ప్రదర్శించిన మనిషిని నేను చూశాను. దాదాపు యాభై, అరవైమంది అతనిచుట్టూ అర్ధ చంద్రాకారంలో కూర్చున్నారు. అక్కడ వున్న ప్రతివాడి దగ్గిరా ఆతని యిష్టమైన గ్రంథంనుంచీ దీసికున్న భాగాలు ఉన్నాయి. అందులోకొందరు యింగ్లీషు, అరబ్బీ, హిందుస్థానీ మొదలైన గ్రంథాల్లో నుంచీ భాగాల్ను యేరుకున్నారు. అయితే యీ మనిషి అంధుడు. ప్రతివాడూ తను యెన్నుకున్న భాగరచనా భాగములోని పంక్తుల సంఖ్యను చెప్పారు. తరువాత వరుసగా, ప్రతి పృచ్ఛకుడూ, ఒక్కొక్క పంక్తిని చదివారు. మొదటి పృచ్ఛకుడు, యిరవై పంక్తులు కలిగిన తనరచనా భాగంనుంచీ మొదటి లైనుచదివాడనుకుందాం. యింకొకడు తనపదమూడు పంక్తుల్లో నుంచీ, ఒకలైను చదివాడు. యిల్లాగే వరుసగా అందరునూ. మళ్ళీ రెండవదఫా అందరూ ఒక్కొక్కలైను చదివారు. ఈ

విధంగా క్రమంలేకుండా మిశ్రమంగా, పంక్తులన్నీ యీఅంధ ప్రవక్తకు చదివి వినిపించ బడ్డాయి. పదమూడవసారి, 13 పంక్తుల రచనా భాగం గల మనిషి దగ్గిరికి వచ్చేటప్పటికి అతను "ఓ; ఫలాని మనిషీ! నీపంక్తులు అయిపోయినై, అనితన మనస్సులో ఆపంక్తులనన్నీ ఒకక్రమంలో అమరుచికోని ఒక్క తప్పుకూడా లేకుండా ఆరచనాభాగం యావత్తు అతను వల్లించాడు. ఆలాగే మిగతాపృచ్ఛకులభాగాన్ని కూడా ఆయా సమయాల్లో పఠించాడు.

కొన్ని మనస్తత్వ పరిశోధల్ని గురించి చెప్పుతాను. ఒక స్వాములవారు హిందూదేశాన్ని దర్శించాడు. ఆయన అయిదు నిముషాలపాటు దేహవిస్మృతిని పొందగలడు. అయితే హిమాలయాల్లో ఆరునెలలు మరణంతో సమానమైన అవస్థను పొందగల స్వాముల్ని చాలామందిని చూశాను. ఆరు నెలల తర్వాత పునర్జీవంపొందిన ఒక ఉదాహరణ ఉంది. ఒక స్వాములవారిని పెట్టెలోపెట్టి భూమిలో పూడ్చిపెట్టారు, ఆరు నెలలతర్వాత త్రవ్వి బైటికితీసి ఆయన యిదివరకే చెప్పిన కొన్ని పద్ధతులను వారవలంబించడంచేత, ఆయన బ్రతికాడు. దివ్యులారా, యీవిషయాన్ని కొంచెం ఆలోచించండి!మూడు రోజులు మిథ్యామరణావస్థను పొంది ఒకమనిషి జీవించాడు. యూరపు దేశమంతా ఆతని వ్యక్తిత్వగౌరవానికి దాసోహమన్నది. అలాంటప్పుడు యిండియాలో ఆరునెలల తర్వాత పునర్జీవిస్తారు. అయితే మనం దీనికి యెంతవిలువ యివ్వాలో అంతేయిస్తాము. యిది ఆధ్యాత్మికత కాదు. ఒక శాస్త్రీయ

మైన శారీరక మనస్తత్వపద్ధతి. నేటికాలపుడాక్టర్లకు అది తెలియకపోతే, వాళ్ళు శాస్త్రజ్ఞానంలో యింకా నేర్చుకోవలసింది ఉందన్నమాట. దానికి మనం తగుమాత్రంగానే విలువను యిస్తాం.

అనుకూలపక్షానికి వచ్చేముందు వ్యతిరేకపక్షాన్ని గూర్చి రెండుముక్కలు చెప్పాల్సిఉంది. ఒకరోజున ఒక పెద్ద మనిషివచ్చి యిలా అన్నాడు. "స్వామీ మీ వేదాంతంతో మమ్మల్ని (బాధ) విసిగించకండి! అదిచాలా పాతదికాదా?" సత్యానికి పాతక్రొత్తలు ఉంటాయనేదృష్టితో, సత్యం చంచలమనీ, మారుతుంటుందనీ, అనుకున్నాడేమో! నేనుచెప్పాను. "సోదరా! నీయొక్క అభివృద్ధికీ అమెరికా యూరపు దేశాల పురోగమిత్వానికి కారణం యేమిటో తెలుసుకున్నావా?" "మీమతం పాతపడిందని"అతను అనడంచేత నేనీ సమాధానం యివ్వవలసివచ్చింది. మామతం జీవిస్తూనేఉంది. యింకా ముందు అల్లాగే ఉంటుంది. నిత్యనూతనమైంది మామతం. అనుకూలపక్షంలో నొక్కి చెపుతుంది. మీది వ్యతిరేకంగా శాసిస్తుంది. "యిది నీవుచేయ్యకూడదు"అంటుంది మామతం అన్నాను. నేను యింకా యిలా అన్నాను. "ఓ దివ్యుడా! అమెరికా అభివృద్ధికారణం విచారిద్దాం. అమెరికా మతం ఏమిటో, గూడా చూద్దాం." వాళ్ళమతం మెడకు చుట్టిన తాయిత్తు లాగా అరిగిపోయిందని చెప్పాను. ఒక బాలుడు మెళ్లో తాయిత్తును ధరించి తన విజయాలకు కారణంగా తాయిత్తు యొక్క మాహాత్మ్యం అనుకుంటాడు. అయితే తన

అపజయాలకు మాత్రం తనకృషి లోపం కారణంగా యెంచు తాడు. దివ్యులారా! మీ అభివృద్ధికి గర్వకారణమైన నాగరి కతకూ నిజమైన కారణం యింకోటివుంది. దానికారణం క్రైస్త వత్వంకాదు. చర్చిమత మాహాత్మ్యం కూడా కాదు. చారిత్ర కంగా ఆలోచిద్దాం. మనం చరిత్ర చదువుకోని, య్యాక్రైస్తవ మతమూ, చర్చీలు, యూరపులో ప్రవేశించక ముందు కూడా, కల్గిన యీ నాటి యూరపు అమెరికాలకు సమానం గానో, లేక అంతకంటే అధికం గానో, నాగరికత అభివృద్ధి పొందినజాతులు, దేశాలు, ఉన్నాయని తెలుసు కొంటాము. ఈజిప్టు, చైనా దేశాలు, తమ తమ ప్రత్యేక నాగరికతలను కల్గిఉన్నాయి. కొన్ని విషయాల్లో యూరపు కళ పురాతన యీజిప్టు. చైనాలతో తులతూగ లేదు. పర్షియా, గ్రీసు, రోం దేశాలు తమ ప్రత్యేక నాగరికతలను కల్గి ఉన్నాయి. — యిండియా సంగతి అలా ఉంచండి. యీ దేశాలన్నిటికే యీ జాతులన్నిటికే నాగరికత ఉంది. అయితే యివన్నీ క్రైస్తవ మత దేశాలుకావే! నాగరికతా, భౌతికాభ్యుదయమూ, యెల్ల ప్పుడూ క్రైస్తవమత సహచరులే. ఆయితే, ఆమతం జన్మిం చక పూర్వమే ఉన్న యీ దేశాలకు నాగరికతా భ్యున్నతులు యెలాకల్గినయ్యో వివరించ వలసిందని కోరుతున్నాను. అంత మారం యెందుకు? ఒకకాలం ప్రపంచంలో అధికోన్నతి పొం దిన గొప్ప దేశం రోం ను చూస్తున్నాము గదా! రోం పతనం అయితే రో మను సామ్రాజ్య పతనానికి దారితీసింది యేమిటి? రోం పతనానికి మార్గదర్శి క్రైస్తవమత ప్రవే

శమే. యీ విషయంలో గిబ్బన్ మహాశయుడి రచనలు చదవండి. లేదా యింకా యేదైనా విశ్వసనీయమైనా చరిత్ర గ్రంథాన్నైనా చూడండి. క్రైస్తవమతం రాకముందు గ్రీసుదేశం అభ్యున్నతితో, సౌఖ్యంతో నిండివుంది. క్రైస్తవమత పరివ్యాప్తమైన నేటి గ్రీసుదేశం, పౌరాణిక యుగంలోని అక్రైస్తవమైన గ్రీసుతో పోలిస్తే యేమాత్రం నిలవగలదు? మనం "రా. చరిత్ర చదువుకో"అంటాం అయితే అమెరికా దేశవర్తమాన భాగ్యోదయాన్ని క్రైస్తవమతానికి చర్చిమతానికీ అంటగట్టడానికి యెవ్వరికీ కించిత్తు అధికారంకూడా లేదు. యూరపులో క్రైస్తవమత ప్రవేశానంతరం' వేయిసంవత్సరాలకంటే యెక్కువకాలం. యూరపు దేశమంతా 'అంధయుగం'అని పిలువబతే అంధకారచ్ఛాయల్లో ఉంది. ప్రపంచంలో యెన్నడెరుగని అంధకారం వర్ణనాతీతమైన మూఢవిశ్వాసాలు అజ్ఞానమూ. గడ్డకట్టిన యుగమది!!! యూరపులో క్రైస్తవమత ప్రవేశంవల్ల కల్గిన ఫలితమియిదే!!!

కొందరు అంటారు "యిటుచూడండి. క్రైస్తవమతం యేంచెయ్యలేదు? క్రైస్తవత్వం ప్రపంచనాగరికతాభివృద్ధికి ప్రథమ కారణం"అని! పరిశోధనలూ,మంత్రవేత్తలనే నెపంతో మానవుల్ని కాల్చడం, శాస్త్రీయజ్ఞానుల్ని హింసించి వేధించడం, యిలాంటి నాగరికతను అభివృద్ధి చేసింది క్రైస్తవమతం! యెక్కడ శాస్త్రజ్ఞానం అభివృద్ధిని పొందదలచిందో, అక్కడికి క్రైస్తవమతం తక్షణం దాన్ని చంపడానికీ, నశించ

డానికీ వచ్చింది! బ్రూనో తన శాస్త్రీయమైన సత్యదృక్పథం కారణంగానే కాల్చి చంపబడ్డాడు! బెకన్, కార్లైలు, వీళ్లను క్రైస్తవమతం యెలా ఆదరించిందో మీకు తెలిసే వుంటుంది. (యీపరిస్థితుల్లో) అమెరికాదేశ సౌభాగ్యానికి యేది దోహదమిచ్చిందో ఆలోచించి చూద్దాము.

దివ్యులారా! చర్చిలలోని బోధనా వేదికలనుండి వెలువడ్డ, ఉపదేశించబడ్డ, నరకాగ్ని కాదు మిమ్మల్ని ఉద్ధరించింది. ఆవిరి యంత్రంనుండి వచ్చే అగ్ని, విద్యుచ్ఛక్తి, ముద్రణ యంత్రాలు, రైలుస్టేషన్లూ, పొగయోడలూ, యివీ మీ భౌతికోన్నతికి దోహదకారులు. డాక్టరు జాన్‌సన్ యిలా అన్నాడు. "ఒక కుర్రవాడు, ఒకకిటికీనుంచి చూచి, యింకో కిటికీనుంచి చూశానని చెపితే అతన్ని కొట్టండి" అని. అందుకనే ఒక కారణం వల్ల జరిగిందాన్ని వేరొక కారణానికి అంటకట్టితే మీరు దేనికి అర్హులవుతారూ? మీభౌతికోన్నతికి నిజమైన కారణాలు నేను పేర్కొన్న శాస్త్రీయ కల్పనాశక్తులూ, కనిపెట్టబడిన క్రొత్త విషయాలూ. ఈకనిపెట్టబడిన, కల్పించబడినవాటిలో, యేదీ గూడా మతాధ్యాపకులను, చర్చి పూజారులచేత జరిగియుండలేదు. జేమ్సువాట్, జార్జిస్టీవన్‌సన్, బెంజిమన్ ఫ్రాంక్లిన్, థామస్ యెడిసన్ వీరిలో యెవరూకూడ మత ప్రధానులు కారు, మిషనరీలు కారు. ఈ మహాశయుల్లో యేఒక్కరైన మతబోధకులైనట్లయితే, మీభౌతికాభ్యున్నతికి మతమే కారణం అని అప్పుడు చెప్పవచ్చు. అయితే చర్చి ప్రధానిచేత కనిపెట్టబడింది, ఒక తుపాకిమందు మాత్రమే!.

మతబోధకుల దివ్యహస్తాలనుండి, దివ్యమేధస్సునుండి వచ్చిన ఒకేఒక కొత్త విషయం, తుపాకిమందు మాత్రమే!!

మీ భౌతికాభ్యుదయానికి కారణం చర్చిమతం కాదు, క్రైస్తవ మూఢత్వంకాదు. అని మీరు అనుకుంటారు. కాదు. యూరపు, అమెరికాల భౌతికోన్నతి, వాటి మతం యెలా కారణం కాదో, అలాగే హిందూదేశ భౌతిక పతనానికి కారణం హిందూమతం కాదు. మీ అభ్యున్నతికి నిజమైన కారణం— యేదేశాభ్యున్నతి కైనాసరే — సత్యమైన ఆధ్యాత్మికత. అయితే, బహురూపాలు. మూఢ విశ్వాసాలూ, మతనమ్మకాలూ, అనేక వేషాలూ, వీటినుండి భిన్నంగా సత్యమైన ఆధ్యాత్మికతను నేను చూస్తాను. అందువల్ల అమెరికా సౌభాగ్యానికి కారణం నిజమైన హృదయపూర్వకమైన ఆధ్యాత్మకత, చర్చిలలోని బోధనా వేదికలనుండి వచ్చే ప్రబోధనలూ, ఆచారాలూ, ఉన్నప్పటికీ యీ సత్యమైన ఆధ్యాకత ప్రచారం చేయబడింది. "నీవు చెయ్యి, నీవుచెయ్య వద్దు" — యిలాంటి శాసనాలన్నీ మీ ఆధ్యాత్మికాభివృద్ధిని నిరోధించినై. కాని అభివృద్ధిపరచ లేదు. కాంట్ వాటిని వర్గ సంబంధమైన ఆజ్ఞలు అన్నాడు. అంటే మధ్యమపురుష ఆజ్ఞార్థకాలు. అటువంటి వాక్యాలన్నీ మీస్వాతంత్ర్యాన్ని అరికట్టుతాయి. స్వేచ్ఛను నశింపజేస్తాయి.

అయితే, సత్యమైన ఆధ్యాత్మికత యెక్కణ్ణించీ పుడుతుంది? ప్రపంచచరిత్రలో, యిది యెక్కణ్ణించీ, ఉద్భవించింది. యిదే నేను మీకు చెప్పాల్సిన ముఖ్య విషయం. సత్య ఆధ్మాత్మి

కతనే మేము వేదాంతం అంటాం. ప్రపంచంలోని అన్ని మతాలూ,ఒకవ్యక్తిత్వాన్ని ఆశ్రయించుకొని ఉన్నై. క్రైస్తవ మతం క్రీస్తునూ, కన్ఫ్యూషనిజం, కన్ఫ్యూషియస్‌నూ, బౌద్ధ మతం బుద్ధుణ్ణీ, జొరాష్ట్రమతం జొరాష్టర్‌నూ, మహమ్మదీయమతం, మహమ్మదునూ, ఆశ్రయించుకొని ఉంటై. వేదాంతం అంటే శాస్త్రంతం. ఆత్మశాస్త్రం అన్నమాట. రసాయనశాస్త్రాన్ని యేభావంతో చదువుతావో, అదే భావంతో వేదాంతాన్ని చదవాలి. లావసీర్, బాయిల్, రెనాల్డ్సుడేలీ మొదలైన రసాయన శాస్త్రజ్ఞుల దృష్టితో మీరు ఆ శాస్త్రాన్ని చదవరు. దాన్ని తీసికోని మీ అంతట మీరే వివరించుకోను ప్రయత్నిస్తారు. నీళ్ళలో ఉదజని, ప్రాణవాయువులు వున్నవని నా అనుభవాల అధికారంతోనే నమ్ముతానుకాని, నేను యితరుల అభిప్రాయంమీద ఆధార పడను. నీళ్ళ విద్యున్మయీ కరణమే నా కా విషయాన్ని తెల్పుతుంది. అల్లాగే ఒకరి అధికారంమీద ఆధారపడిన మతం, మతంకాదు. నీ అధికారంమీద ఆధారపడినదే సత్యము. ఈ దృష్టితో నేను మీకు యీవిషయాన్ని చదవను, అర్థంచేసుకోను, జీర్ణించుకోను, ఆత్మగతం జేసుకోను, గ్రంథాలమీద గ్రంథాలు సూచించవచ్చును. యిదే దృష్టితో వేదాంతాన్ని విచారించవలసిందని నేను మిమ్మల్ని కోరు తున్నాను. వేదాంతాన్ని నమ్మమని నా ఉద్దేశంకాదు. యెవర్నీ అన్యమతమార్గాలకు పట్టించటం నా ఉద్దేశంకాదు. కాని యీ వేదాంత శబ్దార్థాన్ని స్పష్టీకరించిన తర్వాత, యీ

వేదాంతం, యీ సత్యమైన ఆధ్యాత్మికత, ప్రపంచంలో అత్యున్నత పర్వతాలు, అంటే హిమాలయాలనుండి ప్రవహిస్తుంది అంటాను, మనోహరమైన ప్రవాహాలు, మనోజ్ఞమైన నదులు, అందమైన మాన్సూను వాయువులు, ఉన్నత ప్రదేశాలనుంచీ ప్రవహించినట్లే హృదయ పూర్వకమైన సత్యమైన ఆధ్యాత్మికత హిందూదేశం నుండి ప్రవహిస్తుంది. మీాయూరపు దేశంలోని ప్రాచ్య వాదులు ఈవిషయంమీాది గ్రంథాలు; క్రీ. పూ. నాలుగువేల సంవత్సరాల క్రితం వ్రాయబడినవని అంటారు. ఈలాంటి వారందరూ, యీ గ్రంథాల జన్మకాలాన్ని నిర్ణయించే తమ ప్రయత్నాల్లో, ప్రపంచం క్రీస్తు పూ. 4 వేల సంవత్సరాల క్రితం సృష్టించబడిందనే మూఢవిశ్వాసాన్ని కల్గి పనిచేస్తున్నారు. అయితే వేదవిద్యార్థిగా వీరు తేల్చిన సంగతులు తప్పులని వేదప్రమాణాలను చూపి ఋజువుచెయ్యగలను. ఒక విశ్వవిద్యాలయంలో గణితశాస్త్రాధ్యాపకుణ్ణిగా నేను ఉండేవాణ్ణి. డైనమిక్సు, జలశాస్త్రమూ, ఖగోళశాస్త్రమూ, త్రికోణశాస్త్రమూ, యీ విషయాలమీాద ఉపన్యసిస్తుండేవాణ్ణి. ఆ రోజుల్లోనే వేదాధ్యయనం చేస్తుంటే, వాటిల్లో తరచుగా ఖగోళంలో తారల తారాగణాల స్థలనిర్దేశాన్నిగురించి సంబంధాలు కన్పడుతుండేవి. మృగశిరా మొదలైన తారాగణాల స్థలనిర్దేశం వేదాల్లో చెయ్యబడింది. గణితంవేసి శాస్త్రీయమైన వేద ప్రమాణాలతో వేదాలు—కనీసం కొన్ని వేదాలైనా —క్రీ. పూ. 8 వేల సం॥ క్రితం వ్రాయబడినవని చెప్ప

గలను. చరిత్రకారులు పరామర్శించే శాసనపు ముక్కలు నమ్మదామా? లేక గణితసూత్రాలు తారాక్షరాలూ ద్వారా భగవంతుడు యిచ్చిన సత్యమైన సాక్ష్యాన్ని నమ్మ దామా? యిది చాలా విశాలమైన విషయం. అయినప్పటికీ నేను యీకొద్దికాలంలోనే వేదాల్లోని ముఖ్యమైన విషయా లను మీకు నివేదించగలను.

పురాతన గ్రీకు చరిత్రకారులు హిందూదేశాన్ని గురించి వ్రాసిన వ్రాతల్ని మీలో యెవరైనా చదివారా? క్రీ. పూ. 4 వేల సంవత్సరాలకిత్రం గ్రీకులు యిండియాను దర్శించారు. యీవిషయాన్ని చరిత్రే చెపుతుంది. గ్రీకులు తమ పర్యటనాన్ని గురించి వ్రాశారు. వాటిలో కొన్నింటిని నేను చదివాను కూడా. వారి వ్రాతల్లో, ఆరోజుల్లోని భారతీయులు ఆదర్శ జీవులని పిలువబడిన వారనే విషయాన్ని మీరు చూడగలరు. హిందువులు యెప్పుడూ అబద్ధం ఆడేవాళ్లుకాదని గ్రీకురచయితలు వ్రాశారు. స్త్రీలు పురుషులతోపాటు సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవించేవాళ్లు. పురుషులతో సమానులుగా స్త్రీలు జీవించేవాళ్ళు. పర్వతా రణ్య ప్రాంతాల్లో అద్భుత విశ్వవిద్యాలయాలు దేశంనిండా ఉండేవని వాళ్ళు వ్రాశారు. యిండియా భౌతిక సంపదను గురించి యెక్కువగా వర్ణించి, అవిశ్వాసత, అపవిత్రత, ఆ దేశంలో లేనేలేవని గ్రీకులు వ్రాశారు. ప్రజల జీవిత వేదాంత పద్ధతిని వారు వర్ణించి, మహానందాన్ని పొందారు. పురాతన భారతీయ ఉద్గ్రంథాల్లో స్త్రీలచే వ్రాయబడినవి, ఈనాటికి

కొన్ని కనపడుతున్నై. యిండియాలో జరిగిన సర్వమత పరిషత్తుల్లో ఒకదానిలో, ప్రపంచ వేదాంతుల్లో గొప్పవాడైన ఒక వేదాంతి ఉపన్యసించిన సమయంలో, ఆ పరిషత్తుకు ఒక స్త్రీ అధ్యక్షత వహించింది. మనోహరమై, మహదాశ్చర్యకరమైన గొప్ప గొప్ప వేదగానాల్లో, కొన్ని కొన్ని స్త్రీల దివ్యమైన మధుర హృదయాలనుండి ప్రవహించాయి. "ఆదిలో సత్యం స్త్రీలచేతనే లక్షింపబడింది" - అన్నప్పుడు నేను 'వాల్టు విట్' మన్‌తో యేకీభవిస్తాను.

అయితే, యిండియాలో అన్ని సంస్థల పతనం యేది తీసికొచ్చింది? విగ్రహారాధన. యెలావచ్చింది? విగ్రహారాధన హిందూదేశీయమైంది కాదు. ఈ రోజున క్రైస్తవులు ప్రజలంతా విగ్రహారాధకులని మీతో చెపుతారు. అగణితమైన వేదపు రచనల్లో, భారతవర్షంలోని; కవిత్వమూ, వ్యాకరణమూ, గణితమూ, శిల్పమూ, సంగీతమూ ఈ రచనల్లో దేనిలోగాని, విగ్రహారాధన విషయమే కనపడదు. అయితే యెక్కణ్ణుంచి విగ్రహారాధన యిండియాలోకి దిగుమతి అయింది? హిందూదేశంలోని మతంలో విగ్రహారాధన ఒక భాగం కానేకాదు. హిందూదేశంలోని విగ్రహారాధన క్రైస్తవుల ద్వారానే వచ్చింది. ఈ విషయానికి సంబంధించిన చరిత్రపుటలు ప్రజలు యింకా చదవలేదు. నా యీ పరిశోధన ముద్రిత రూపంలో గూడా వస్తూంది.

క్రీస్తుతర్వాత నాలుగు, ఐదు శతాబ్దాల మధ్యకాలంలో కొంతమంది రోమను కాథలికులు యిండియాకు వచ్చారు.

వారు యీనాడుకూడా దేశంలో ఉన్నారు. ఈ విషయం బహిరంతః ప్రమాణాలతో నేను ఋజువు చెయ్యగలను, దక్షిణ హిందుస్థానంలో నివసిస్తుండే వీరు సైంట్ థామస్ క్రైస్తవులని పిలువబడుతున్నారు. వీరే విగ్రహారాధనను ప్రవేశపెట్టింది. అంతః ప్రమాణంతో, ప్రముఖ విగ్రహారాధన వాదియైన రామానుజునికి మార్గదర్శి యీ సెంటు థామస్. క్రైస్తవుల్లో ఒకడని నేను ఋజువుచేస్తాను. వీరు నమ్రులై పూజించిన మొదటి విగ్రహానికి ప్రాచ్యకళ లేదని నాకు తెలుసు. దివ్యులారా! విగ్రహారాధన జన్మకారణం క్రైస్తవ మతమే నని దీనివల్ల తెలుస్తుంది. ఈ రోజున మీ మిషనరీలు విగ్రహారాధన్ను దూషిస్తూ యిండియాకు వస్తారు. ఒకవైపున దాన్ని నిందిస్తూనే, యింకోవైపున ఆ విగ్రహాలను జేసి డబ్బుసంపాదనంకోసం అమ్ముతుంటారు. ఈ విధంగా మీరు ప్రజల్ని అన్యమతంలోనికి మార్చాలని ప్రయత్ని స్తారు. మీరుచేసి, అమ్మే, మీవిగ్రహాలు, సత్యానికంటే శక్తివంతంగా ఉంటయ్యా! యీ విషయం నిర్ణయించు కోవడం మీవంతు.

ఇంకా ఆ దేశంలోని స్త్రీల బానిసత్వాన్ని గురించి మీకు చెపుతుంటారు. ఘోషాపద్ధతిని గురించిన్నీ—ఘోషాను గురించికూడా ఒకముక్క చెపుతాను. ఒకనాడు యిండి యాను పాలించిన మహమ్మదీయులు చాలా అవినీతి కరంగా ప్రవర్తించేవాళ్ళు, హిందూ కన్యను చూచినంతనే వాళ్ళు ఆమెను ఆమె గౌరవాన్నీ దొంగిలించను ప్రయత్నించేవాళ్ళు.

స్త్రీలు అసహ్యమైన కోప తాపాలకు గురిఅయ్యేవాళ్ళు. హిందువులు యీ ఘోరంనుండి తప్పించుకోదలచి, యే స్త్రీ కానీ, యౌవనదశలో తప్ప పెండ్లిచేసుకోకూడదనే ఆచారాన్ని యేర్పరచుకున్నారు. యింకా స్త్రీలు నగ్నముఖాలతో బజార్ల వెంబడి నడవకూడదు. యెందుకంటే మహమ్మదీయ రాజులు స్త్రీల ముఖాలను చూస్తే, వాళ్లని అపహరించడానికి పూనుకోవచ్చునుగనుక. ఈరీతిగా ఘోషాపద్ధతి ప్రవేశపెట్టబడింది. మహమ్మదీయ పరిపాలితమైన అన్ని దేశాల్లోనూ యీ ఆచారం ఉండనే ఉన్నది. హిందూరాజుల పరిపాలనా కాలంలో యీ పద్ధతి లేదు.

ప్రేమపాత్రులారా! హిందువులుకూడా మీవంటి రక్త మాంసములు కలవారే. వారి భాష మీభాషకు తల్లి. అంటే జన్మస్థానము. వారి ముఖము ప్రాచ్యము. అయినా వారు మీతో మీశరీరాలతో కలిసిపోతారు. నారంగు నలుపు అంటే నా చర్మము నునుపు చేయబడిందన్నమాట. మూసిఉంచబడిన నాశరీరభాగాలు మీలాగానే తెల్లగా ఉంటాయి.

యూరప్ ఆధ్యాత్మికంగా నాగరికంగా గ్రీసుకు ఋణపడిందంటే యే పవిత్రహృదయుడుగూడా ప్రతిఘటించడు. అయితే దివ్యులారా! గ్రీకుల సంగతి యేమిటి? గ్రీకు వేదాంతం యేమిటి? మీరెప్పుడైనా ప్లాటో, సోక్రటీస్, పైథాగరస్ రచనల్ని, హిందూ వేదాంతంతో జతచేసి చదివారా? మీరు చదివి ఉన్నట్లయితే ఆత్మయొక్క అమరత్వమూ, పున

ర్జన్మమూ, మొదలైన సిద్ధాంతాలన్నీ హిందూ వేదాంత సంత తేనన్న సంగతిని మీరు ప్రతిఘటించలేరు. అయితే గ్రీకులు సత్యాన్నంతా హిందువులనుండి గ్రహించలేదు. యిదే భేదం. అరిష్టాటిలు తర్కము హిందూ తర్కశాస్త్రంతో పోలిస్తే లోపభూయిష్ఠమని యీనాడు తేలుతుంది. గ్రీకులు వాదాన్ని, న్యాయాన్ని, విభజించే పద్ధతిని, హిందూపద్ధతితో పోల్చి చూస్తే, అరిష్టాటిలు పద్ధతి తప్పని తెలుస్తుంది. హిందూ గ్రంథాలలో తర్కంలో అనుమానిక ప్రేరేపక ప్రమాణాలు (deductive & Inductive) రెండూ చర్చించబడినై. గ్రీకులు, ఐరోపీయులు, అనుమానిక ప్రమాణాన్ని మాత్రమే సూత్రించారు. ఈవిషయాన్ని విలియం జోన్సు మహాశయుడు ఋజువు చేస్తాడు. "గ్రీకు రచనల్ని హిందూ దేశీయుల సమగ్రవేదాంత పద్ధతితో మనం పోల్చినప్పుడు హైందవ వేదాంతం అనే జలనుంచీ గ్రీకులు తమ విజ్ఞానాన్ని సంపాదించుకొన్నారని భావించకుండా ఉండలేము" అని అంటాడు విలియం జోన్సు.

బైబిలు క్రొత్త నిబంధనను పాతనిబంధనతో యేది వేరు పరుస్తుంది? "నేనూ, నాతండ్రీ ఒకటే," "నేను భగవంతునిలో జీవిస్తాను, సంచరిస్తాను, నివసిస్తాను"—"ఆదిలో శబ్దం ఉంది. శబ్దంభగవంతునితో కూడాఉంది. శబ్దమేభగవంతుడు" "కుమారుణ్ణి (క్రీస్తును) చూచినవాడు తండ్రిని (భగవంతుణ్ణి) చూచినట్లే" —"స్వర్గరాజ్యం నీలోనే ఉంది"—"నీపక్కవాణ్ణి నీలాగా, ప్రేమించు"—ఈలాంటి మహావాక్యాలే ఆ రెండింటిని

వేరుపరుస్తున్నై. "మీరు నా మాంసాన్ని తినండి, నారక్తాన్ని తాగండి. అలాకాకపోతే, మీరు రక్షింపఁబడరు." అని క్రీస్తు అంటే, జను లీ మహావాక్యాన్ని యెలా దుర్వ్యాఖ్యానం చేశారో చూడండి. మాంసం తిని, రక్తంతాగి ఊరకుండే బదులు, దాన్ని వేడుకగా, పండుగగా చేశారు. వేదాంతం తర్కం, అనే పేర్లతో, యీ విషయాలు చదువుకో వచ్చు.

వేదాలమీది గ్రంథాలు చదవండి. యీ సిద్ధాంతా లన్నీ వేలకువేలు సంవత్సరాలకు పూర్వమే హిందువుల వేద గ్రంథాల్లో వ్రాయబడి ఉన్నాయని తెలుస్తుంది. క్రీస్తుపున ర్జీవించుట, మతోపన్యాసము—యివి హిందూమత వేదాంత సంబంధులు. 'నికోలస్ నోటొవిచ్' అనే రష్యన్ రచయిత చేత ఫ్రెంచిభాషలో వ్రాయబడి యింగ్లీషులోకి తర్జుమాచేయ బడిన, "ది అన్ నోన్ లైఫ్ ఆఫ్ జీసస్" (క్రీస్తు అజ్ఞాత జీవి తము) అనే గ్రంథాన్ని, యీ సందర్భంలో మీకు గుర్తు చేస్తున్నాను.

ఈ గ్రంథం టిబెట్టు దేశంలోని ఒక మఠంలో దొరికిన వ్రాతప్రతులను ఆధారం చేసికోని వ్రాయబడింది. ఆ ప్రదే శాన్ని గ్రంథకర్త స్వయంగా సందర్శించాడు. పుస్తకాన్ని చదివానిక, దానిలో ప్రతిపాదింపబడిన విషయా లసత్యమని నమ్మకుండా ఉండలేము, క్రీస్తు తన 8 వ యేడునుండి 13 వ యేటివరకు హిందూ దేశంలో నివసించిన—బైబిలు యేమీ చెప్పని యీ కాలాన్ని గురించి—యీ గ్రంథం చెపుతుంది. ఈ విషయాలు అలాగే జరిగి ఉండవచ్చు. కాకపోవచ్చు. కాని

విజ్ఞానం యితరమార్గాల వల్ల జెరూసెలం చేరి ఉండవచ్చు. యెలాగైనా, క్రీస్తుచేతలూ, ప్రబోధాలూ హిందూదేశ వేదాంతానికి ఒక సన్నప్రతిధ్వని అన్నవిషయం ఉండనే ఉంటుంది. మీ బైబుల్లో "నీ ప్రక్కవాణ్ణి నీలాగే ప్రేమించు" అని ఉంటుంది. కాని దానికి కారణం చెప్పబడలేదు. దివ్యుడైన హెర్బర్ట్ స్పెన్సరు చెప్పినట్లుగా, ఒక శిశువును 'యిది చెయ్యి' మని మనం చెప్పితే, కారణజీవి (Rational animal) లోని ఉత్తమ ప్రకృతిని బానిసగా చేస్తున్నామన్నమాట. తర్కశాస్త్రవేత్తలు మనుష్యుణ్ణి కారణజీవి అంటారు. అధికారపూర్వకంగా ఒక శిశువుకు ఒక పనిచెయ్యమని ఆజ్ఞాపించడం అతని మనస్సును బానిసచేయడం. శిశువు తన సొంత అధికారం మీదనే నీ కిష్టమైన పనిచేస్తాడు. యిది 'చెయ్యి, చెయ్యవద్దు' అని ఆజ్ఞాపించిన తత్ క్షణమే మనస్సును బానిసచేస్తున్నావన్నమాట. ఒకసారి ఒక శిశువును నీ పేరేమని అడిగితే నాకు తెలీదుకాని మాఅమ్మ నన్ను 'వద్దు'అంటుంటుంది. "నీ ప్రక్కవాణ్ణి నీలాగా ప్రేమించు" అని చెప్పినపుడు నేను దీన్ని యెల్లాగా యెందుకు ఆచరించాలో చెప్పాల్సిన బాధ్యత నీది. దైవత్వ ప్రధానులు, గుత్తదారులూ, హిందువుల్ని తమ హృదయపూర్వకంగా ద్వేషిస్తుంటే, నా ప్రక్కవాణ్ణి నాలాగే యెలా ప్రేమించేది నేను? ఈ పరిస్థితుల్లో మన ప్రక్కవాళ్ళను మనలాగా యెలాప్రేమిస్తాం? యెన్నో ఆజ్ఞార్థకాలు లోకానికి బోధచేయబడినై. అయినా లోకం యథాస్థితిలోనే ఉంది. కాన్ఫ్యూషియస్, జోరాష్టర్ శ్రీకృష్ణుడు - వీరు జగత్తును

ప్రబోధించారు. అయినప్పటికీ జగత్తు పాపభూయిష్ఠంగానే ఉంది. వెనుకటికంటే ప్రపంచం సుంతైనా సుఖవంతమైందా? ఎవరో చెప్పినట్లు జ్ఞాపకం - జగత్తు కుక్కతోకలాగా ఉందని - కుక్కతోకను వెదురుగొట్టంలో 12 సంవత్సరాల కాలం ఉంచండి. బైటికి తీసింతర్వాత దానివంకర ఉండనే ఉంటుంది. అలాగే జగత్తుకూడా దాన్ని మంచిమార్గంవైపు త్రిప్పను ప్రయత్నించి వదిలితే మళ్ళీ దానిదారి దానిదే. ఒకకథ జ్ఞాపకం వస్తూన్నది. స్త్రీని వశీకరణం చేసుకోడం యెలాగో తెలుసు కుందామని ఒకడు ఒకకపటయోగి వద్దకు పోయాడు. ఆయోగి యిలా చెప్పాడు "నేనొక మంత్రంచెపుతాను. దాన్ని పఠించు నిశ్చలంగా స్త్రీ వశమౌతుంది. అయితే మంత్రాన్ని ధ్యానించే టప్పుడు మాత్రం నీమనస్సులోకి కోతిభావం రానీయివాకు" ఆమనిషి మంత్రధ్యానం మొదలెట్టాడు. దురదృష్టవశాత్తూ కోతిరూపం అతని మనస్సులో యెప్పుడూ మెదుల్తూనే ఉండేది. మళ్ళీ స్వామివద్దకు వచ్చి యిలా అన్నాడు "మీరు కోతి విషయం చెప్పకపోతే, అస లాస్ఫురణే నామనస్సులోకి వచ్చేది కాదు". దివ్యులారా! యీ; చెయ్యి, వద్దు, లాంటి ఆజ్ఞలు భగవదాజ్ఞలు కావు. అందుకనే జంతువులు, గోవులు, గేదెలు, చివరకు సింహాలూ, పులులూగూడా మనుష్యుల కంటె జ్ఞానవంతాలుగా ఉన్నై. ఇంద్రియ వాంఛలను అభ్యం తర పెట్టడానికి వాటికేలాంటి నిషేధాజ్ఞలులేవు. నీ పొరుగు వాణ్ణి నీలాగా ప్రేమించు"అనే ఆజ్ఞలో లోపం ఉంది. యితర్ల అధికారంమీద దేన్నీ మనుష్యుడు ఒప్పుకోడు.

నాలాగా నాపక్కవాణ్ణి యెందుకు ప్రేమించాలి? వేదాంతంలో యీ సత్యకారణం తొమ్మిది మార్గాల్లో బ్రహ్మాండంగా ఋజువు చేయబడింది. పురాతన వేదమత గ్రంథ పఠితలకు నీ సత్యమైన ఆత్మయే సర్వులకూ ఆత్మ. అందుకని నీ పక్కవాడు నీ ఆత్మ' అని చెప్పబడింది. నా పక్కవాడు నేనేనని తెలిసినపుడు, సహజంగా అతణ్ణి నాలాగే ప్రేమిస్తాను. ఈ విషయం బైబిల్లోకంటే యిక్కడ యెక్కువ విశ్వసనీయంగా చెప్పబడింది. మానవుల మన స్తత్వ సూత్రాలను మనం గ్రహించాలి. ఒక శిశువుతో అగ్నిని అంటుకోవద్దని చెప్పండి. అంటుకుంటాడు. అగ్నిని అంటుకుంటే చెయి కాలుతుందని చెప్పండి. తన సొంత బాధ్యతమీద అంటుకోడు. కాబట్టి "అగ్నిని ముట్టవద్దు" అని మాత్రమే చెప్పకండి. నా పక్కవాణ్ణి నాలాగే ప్రేమించుమని చెపితే, నేను ప్రేమించను. నా పక్కవాడూ నేను ఒకటేనని చెప్పితే నేనతన్ని నాలాగా ప్రేమించకుండ ఉండలేను.

ఇప్పుడు నేను ఐరోపీయ ఆధ్యాత్మికతకు జన్మస్థానాన్ని గూర్చి వివరించాను. యింక కొంచెం ముందుకు పోవలసి ఉంది.

క్రీస్తు చరిత్రనుంచి వచ్చిన దివ్యబోధలు 'అంధకార యుగంలో కలిసిపోయినై. కొత్త ప్రేరేపణ కావలసివచ్చినది ప్రపంచానికి. అంధకార యుగాన్నీ, తర్వాత మధ్యాయుగాన్నీ త్రోసివేసిన యీ ప్రేరేపణ యెక్కణ్ణుంచి వచ్చింది?

క్రైస్తవమతం ఉన్నప్పటికే అంధకారయుగం ఉంది.

మీరు చరిత్ర చదివినట్లయితే యీ అంధకారయుగం,మధ్యయుగాలు "నవోదయం"తో తుడిచిపెట్టబడినవని నాతో యేకీభవిస్తారు. విజ్ఞానానికి పునర్జన్మ కలిగింది. ఈపునరుజ్జీవన అక్రైస్తవమైన గ్రీసు రోమనుసాహిత్యం వల్లనే కలిగింది. ఈ అక్రైస్తవమైన సాహిత్యానికి జన్మస్థానము హిందూదేశమే. అందుకనే జగత్తును పవిత్రం చెయ్యడానికి నూత్న ప్రేరేపణ యిండియానుంచి వచ్చిందంటున్నారు. ఈనాటి విషయానికి వస్తాను.

మధురహృదయులారా! అమెరికాలో నేటి నూతనోద్దేశాలేమిటి? అమెరికాయొక్క శాస్త్రజ్ఞాన, దివ్యజ్ఞాన, ఆధ్యాత్మికతలు యేమిటి? మూర్తివంతంగాగాని, తద్భిన్నంగా గానీ వచ్చిన హిందూబోధకులనుండీ, స్కోపెన్‌హాగర్ రచనల వలనా, లేదా అమెరికా క్రమమైన భావనాశక్తి వలనా యెలాగైనా అన్నీ హిందూదేశంనుండి వచ్చినై. ప్రపంచ రాజకీయ చరిత్రలోని, "అతివాద ప్రజాస్వామ్య లేక సామ్యవాద సిద్ధాంతంగూడ వేదాంత సంబంధమైనదే నని నేను ఋజువు చెయ్యగలను. 'సామ్యవాదం - వేదాంతం' అనే వ్యాసం ఒకటి వ్రాశాను. జాతుల పతనోన్నతులు అనే గ్రంథంకూడా వ్రాశాను. ఈ రచనాల్లో నేను సిద్ధాంతీకరిస్తున్న యీ విషయాలు, వాటికి తగిన ఆధారాలు వివరించాను.

అమెరికాలో నవ్యభావనా ప్రవక్త యెమర్సన్ సత్యాన్ని, ఆధ్యాత్మికతను ప్రచారం చేశాడు. కాని వాటిని వ్యాపారదృష్ట్యా ఉపయోగించుకోలేదు. అతనిద్వారానే,సత్యాం

ప్రజాసామాన్యానికి అందజేయబడింది. అయితే యెమర్సన్‌కు ఆధ్యాత్మిక పితృతుల్యులగు హెన్రీ. డి. థోరే. యెమర్సన్ కంటే ఆయన యొక్కువ స్వయంవ్యక్తిత్వం కలవాడు. యెమర్సన్‌కు యింకో మార్గదర్శి కార్లైలు. అయితే యీ కార్లైలు యెమర్సన్, థోరే, వాల్ టు విట్‌మన్‌లు యెక్కణ్ణించి ఆవేశితులైనారు? వారి విజ్ఞానం అనేక చోట్లనుండి వచ్చింది. కాంట్ స్కోపెన్ హెగర్ లాంటి వారి రచనలు యెక్కణ్ణించి వచ్చినై. యివ్వన్నీ వేదాంత సారస్వతాన్ని పఠించడంవల్లనే వచ్చినై కాని యితరం కాదు.

కార్లైలు, రస్కిన్ మహాశయుల చేత ప్రపంచమునకు ఈయబడిన నూతనోద్వేగం, కాంట్ స్కోపెన్ హౌగర్ ఫిచీ మహాశయుల రచనలనుండి, కలిగిందనీ, వారి రచనలు, కొంతవరకు స్వీడెన్‌బర్గ్ రచనలూ కూడా హిందూ వేదాంత పఠనంవల్లనే. కల్గియుండడంచేత, మీదేశపు నవ్యభావోదయానికి మాదేశమే కారణమనీ, నేను ఋజువు చెయ్యగలను. 'ది వరల్డు యాస్ విల్ అండ్ ఐడియా అనే గ్రంథంలో స్కోపెన్‌హౌగరు ఈలా చెప్పాడు. "వేదాంత (ఉపనిషత్తులు) మంత ఉన్నతమైన మతం ప్రపంచంలో లేదు. ఈ వేదాంతం నాజన్మకు దుఃఖోపశమనం చేసింది". నామరణానికి కూడా యిది సుఖంయిస్తుంది." యింతకంటే యెక్కువ గౌరవం కావలెనా హిందూ వేదాంతానికి? ఆమహాశయుడి రచనల్లో కూడా వేదసారస్వతానికీ మతానికీ సంబంధాలు కనపడతయి. ఫ్రాన్సులోని వేదాంత చరిత్రకారుడు, విక్టర్ కసిన్

యిలా వ్రాశాడు. "పురాతన హిందువులు సత్యమైన భగవద్జ్ఞానం కల్గి ఉన్నారనడానికి అభ్యంతరం లేదు.

వారి వేదాంతం, వారిభావన చాల సక్రమమైనదీ, సత్యమైనదీ, ఉన్నతమైనదీను. వారి రచనల్ను యూరపు రచనల్తో పోల్చడం మధ్యాహ్న సూర్యుడిముందు నక్షత్ర కాంతివలె ఉంటుంది." యింకోచోట ఆయన యిలా వ్రాశాడు "ప్రాచ్య దేశాల్లో, ముఖ్యంగా యిండియాలోని కవిత్వ, వేదాంతగ్రంథాలను జాగ్రత్తగా పరిశీలించినట్లైతే, మహాసత్యాలు గోచరిస్తై. యూరపుతో పోలిస్తే అవి చాలా గొప్పవి. ప్రాచ్య విజ్ఞానముందర మనం తలలు వంచాల్సి వస్తుంది. మహోన్నత వేదాంత జన్మభూమి సర్వప్రపంచాన్ని తనలో లాలిస్తుంది." హిందూ భావనల ముందర యూరపు వేదాంతం, దీర్ఘకాయుడైన రాక్షసుడి ముందర మరుగుజ్జు వాడిలాఉంటై, అన్నాడు ష్లెగెల్. భారతవర్షంలోని భాష, సారస్వతం, వేదాంతం మీద అతను వ్రాసిన గ్రంథంలో యిలాఅంటాడు. "పూర్వ హిందువులు సత్యమైన భగవద్జ్ఞానం కలిగి ఉన్నారనడానికి సందేహం లేదు. భగవత్సం భాషణలు చేసిన యేభాషలోగాని వర్ణింపబడనంత మహోన్నతమైన భావాలతో, వారి రచనలు నిండి ఉంటై" ముఖ్యంగా వేదాంతాన్ని గురించి యిలా అంటాడు. "దివ్యమైన మానవ జన్మయొక్క ఉత్పత్తి మానవుణ్ణి దైవత్వముతో పునరైక్యత, పునస్సంధానము కొరకు తహతహలాడేటంత గాఢంగా బోధింపబడింది. యిదే ప్రతికార్యం యొక్క పరమావధిగా నిర్ణ

యింపబడింది. మాక్స్‌ముల్లర్ యిలా అంటాడు "స్కోపెన్ హాగర్ వంటి మహా వేదాంతి అభిప్రాయానికి, నిర్ణయానికి బలంకావలసివస్తే సర్వమత వేదాంతాలు చదవడానికి వినియోగించిన నాదీర్ఘ జీవితంతో, ఆయన్ని బలపరుస్తున్నాను" "ఆయన యింకా యిలా అన్నాడు" మతంగాని వేదాంతంగాని తర్వాత జన్మకు చేసే ప్రయత్నమైతే, హిందూ వేదాంతానికంటే సత్ప్రయత్నం నాకు కనపడలేదు" యింకా యిలా అన్నాడు. "స్కోపెన్ హాగర్ వేదాంతోత్సాహానికి నేను ఋణపడ్డాను. జీవయాత్రలో నాకది తోడ్పడదని చెప్పడానికి నేను శంకించడంలేదు. సర్ యెడ్విన్ యెర్నాల్డు యొక్క 'ఇండియా రివిజిటెడు' హిందూ దేశం పునర్దర్శించబడింది. 'సాంగ్ సెలెస్టియల్; వైట్ ఆఫ్ ఏషియా, సాంగ్ ఆఫ్‌సాంగ్స్ అనేరచనల్లో నేను సూచిస్తున్న యీ విషయం వ్యక్తమౌతుంది. తోరే తన 'వాల్డెన్ పాండు అండు లెటర్సు' అనే రచనలో తరచుగా వేదాంతరచనల్ని పేర్కొంటాడు. అతని యెక్సర్షన్స్ అనే దానిలో హిందూరచనల్ని గురించి వ్రాశాడు. అమెరికా నూతన భావనధోరేనుండి వచ్చింది. దోరే తన హిందూ దేశంనుంచి తెచ్చుకున్నానని ఒప్పుకున్నాడు. యింగ్లాండు ప్రయాణం ముగించి యెమర్సన్, అమెరికాకు వస్తూన్నప్పుడు కార్లైలు స్టేషనుదాకా సాగనంపుతూ, యెడ్విన్ జోన్సు తర్జుమా చేసిన భగవద్గీతను బహుమతిగా యిచ్చాడు. భగవద్గీత; లాటిన్ ప్రెంచి, జర్మను భాషల్లోకి కాంటుకు పూర్వమే తర్జుమా చేయబడింది. కాంట్ యూరపు వేదాంత

దృక్పథాన్ని పునరుజ్జీవింపజేశాడు. 'తన ప్రియరో' సిద్ధాంత (కాలము; ప్రదేశము; కారణత్వమును గురించి) విషయంలో యిండియాకు ఋణపడ్డాడు.

మిసెస్ యెడ్డీ గ్రంథప్రథమ ముద్రణలో భగవద్గీతనుండి పాఠములు ఉదహరించబడినై కాని తర్వాత ముద్రణల్లో తీసివేయబడినై. భగవద్భాషణ నిజంగా భగవద్భాషణే అయితే సార్థకంగా వైజ్ఞానికంగానూ ఉండాలి.

అయితే యిక్కడివాళ్లు గ్రంథచోరులనిగాని అనుకరణ వాదులనికాని నేననడంలేదు. అమెరికాదేశీయుల సొంతంగా ఈ మహాసత్యాలను కనుక్కోవడం యెంత న్యాయమో యిండియానుండి గ్రహించడంకూడా అంతన్యాయమే అని అంటున్నాను. ప్రపంచంలో క్రొత్త అనేదేలేదు. అయితే ఈ క్రొత్తదనం యిండియానుండి వచ్చిందని చరిత్ర చెపుతున్నది

హిమాలయాల్లో నివసిస్తున్న సన్యాసుల్లో ఈ రోజున నిజమైన సామ్యవాదం ఉన్నది. యెడ్వర్డు కార్పెంటరు (యింగ్లండు) తన సామ్యవాద దృక్పథాన్ని హిందువులనుండి నేర్చుకున్నాడు. కాబట్టి మీ క్రొత్తమార్గాలన్నీ పూర్వ హిందువులు నడిచిన పాతమార్గాలే. దివ్యులారా మహా సత్యాన్ని తెలుసుకోడానికి యింకా కొంచెం నిదానించి హిందూ దేశంనుండి విజ్ఞానం ఆర్జించుకోండి. ఎందుకంటే ఆ మహా గ్రంథాల్లో చాలాభాగం యింకా మీ భాషలోకి తర్జుమా కాలేదు.

అమెరికా దేశ సభ్యత్వాన్ని సర్వం చర్చించిన యోగవాసిష్ఠం లాంటి గ్రంథాలు ఉన్నై. యీ గ్రంథం సమగ్రంగా, తార్కికంగా కవిత్వంలో వ్రాయబడింది. అలాగే మా గణిత శాస్త్ర గ్రంథాలుకూడా, అందుకనే చాలా మంది విద్యార్థులకువలె కాకుండా మాకు గణితం ఆనందదాయకం అవుతున్నది.

ప్రపంచంలో మీ కార్యం సంతోషంతో చేయబడాలి. కష్టజీవులైన కూలివాండ్రు మార్గంలోని రాళ్ళు పగుల గొడుతూన్న ఒకతోట జ్ఞాపకానికి వస్తున్నది. వారి హృదయాలు కందిపోతూ పగలల్లా శ్రమిస్తున్నారు. తోటలోని మైదానంలో రాకుమారులు టెన్నిస్ ఆడుకుంటున్నారు. వారి ఆట సంతోషకరం. వారు కూలీలకంటె యెక్కువ శ్రమ పడుతున్నారు సంతోషంతో. మీవిధం ఆరాకుమార్రుల్లా ఉండనీయండి. అంటే మీరు శ్రమను కార్యాచరణను వదలమని కాదు. క్రియలోని మీభావన పూర్తిగా మారాలి. అప్పుడు క్రియలో యెల్లప్పుడూ సంతోషం ఉంటుంది. మీరు దైవత్వంలో కేంద్రీకృతులై మహానందంతో నిండిపోతారు. దైవప్రకృతి అనే దేవదారు వృక్షాగ్రాల్లో మీరు ఉన్నప్పుడు యీ మనోహరమైన ఆధ్యాత్మిక భావన పొందినపుడు, మీఆత్మలనుండి దైవ సంగీతం ప్రవహిస్తుంటుంది. బలవంతం చేయబడిందాంట్లో బలం ఉండదు. సూర్యునినుండి కాంతీ, రోజాపుష్పమునుండి పరిమళమూ, హిమాచలాగ్రాల నదీప్రవాహాలనుండి శీతల

త్వము వచ్చినట్లుగా మీనుండి శాంతి, ఆనంద, ప్రేమకాంతులు రానివ్వండి. ఓ తేజస్తేజమా! ఓం!! నీకు శాంతియగుగాక!!!.

---

ఓం

# భారతదేశ పక్షమున - అమెరికా దేశీయులకు ఒక విజ్ఞాపనము

[శాన్ ఫ్రాన్సిస్ కోలో 1933 సం॥ జనవరి 28 వ తేదీ గోల్డెన్ గేట్ హాల్లో చెప్పిన ఉపన్యాసం]

ఈ రాత్రి చర్చనీయాంశం "అమెరికనులకొక విజ్ఞాపనం" అనేది కొద్దిమంది అమెరికనులే వచ్చారు. కారణం తెలేదు. మంచిది పరవలేదు వచ్చినవారైనా, అమెరికానేకాక యూరపునూ, యావత్తు ప్రపంచాన్ని సూచిస్తున్నారు. నేటి రాత్రి మాట్లాడిన మాట లీకొద్దిమంది సభికుల హృదయాలను తాకితే; ఈ మాటలు మీలో ఏఒక్కరి యింటికైనా చేరితే, మీలో ఏఅయిదారుగురైనా ఏకొద్ది మందైనా ఈ పనికి పూనుకుంటే, ఈ అరణ్యరోదనాన్ని వింటే, రాముడీవాక్యాలు జయంపొందినట్లు భావిస్తాడు.

రాముడు మీ అంతర్లీన దైవత్వానికి విన్నవిస్తున్నాడు. మీ అంతర్భూతమైన అనంతత్వానికి విన్నవిస్తున్నాడు. అదిగాక, అంతర్గతమైన అనంతత్వం, ఒక్కశరీరంలోనైనా అద్భుత

మహిమలు, విచిత్రాలు చేయకలదని అతని నిశ్చయం. మీరు దయవుంచి సత్యాత్మముందు, అనంతత్వంముందు, మతాంతర పోరాటాల తెరఉంచవద్దు ! చివరకు, ఒక గంటసేపు మీరు దయతో అన్ని తెరలూ, సర్వవర్ణభేదాలు, ఒక ప్రక్కకు నెట్టివేయండి. అపరిచయుడి మాటలు విన నివ్వనికుల మతభేదాలు మనస్సుకు తట్టనివ్వవద్దు.

భా ర త దే శ పు పూ ర్వ కృ షి

రాముడు మీతో రెండు మాసాలనుండి భారత విజ్ఞాన శిఖామణులైన విషయాలు మాట్లాడుతున్నాడు. అతడు మీకు ప్రాణపదమైన అమృతం తెస్తున్నాడు. భారత వేదాలనుండి బలవర్థక క్షీరాన్ని తెస్తున్నాడు. ఈరోజున రాముడు, అలాంటి మణులను, అలాంటి క్షీరసమృద్ధాలైన గోవులనుకన్న స్థానాన్ని గురించి మీతో కొన్ని విషయాలు చెప్పదలచాడు. ఈసత్యాన్ని మొట్టమొదట ప్రకటించిన దేశాన్ని గురించి కొంత మీకు నిర్వచింపదలచాడు. స్వమతాలను, ప్రపంచానికి పంచిపెట్టిన భూమిని గురించి, కొంత చెపుతాడు. నిజానికి అన్ని మతాలు, భారత దేశంనుండి,వ్యక్తంగాగాని లేక అవ్యక్తంగాగాని ప్రపంచానికి వ్యాపితమైనవే ! యూరపులోనూ, అమెరికాలోనూ ప్రతినిత్యమూ పుట్టుతున్న మీనూతనమతాలూ, పూజావిధానాలు, అన్నీ రాముడు చెప్పేభూమి-ఇప్పటికీ మీకు యిస్తున్నది! నేడు మీరు వేటినిగురించి గర్వపడుతున్నారో, అట్టి మీ నూతనోద్దేశ్యాలు, యోగవిద్య, ఆత్మజ్ఞానము, క్రైస్తవ విజ్ఞానశాస్త్రము, మనశ్శుద్ధి, మొదలైనవన్నీ ఒక్కటికూడా

జీరుపోకుండా, వ్యక్తంగానో, అవ్యక్తంగానో, వాటిమూలాన్ని భారత దేశంనుండి గ్రహిస్తున్నవే! పూర్వంగానీ, ఇప్పుడుగానీ, తన సమస్త తత్వజ్ఞాన మార్గాలను, ప్రపంచానికి బోధించిన దేశాన్ని గురించి రాముడు మీతో మాట్లాడుచున్నాడు. ప్లేటో, సోక్రిటీసు, పైథాగరస్ మీప్లాటినస్ వంటి మీ గ్రీకు తత్వవేత్తలు వారి ఈశ్వర ప్రేరిత జ్ఞానానికి, ప్రాగ్భారత భూమికి (East India) ఋణపడ్డారు. తత్వశాస్త్ర చరిత్రి దాన్ని మీకు చూపుతుంది! "స్కోపెన్‌హార్, ష్లెగల్. షెల్లింగు, యమ్ కజిన్ మొదలైన వారందరూ, తమ దివ్యజ్ఞాన విషయంలో, ప్రతీచీ హిందూ దేశానికి, వేదాంతానికి, సాంఖ్యానికి, బౌద్ధమతానికి, ఉపనిషత్తులకూ, గీతకూ, బాకీయున్నామని ఒప్పుకుంటారు. మీనవీన మానిజం (Monism), ఇంగ్లండు, జర్మనీలల్లో దేనికి చెందినా, దాని ప్రకాశాన్ని, ప్రాగ్భారత దేశం నుండి పొందుతున్నది. శంకర కృష్ణుల జన్మభూమిని గురించి. మీపూజ్యులైన ఎమర్సన్. వాల్టులెట్‌మాన్, సర్ ఎడ్విన్ ఎర్నాల్డు, మాక్సుముల్లర్, లను ఆవేశపరచి, ఉత్సాహ పూరితుల చేసిన ఉదారాశయాలకు, విశాలభావాలకు ఆట పట్టయిన దేశాన్ని గురించి రాముడుమీతో సంభాషిస్తున్నాడు. ఉన్నతోద్దేశ్యాలు, ఉదారాశయాలకేకాక, తత్వకవిత్వాలకే కాక, శరీరపటుత్వానికి, ప్రతాపానికికూడా ఏమాత్రం తీసిపోని దేశాన్ని గురించి రాముడు మాట్లాడుతాడు. — "శరీర ప్రతాపం - బలముగల దేశం" యీ మాటలు వినడంతోనే ఆశ్చర్యపడతారు మీరు.

ఈకాలంలోకూడా బ్రిటిషుప్రభుత్వానికి గొప్ప రక్షణ సహాయాలను నిర్మించిన ప్రజలెవరు? శిక్కులు, ఘూర్ఖాలు, మహారాష్ట్రులు, తూర్పు హిందూ దేశపు రసపుత్రులూ మొదలైనవారే! బ్రిటిషువారు తమకు అపాయకారులైన శత్రువులను ఎదిరించ వలసిన అన్ని సమయాల్లో, యుద్ధతీవ్రతను భరించ వలసినవారు భారతసైనికులే.ఒకప్పుడు, శ్రీమంతమైన భారతదేశాన్ని గురించి, రాముడు మీతో మాట్లాడుతాడు. ఇండియాను పీల్చి పిప్పిచేసి; జాతి తరవాతజాతి, అభివృద్ధి పొందాయి.

అత్యాశనుకల్పించిన హిందూదేశం కోసంచేసినఅన్వేషణంలో "కొలంబస్" వల్ల అమెరికా కనిపెట్టబడింది. అమెరికాకు మొదట "యిండియా" అనే పేరు పెట్టారు. ఒకప్పుడు ప్రపంచాగ్రస్థానంలో ఉన్నభూమిని గురించి రాముడు మాట్లాడుతున్నాడు. మనోహర మహారణ్యాలతో, సారవంతమైన భూములతో నిండిన మహోన్నత హిమాలయాలతోకూడి, ప్రపంచంలోకల్ల ఉన్నత స్థానంలో ఉన్న ప్రతిభావంతమైన దేశం అదే. కానీ రాముడి అభిప్రాయం అదికాదు. భౌతికంగానే కాక, మనోవికాసంలో నైతిక పథంలో ఆత్మజ్ఞానంలోనూ ప్రపంచానికది అగ్రస్థానం వహించింది.

ఈ రోజున, ఆ భూమే ప్రపంచం యొక్క పాదంగా ఉన్నది. ఓ అమెరికనులారా! మీరు ఈనోజున ప్రపంచానికి శిరస్సుగా ఉన్నారు. ఇండియా, భూగోళంమీద (Globe)

మీకు క్రింది భాగంలో వున్నది; ఇండియా నేడు మీ పాదం. రాముడు మీకొక విజ్ఞాపన చేస్తున్నాడు. ఓ శిరోభాగమా! ఓ అగ్రస్థానమా! నీవు బలంగా ఉండాలంటే, ఆరోగ్యంగా ఉండాలంటే, నీవు పాదాల విషయంలో శ్రద్ధ తీసుకోవలసి వుంటుంది. పాదాలు దెబ్బతింటే. నష్టపడితే, తలకూడా బాధ పొందుతుంది. పాదాలకు నెప్పికలిగితే, పాదాలకు బాధగలిగితే, ఆ బాధ తలదిమాత్రంకాదా! ఓశిరస్సా! నీపాదాలక్రింద ఉన్న వారి తరఫున, నీకు రాముడొక విన్నపం చేస్తాడు.

ఆమె తన తత్వజ్ఞాన కవిత్వాలతో, ఉన్నత భావాలతో, మతంతో, సర్వప్రపంచాన్ని పోషించిన తల్లి. ఆ ప్రపంచ మాత, ఆ పురాతన ప్రపంచపోషకురాలు నేడు జబ్బుపడింది. మీ తల్లి యిప్పుడు జబ్బుపడింది. భారత ఆర్యకుంటుంబంలోని మీ అగ్రసోదరుడు, మీ సహోదరి ఈ రోజు జబ్బుగా ఉన్నారు. మీ రామెకు ఉపచారం చేయరా? క్షీరసమృద్ధమైన ఆవు, నేడు జబ్బుపడ్డది; కానీ అది చావలేదు - జబ్బుపడ్డది. మీరు దానికి సహాయం చేయగలరు. మీ రామె రోగవిముక్తికి సహాయం చేయవచ్చు. ఇండియా ప్రపంచానికి పాలను, పుష్టికరమైన ఆహారాన్ని, బలవర్ధ కౌషధాన్ని, మనో వికాసకరమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తూ వున్నది; ఆ భారత దేశాన్ని గోవువలె పోషించవలసి ఉన్నది. ఆ ఆవు బక్క-చిక్కింది. పస్తులుంటున్నది. ఆకలిదప్పికలతో మాడి చచ్చిపోతున్నది. గడ్డితోనూ, చొప్పతో మాత్రమే, ఆమెను మీరు పోషించవలసి ఉన్నది. ప్రపంచం, ఆమెనుండి పాలను,

పోషణపదార్థాలను తీసుకొంటున్నది. ఆమెకు చౌకైన గడ్డిని మాత్రం యివ్వండి. శరీరప్రాణాలను నిలుపుకొనడానికి, ఏదో ఆహారం పెట్టండి. పశుమాంస భక్షణం చేసే యింగ్లాండు, మాంసాహారులైన యూరపియన్ దేశాలు, "మేము ఆవును పోషింపదలచుకోలేదు. మేము దాన్ని చంపుతాము; తింటాము" అని అంటారు.

మంచిదే; మీ యిష్టం వచ్చినట్లు మీరు చేయవచ్చు, కానీ, మీరు దాన్ని చంపి తినదలచుకొన్నా; "మీరు ఆమె ఆరోగ్యాన్ని కాపాడవలసివుంది" రోగగ్రస్తమైన గోవునుండి వచ్చే మాంసం మీ ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది. మీ కు హానికరంగా ఉంటుంది." అనే ఒక్క విషయాన్ని జ్ఞాపకానికి తెచ్చుకోండి.

ఓ యింగ్లాండు, యూరపు శక్తుల్లారా! మీరు తుదకు ఆమె ఆరోగ్యాన్నైనా కాపాడాలి.

అమెరికా దేశంనుండి ఆశలు

రాముడు భారతీయుల పక్షాన, నేటి వీరులైన అమెరికనుల ముందు, త్యాగపురుషులైన అమెరికనులముందు సత్యము పేరుపై తమ జీవితాలను పరిత్యాగం చేయగల మానవులను సమకూర్చగల ఉదారస్వభావులైన అమెరికనుల ముందు, ఈ విజ్ఞాపనాన్ని ఉంచుతున్నాడు. క్రిందటి దినమే, సత్యకార్యాభివృద్ధికి, ఒక అమెరికను శోధనలో తన జీవితాన్ని ఆహుతి చేశాడు. విజ్ఞానశాస్త్రం కోసం ప్రాణాల నర్పించిన అమెరికనుకు రాముడు విన్నవిస్తున్నాడు. అమెరికనులారా! చెప్పండి!

మీరువినరా? అమెరికను ముద్రాపకులారా! మీరు ప్రత్యు త్తర మీయరా? రాముని శరీరాన్ని వదలివేయండి. రాముణ్ణి అణగద్రొక్కండి. ముక్కలు ముక్కలు చేయండి. తుంపులు తుంపులుగా నరకండి. ఈ శరీరాన్ని మీ యిష్టంవచ్చినట్లు మీ రేమన్నా చేయండి. కాని ఇండియా సమస్యను చేపట్టండి. సత్యకార్యాన్ని చేపట్టండి.

దాస్యాన్ని రూపుమాపిన అమెరికనులకు, యీ దేశంలో కులభేదాలను కూలద్రోస్తున్న అమెరికనులకు, అలాంటి ధన్యులైన అమెరికన్లకు తన విషయం శ్రద్ధవహించమని యిండియా మొఱపెట్టుకొంటున్నది.

ఇండియా చాలా చెడ్డదనుకోండి; ఇండియా ప్రపం చానికి ఏమీ యివ్వలేదనుకోండి, యీ రోజున హిందువులు ప్రపంచంలోకల్లా చెడ్డవాండ్లనుకోండి, మీరు శ్రద్ధవహించ డానికి అదే ఒక పెద్దకారణంగా ఉంటుంది. మీరు ఆమెకు ఎందుకుసేవచేయాలె అనేదానికి అది బలవత్తరమైన కారణంగా ఉంటుంది.

జబ్బుగాఉన్న మనిషి, తనకు తాను అపకారం చేసు కోవడమేకాక, ఆవ్యాధిని ప్రపంచమంతా వ్యాపింపచేస్తాడు. ఒకడు చలిజ్వరంచేత బాధపడుతుంటే, ఇతర్లా అంటురోగాన్ని పొందుతారు. ఇండియా చలిజ్వరపీడితురాలైనది. ఎండ వేడిమిగల దేశాన్ని చలిరోగం ఎలా పట్టుకుంటుందని మీరు అనవచ్చు. వారు చలికాలపు చలిరోగంచేత బాధపడడం లేదు. కానీ, నిరుత్సాహమూ, కటికి దారిద్ర్యమూ,

అనే చలిరోగంచేత బాధపడుతున్నారు. ఇండియా చలిచేత బాధపడు తున్నది. వణకుతున్నది. ఒకమనిషి మలేరియా వల్ల బాధపడుతుంటే వాడిరోగం వాడి యిరుగు పొరుగు వాళ్ళకు వ్యాపిస్తుంది. ఒకడు కలరా తగిలి బాధపడు తుంటే వాడిరోగం ఇతర్లకు వ్యాపిస్తుంది. ఒకమనిషికి స్ఫోటకం పోసినట్లయితే ఇతర్లు ఆ అంటురోగాన్ని పొందుతారు. తన కొరకు కాకపోయినా ప్రపంచాని కోసమైనా రోగగ్రస్థుడైన మనిషికి సహాయం చేయడం ప్రతివాని విధి అయివున్నది. వాండ్లకారోగం అలాగా ఉండనిస్తే దుర్బలత్వాన్ని దేశ మంతటా వ్యాపింపచేస్తున్నట్లే. సర్వ ప్రపంచక్షేమానికి భారత సమస్యను స్వీకరించండని రాముడు మిమ్ములను అడుగు తున్నాడు. రాముడు, సత్యం, న్యాయం పేరట భారత సమస్యను సక్రమ శ్రద్ధతో గ్రహించండని మిమ్ములను అడుగు తున్నాడు.

ఇండియాకు ఏంకష్టం కలిగింది? ఇండియాకు ఏమి చెడు కలిగింది? అనిమీరు అడుగుతారు. వ్యాధి; రాజ్యాంగ సాంఘిక మత విషయకమైనది.

భారతదేశపు రాజకీయ పరిస్థితి

రాముడు ఎక్కువకాలం ఆ అంధకారావృత దేశపు రాజ్యాంగదుస్థితిని విస్తరించి చెప్పడు. ఎక్కడ లక్షోపలక్షల జనసమూహాలు కరువువల్ల చచ్చిపోతున్నారో, ఎక్కడతిండి లేమిడి నవనవలాడే. బాలబాలికలను నాశనము చేస్తున్నదో. ఎక్కడ పేదరికమూ ప్లేగూ పురోభివృద్ధికి రాదగిన యువకులను

పురిటిలోనే తుంచి వేస్తున్నవో, ఎక్కడ కంఠము తెరువని పసి పాపలు ఉపవాసాలచేత కుమిలిపోతున్న తల్లులవద్ద తమ్ము పోషించడానికి పాలు లేక పోవడంచేత, రోదనం చేస్తుంటారో, ఎక్కడ పొట్టకు బట్టకు సంపాదించే మనిషి అరుదుగా ఉంటాడో, ఎక్కడ ఉదర భరమాత్రజీవి, చాలక్షేమంగా ఉన్నట్లు భావింప బడతాడో, ఎక్కడరాజులు రాజకుమారులు ఎప్పుడూ విచార కరమైన ఆర్థిక బాధల్లో చుట్టుకొని వున్నారో అట్టి దేశంలో తన దుఃఖాలు బాధలు లెక్కచెయ్యకుండా ఉన్న రాజభక్తి, ఓర్పు, విశ్వాసము గల దేశంలో భయానక దరిద్ర సంక్షుభి తమైన యిట్టి దేశంలో, పేరాసగల ప్రభుత్వం దరిద్రాన్ని కలుగజేసే పన్నులకుతోడుగా, ప్రాణాలు పోతున్న కూలీల కరుడు వారిన రక్తం నుండి అనేక లక్షల డాలర్లను పిండి ఘుల్లున మోగించడం అత్యవసరంగా భావిస్తుంది! ... ... ...

.......................................................

ఈ గొప్ప భయంకరమైన విచిత్రానికీ ప్రదర్శనానికీ తోడుగా అనేక అధికవ్యయకరములైన, బుద్ధిహీన స్వల్ప విష యాలు దేశాన్ని నాశనం చేస్తున్నవి. ఆ దేశం నుండి ప్రాణా ధారమైన రక్తాన్ని సారాన్ని పీల్చివేస్తున్నవి. గొప్ప ఆదాయం గల ఉద్యోగాలన్నీ బ్రిటిషువారి స్వాధీనంలో ఉన్నవి. పెరిగి పోతున్న 30 కోట్ల భారతప్రజలకు, పార్లమెంటు సభలో ఒక్క డైనా ప్రతినిధిగా లేడు. స్వదేశ ఉద్యమాలన్నీ బ్రిటిషువారిచే అణచివేయ బడ్డవి. ...............................

.......................................................

దేశీయకళలు, పరిశ్రమలు, ఉత్పత్తులు అన్నీ క్షీణించి పోయినవి. ఇంక ప్రజలు అనుభవించగలిగిన స్వాతంత్ర్యం, ధన మానప్రాణాలను హరించే, ఊహాజనిత స్వాతంత్ర్యం ఒక్కటే- అదే అతిమత్తుగలిగించే, ఇంగ్లీషు సారాయి, వినాశనకరాలైన బ్రిటిషువారి తాగుడు పదార్థాలనుండి ఎరువు తీసుకున్న కృత్రిమ పైశాచిక స్వతంత్రభావం. ఈ త్రాగుడు, సహజంగా తాగడం తెలీని భారతీయులో మిక్కిలి ప్రోత్సాహింపబడింది. ఈ సారాయీలు ఇంగ్లీషు వారిచేతనే పరిచయం చేయబడ్డాయి.ఈ విషయం భారతరాజకీయ దురవస్థను గురించిన ఒక అభిప్రాయాన్ని మీకు యిస్తుంది. ఇది వారి బాహ్య పరిస్థితిని గురించి కొంత మీకు చెపుతుంది.

ఇప్పుడు,వారు ఏ ఆంతరంగిక దోషాలచేత బాధలు పడుతున్నారో, వాటిని రాముడు మీకు ఎరుకపరుస్తాడు. ఇప్పుడు, మీకు,వారి పతనానికి నిజమైన సహజమైన కారణాన్ని గురించి, వారి బాధా నిరాశల ముఖ్యకారణాన్ని గురించి కొంత నిర్వచింపబడుతుంది. ఈ విషయాన్ని గురించి ఎంతో చెప్పవచ్చు. కాని ప్రజలు,ఆసాంతం మొత్తంవిషయాన్ని వినడానికి ఓపికపట్ట లేరుగనుక, రాముడు ప్రతివిషయాన్ని క్లుప్తంగా ప్రసంగింపవలసి ఉన్నది.

భారతదేశపతనం, దాని క్షీణత్వం, వేదాంతతత్వం చేత వ్యాఖ్యానింపబడింది. అది ఒక కర్మవిశేషం. కర్మఅంటే మనం చేసుకున్నదే. కర్మఅనేమాటకు శబ్దార్థం 'పని' అని మనం స్వతహాగా చేసినదే. ఇప్పుడు వాండ్లు కోస్తున్నది, ఒక

నాడు తమచేతులతో స్వయంగా నాటిందే! భారత దేశపు హీన జాతులను హిందువులు నిరాదరణచేశారుగనుక, ఇప్పుడు వారు వాండ్లవంతును విజేత జాతులచేత పొందుతున్నారు. జబ్బుపడ్డ ప్రతివ్యక్తీ, తన రోగాన్ని అజ్ఞానంచేతనో మితి మీరిన తిండివల్లనో, ఆరోగ్య సూత్రోల్లంఘనం చేతనో, తెచ్చిపెట్టుకొన్నట్లు, భారతీయులు రోగగ్రస్తులైనారు. తమ చేజేతుల. అజ్ఞానంచేత భారతీయులు రోగగ్రస్థులైనారు.

రోగం ఎలావస్తేనేమి - వచ్చింది. వైద్యుడు రోగిని తిట్టడంకాదు చేయవలసింది. వైద్యుడు జబ్బుపడ్డవాణ్ణి ఉత్సాహపరచాలి. ఆ దీర్ఘరోగికి సహాయం చేయాలి. రోగిని చీవాట్లు పెట్టడంవల్ల నీవు రోగాన్ని తీవ్రం చేస్తావు. వాడి వ్యాధిని వృద్ధి చేస్తావు. వాండ్ల దుష్కృతాలకూ, దోషాలకూ, వాండ్లలోని లోపాలను కనిపెట్టవలసిన సమయం కాదిది. మనధర్మం, మీధర్మం - వాళ్ళను కష్టాలల్లోనుంచి బైటికి తియ్యడమే!

## భారతీయకులాల పుట్టుక

రాజ్యతంత్ర శాస్త్రం మనకు కర్మ విభాగాన్ని గురించి చెపుతుంది. యంత్రాగారంలో యావత్తుపనీ జయప్రదంగా ఉండడానికి, పనిని విభాగింపవలసి ఉంటుంది. నీ స్వశరీరంలో కర్మవిభాగం ఉన్నది. కండ్లు మాత్రమే చూడగలవు. కండ్లు వినలేవు. చెవులుమాత్రమే వినగలవు. కండ్లుపనిచెయ్యావు; చేతులు, కాళ్లు చేసేపనిని చెయ్యలేవు. కాళ్ళు వాటి పనిని అవ్వి చెయ్యాలె. చేతులు వాటికి సంబంధించిన పనినిచెయ్యా

లసివుంది. మనం కండ్లతో వినాలనీ, ముక్కులతో నడవాలనీ, చేతులతో వాసన చూడాలనీ, చెవులతో తినాలనీ, మనం వాంఛింపవచ్చునా? వద్దు; ఆపద్ధతి సూక్ష్మజీవుల పరిణామపురాతన దశకు మనలను తిరిగి నెట్టివేస్తుంది. ఆ మార్పు మనలను మొత్తం పొట్టగా ఉన్నట్టిక్రిములు (Monerons)గా తయారు చేస్తుంది. కండ్లు, చెవులు,ముక్కులు, కాళ్ళు, వీటన్నిటి పనులు చేసే ఒక పొట్ట! ... అది మనకు వద్దు. కర్మవిభజనం న్యాయమైంది, అవసరమైనది. ఈ కర్మ విభాగసూత్రంపైననే, ఒకప్పుడు భారత దేశంలో కులవ్యవస్థ తేబడింది. స్థాపించబడింది. అది ఒక కర్మ విభజన మాత్రమే మరేదీకాదు. ఒకవ్యక్తి పురోహితుని ధర్మాన్ని స్వీకరిస్తాడు. మరొకడు యోధధర్మాన్ని స్వీకరిస్తాడు. ఎందుకంటే, రెండోవ్యక్తిలో ఎక్కువ యుద్ధోద్రేకం, సంపూర్ణ పశుబలం వున్నది. అయుద్ధోపయోగానికి, శత్రువులను అణచడానికి, అతడు తగియుండడంచేత, మత ప్రచారకుని సాధు కార్యాన్ని స్వీకరించలేడు. ఇక్కడే కర్మవిభాగం పుట్టింది. మరికొంతమంది, దుకాణాదారునివంటి ఎల్లప్పుడూకూర్చొని చేయవలసిన వృత్తులకు ఎక్కువ ఉపయుక్తంగా ఉండే వాండ్లు ఉన్నారు. వాండ్లకు వర్తకాదుల్లో వున్న సామర్థ్యం పౌరోహిత కార్యక్రమంలో లేదు. ఏమాత్రం పరిజ్ఞానం లేనివారు, విద్యా ప్రవేశం లేనివారు, తమ బాల్యజీవితాన్ని సోమరితనంగా గడిపిన వాండ్లు కొందరుండేవారు, ముఖ్యంగా వాండ్లు ఆదిమవాసులు. ఈ రకం మనుష్యులు మతబోధక కార్యాన్ని

గ్రహించ లేరు. యోధుని పని నా వాండ్లు స్వీకరించ లేరు. ఎందుకంటే వాండ్లు కవాతు (Drill) పొంద లేదు. యుద్ధావసర క్రమశిక్షణ పొంద లేదు. దుకాణాదార్ల పనినైనా వాండ్లు చేయ లేవు. వ్యాపారం చేయడానికి కొంత నేర్పరితనం, విద్యా వుండాలి, ఈ జనులు సామాన్య కార్మికుని పనులు చేయడానికి ఒప్పుకున్నారు. అంటే వూడ్చేపని, రోడ్లపక్కన రాళ్ళుకొట్టే పని, యిలాంటి పనులు వాండ్లు కోరారు. ఆ విధంగా హిందూ దేశంలో కార్యనిర్వాహణమార్గంలో, చతుర్విధ భాగాలు ఏర్పడ్డాయి. పురోహితకులపు మనుష్యులు బ్రాహ్మణులని పిలువ బడ్డారు. యోధ ధర్మాన్ని నెరవేర్చిన మనుష్యులు క్షత్రియు లని పిలువబడ్డారు. వర్తకులుగా పనిచేసే ప్రజలు వైశ్యులుగా పిలువబడ్డారు. సర్వసామాన్య కాయకష్టాన్ని అవలంబించే ప్రజాసంతతి, శూద్రులనబడ్డారు. ఒకమనిషి తనకిష్టమైనపనిని స్వీకరించడం కూడదనడానికి, నిషేధంగాని ఎట్టి కఠినశాసనం గానీ లేదు. ఈ కృషివిభజనం అన్నిచోట్ల వ్యాపించి యుండ లేదా? అమెరికాలో కూడా యీ కృషి విభజనం ప్రబలంగా లేదా ? అమెరికాలో, యీజాతులిప్పుడు ఉన్నాయి, అవి యింగ్లండులోనూ వెలసినవి.

అవి ఎక్కడ బట్టినా ఉన్నవి. అమెరికాలో కులాలు లేవా? ఆమెరికన్లలో ఉన్నత వంశీకులనీ (Upper Ten) సామాన్య జనులనీ లేరా? ప్రతిచోటా మనమీా విభజనము నైజవిభాగాన్ని కలిగివున్నాము. అయితే. హిందూవర్ణాలలో ఉన్నతప్పేమిటి?

భారత దేశంలో 'మనుస్మృతి' అనేపేరుతో హిందూ న్యాయశాస్త్ర గ్రంథం వ్రాయబడింది. ఆకాలంలోని అన్ని కులాల వారికి ఆ గ్రంథం సహాయంగా ఉండేది. ప్రతివర్ణానికి తమతమ కార్య నిర్వహణానికి అనేక సలహాలను అదియిచ్చింది. అది అనుకూలమైన విధులను బ్రాహ్మణులకు సహాయపడేందుకు విధించింది. అది క్షత్రియులకు తమ పనిని ఎలా నెరవేర్చాలో తెల్పింది. అందుచేత ఈ గ్రంథం ఆకాలంలోని అన్ని వర్ణాల వారిని సేవించడానికి ఉద్దేశింప బడింది. క్రమేణా యీగ్రంథం అపార్థం చేసుకోబడింది. ఏదో ఒకవిధంగా ప్రతివిషయమూ తారుమారు చేయబడింది. ప్రతివిషయమూ తలక్రిందు చేయ బడింది. ఈవర్ణవ్యవస్థ అంతా కర్మవిభజన మంతా మాధ్యంగా చేయబడింది. శల్యంగా మార్చబడింది. శవంగా మార్చబడింది. పాషాణంగా మార్చబడింది! వారు దాన్ని కఠినత్వంచేశారు. గడ్డకట్టించారు. జాతిజీవం నశించింది. ప్రతిదీ యంత్రంగా కృత్రిమంగా తయారయింది. మనుస్మృతి ప్రజలకు సేవజేయ డానికిబదులు నిరంకుశ హింసాస్వరూపంగా మారింది.

## హిందూవర్ణపు క్షీణదశ

విశ్వ విద్యాలయంలో మామూలుగా ఫ్రెష్‌మాన్ (fresh man Sophomore ) జూనియర్ (Junior) సీనియర్ (Senior) అనే నాలుగు తరగతులు ఉంటాయి. ఈ తగతులు మంచివేకాని విద్యాబోధకులు ఈ క్లాసులు ఎప్పుడు యిలాగే వుండాలని చిన్న తరగతుల్లోవున్న విద్యార్థులు అభివృద్ధిపొంది, తరువాత పైతరగతికి దానితరవాత ఆపై మూడవతరగతికి

ఆమూడవ తరగతి విద్యార్థులు నాలుగో తరగతికి పోగూడ దని కోరరు. తరగతులు బాగా ఉన్నవి. ఈ విభాగాలు బాగా ఉంది. కానీ హిందూదేశంలో చేయబడిన పెద్దతప్పు నేటి భారతవర్ష పతనకారణ ఘోరాపరాధం, ఈ విభజనాన్ని మూఢత్వంగా చూడడం. దుర్బలంగా చేయడం: ఈ విభాగా లను స్తంభింప జేయడమే సుమా! ఆవిధంగా హైందవవర్ణ వ్యవస్థలో భయంకర హాలాహలం బయలుదేరింది!

ఆ కాలపు తాత్కాలిక విషయాలకు మాత్రమే సంబంధించినటువంటి ఆ నాటి వ్యవహారస్థితిని నడిపిన మను స్మృతియొక్క చంచలధర్మాలు, శాసనాలు, క్రమేణా, శ్రుతికి లేక ఉపనిషదోద్బోధితమైన అమరవేదాంత సత్యానికి ఉన్న అర్హగౌరవాన్ని అపహరించినవి. అన్నిన్యాయాలు, చట్టాలు తమకోసమన్న విషయం తెలుసుకోడానికి బదులు, ప్రజలు చట్టాలకోసం, విధులకోసం బ్రదకడం మొదలుపెట్టారు. అంత ర్భగవానుడైన ఆత్మదేవుని ఆజ్ఞలకంటే, స్మృతుల అధికారా నికి ఎక్కువ విలువ ఇవ్వబడింది. బ్రాహ్మణుడైనా, క్షత్రియు డైనా మానవుడు నిజంగా రక్తమాంసాలవల్లనే నిర్మించ బడ్డాడు. సత్యాత్మను, శాశ్వత సత్యాన్ని సర్వవిషయాల్లో మఱచిపోయారు. కులధర్మాలభయం, ఆచారాల భయంకర వికృతాకారం, ఒక వ్యక్తిని 'తానూ, ఇతరజాతులూ ఒకటే' వని ఒక్కనిముషంసేపైనా అనుకోనివ్వవు. బ్రాహ్మణత్వ మన్నా క్షత్రియత్వమన్నా దాని ఉద్దేశ్యం, మానవత్వ భావాన్ని హృద్గతంచేసుకోవడమని ఎన్నోసార్లు నొక్కి చెప్ప బడింది.

మనువు కాలంనుండి భూస్వరూపం అనేకసార్లు మారి పోయింది. నదులు తమ మార్గాలను మార్చుకొన్నవి. కీకారణ్యాలు నరికివేయబడ్డవి. తగులబెట్టబడ్డవి. పుష్పజాతులు, వనస్వరూపాలు మారిపోయినవి. క్షత్రియజీవనం, లేక యోధ వృత్తి, ఒక విధంగా, సంపూర్ణంగా భారతదేశంనుండి తుడిచి వేయబడింది. దేశభాష దేశంనుండి కొట్టుకపోయింది. నవీన హైందవ ప్రజలకాభాష, గ్రీకు లాటిన్ల వలె, క్రొత్తదిగా, తెలియనిదిగా మారిపోయింది.

భారతీయ ఆత్మహంతకులు, ఎప్పుడో మనువు తన సమకాలీకులకోసం విధించిన కులాచారాలకు, హక్కులకు, కట్టుబాట్లకు, యింకా నేటివరకూ బానిసలుగా ఉంటున్నారు. స్వతంత్రభావన, అన్యమతావలంబనంగా కాదు. ఘోరమైన నేరంగా పరిగణించబడుతున్నది. మృతభాషనుండి, ఏదివచ్చినా అది పవిత్రమే! నీ హేతువాదం, మృతుల ప్రవచనాలను, భ్రమలను, దుశ్చేష్టలను, నీచంగా లొంగి స్తుతించకున్నట్లయితే నీవు మహాపాపివే! ప్రతివాడూ నీకు ఎదురు తిరుగుతాడు. పాత సీసాల్లో క్రొత్తసారాయి నింపాలెనీవు. కార్యమంతా మంచిదే. కర్మఅంతా పవిత్రమే. కానీ కులనిజోద్దేశ్యాల మంచి మార్గంనుండి తప్పిపోవడంచేత, గౌరవాగౌరవాలు బాహ్యావృత్తికి అంటగట్టబడ్డాయి. తమ బాల్యాన్ని విద్యాభ్యాసంలో వినియోగించని జనులు, వారి వెనుకటి సోమరితనాన్ని యౌవనంలో కఠినకాయ కష్టంచేత విమోచనం చేసుకుంటారు. వారి పూర్వపు సోమరితనానికి బదులు వారి

కనుబొమల చెమటద్వారా చెల్లించుకుంటారు. వారికృషి నీచమైనది అనడానికి లేక శూద్రకర్మ తృణీకరించడానికి నీవెవరు? - లేక నేనెవర్ని? ఆరకపుపనిమాత్రం, పురోహితునిపని, యోధుడి కార్యం, వర్తకుని కర్మ అంత అవసరమైనదికాదా? గొప్పకులాలు అనబడేవాళ్లు - అంటే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు నడిచే వీధిలో తక్కువ కులాల ప్రజలను నడవనివ్వడంలేదు. నేడు పరిస్థితులు అంత అధమానికి దిగిన వన్నమాట!

గొప్పకులాలు వారు నివసించే, గ్రామబాహ్యల్లో, పురబాహ్యల్లో, పూరిగుడెసల్లో వారు నివసించాలె. ఒక తక్కువ కులస్థుడినీడ, ఎక్కువకులం వాడిమీద సోకితే ఆ అగ్రవర్ణస్థుడు, తన్నుతాను పవిత్రం చేసుకోడానికి స్నానం చేయవలసి ఉంటుంది. తోముకోవలసి ఉంటుంది. ఏవస్తువైనా హీనవర్ణ మానవుడిచే తాకబడితే, అది అపవిత్రమైనదన్నమాటే, చెరచబడినట్లే ఆ వస్తువు ఉన్నత వర్ణమానవుడికి ఉపయుక్తంకాదు. ఈ తక్కువ తరగతి ప్రజలు చేసే వెట్టి చాకిరికి కఠిన శ్రమాపూరిత కృషికి, ప్రతిఫలంగా, అగ్రవర్ణ ప్రజ లిచ్చే ఎండు రొట్టెముక్కలపైన, ఈ నిమ్నజాతులు ప్రాణాలు నిల్పుకోవాలె!

సత్యాలను మీయెదుట ఉంచేడానికి, మీరు వినడానికి అలవాటుపడని మాటలు మాట్లాడడానికి, తప్పకపోవడంచేత, రాముణ్ణి మీరు క్షమించండి. ఈ నిమ్నజాతులు, పేద శూద్రులు, పంచములు వీధులు ఊడవాలె. మురికి కాలవలు

చేతులతో శుభ్రం చేయాలె - అది మాత్రమేకాక స్నానపు గదులు వారు శుభ్రం చెయ్యాలె. ఆ కృషికి ఫలితంగా వారు, రెండు ఎండు రొట్టె తుంపులు పొందుతారు, వాండ్లు భాగ్యవంతులు కాలేరు. వాండ్లు నిరుపేదలు, వాండ్ల స్థితిని ఆలోచించినపుడల్లా, రాముని హృదయం బాధాకలిత మవుతుంది. గొప్పకులాల బాలురు విద్యనేర్చే బళ్ళల్లో హీనవర్ణాల బాలకులకు ప్రవేశంలేదు. వాండ్లు అక్కడ కూర్చుంటే, గొప్ప కులాల పిల్లలు అంటుపడుతారు. అట్టి హీనస్థితికి అణగ త్రొక్కబడిన ప్రజానీకం ఏదైనా విద్యను ఎట్లా పొందుతారు? ఈ ప్రజల సంపాదన, కూటికి జరగడమే కనాకష్టంగా ఉంటుంది. ప్రతిరోజూ వారు చచ్చిపోతున్నారు. ప్లేగుకూ, అన్నిరకాల వ్యాధులకూ, ఇండియా ప్రియవిహారస్థలం. ఆనారోగ్యకరాలైన యిండ్లలో నివసించే యీపేద శూద్రులు, రకరకాల రోగాలకు అంటువ్యాధులకు, గొప్ప ఆతిథ్యమిచ్చే ఆతిథేయులు వారు. ఔదార్యంతో, తమ దేహాలను తృప్తికరంగా భుజించడానికి, కలరా ప్లేగు గ్రామపిశాచాలను, ఆహ్వానిస్తారు. ఆ పేదలు, ఆహీనులు, ఎల్లప్పుడూ, సంఘముయొక్క పాదాలుగా, ఆధారంగా, పునాదిగా ఉంటారు. హీనకులాల అభ్యుదయాన్ని నిరోధించే అహంకారపూరితసంఘాన్ని, దరిద్ర అమాయక పతిత సహస్రాలకు విద్యవద్దని వారిని పీడించిన సంఘాన్ని తన పాదాలనే నరుక్కున్న సమాజాన్ని, ఆసంఘాన్ని. చితుకగొట్టి వేయండి!

చాలా వరకు తక్కువ కులాలవారు హిందూ దేశ ప్రాచీన నివాసులే. నేడు మీరు హిందువులని పిలిచే ఆర్యులు. హిందూ దేశ ప్రాచీన మానవుల్ని జయించారు. తరువాత వాండ్లను ఈ ఘోరబానిసత్వానికి, దుఃఖభూయిష్ఠహీనదశకు, తెచ్చారు. ఈ దైన్యావస్థకు వాండ్లను కుంగదీశారు. ఈతప్పిదం వాండ్లు చేశారు. వాండ్లు చల్లినవాన్నే వాండు నేడు కోసుకుంటున్నారు హిందువులు, లేక ఆర్యులు భారత దేశప్రాచీన నివాసులను ఆదరించడంలో వారు నాటినదాన్నే తమకర్మ ఫలాన్నే మహమ్మదీయుల హస్తాల్లో అనుభవించారు. ఈరోజున హిందూదేశాన్ని పాలిస్తున్న ఇంగ్లీషువారి హస్తాలలో అనుభవిస్తున్నారు. ఇదేకర్మఫలం! ఇదే ప్రతిఫలన్యాయం!

రాముడొక హిందువుగా, భారతీయుడుగా, ఒకప్రత్యేక జాతికిచెందిన వ్యక్తిగా కాదు మాట్లాడేది. రాముడి స్థానం సత్యం, సంపూర్ణసత్యం. ఆసత్యం తప్ప మరేదీ కాదు. రాముడి శరీరం భారత దేశంలోని ఉన్నతవర్ణానికి సంబంధించింది. రాముడు ప్రపంచంలోకెల్లా అధఃపాతాళానికి అణగద్రొక్కబడిన హీనకులాల పక్షాన, మీకు విన్నవిస్తున్నాడు. సత్యన్యాయాల పేరట; భారతీయపంచముల్లో కూడా అభేదమై ఉన్న ఆ సత్యాత్మపేరట, మతాంతర పోరాటాలయొక్క; భేదాలయొక్క అన్ని తెరల్నూ, ముసుగుల్నీ చింపివేయండి. భారత బాధితప్రజల సమస్యను స్వీకరించండి!

అఖిలజాతిపతనానికి వర్ణవ్యత్యాసం లేక విభజనం ఎట్లా దోవతీస్తుంది? అది సాధారణంగా కృషివిభజనగా

ప్రేమను భద్రపరచడంగా ఉద్దేశించబడింది. కానీ, ఇండియాలో కులవ్యవహారాలు తలక్రిందులుగా మారిపోయినవి. గుఱ్ఱంముందర బండి ఉంచబడింది. ఈరోజుల్లో, ప్రేమ, ఐకమత్యాల విభజన, ప్రాచీన కృత్యాలయొక్క విభేదాలయొక్క సంరక్షణా ఉన్నవి. ఇది యింకోవిధంగా ఉండవలసి ఉన్నది. ఎన్నో సంవత్సరాల క్రిందట ఒక కుటుంబసభ్యుడికి, సరిపోయిన చొక్కాలు యిప్పుడుకూడా సరిపెట్టాలని బాధిస్తున్నారు. చీనాదేశస్త్రీలు కాళ్ళకు బూట్లూ మొదలైనవి వేసుకొని కాళ్ళను స్వేచ్ఛగా పెరగనియ్యరు. ఆ విధంగానే హిందువుల మనస్సుకూడా సంకుచితంగా ఉంది. ఒక హైందవుని శాస్త్ర బద్ధమైనవిద్య రెండుగోడలమధ్య పరుగెత్తడం వంటిది.

ఒకవ్యక్తి రెండు రోగాలచేత బాధపడుతున్నాడు. ఒకటి కడుపునొప్పి, కండ్లమసక. తనరోగ విషయం ఒక వైద్యుడితో విన్నవించుకొన్నాడు. ఆ వైద్యుడు అతనికి రెండు మందులిచ్చాడు. ఒకటి కంటికోసం, ఒకటి పొట్టకోసం. కానీ ఆమనిషి వాటిని కలిపివేశాడు. అతనికిచ్చిన కడుపును చక్కజేసే ఔషధంలో వేడినిచ్చే పిప్పరమెంటు ఉప్పు యింకా ఏవో కొన్ని పదార్థాలు కలిపి ఉన్నవి. కండ్లకోస మిచ్చినమందులో సౌవీరము (Antimony) తుత్తునాగమూ యింకా అలాంటి వస్తువులు ఉన్నవి. సౌవీరం లోపలకి పుచ్చుకుంటే విషమని మనకు తెలుసు. మిగతాపదార్థాలు పిప్పర్ ఉప్పు తీసుకోవచ్చు. కానీ వాటిని కండ్లకు వాడకూడదు. ఈ మనుష్యుడు ఈ రెండు మందులూ తారుమారు చేశాడు. లోపలికి తీసుకోవలసిన

దాన్ని కంటికి వాడాడు. కంటికి వాడవలసినదాన్ని తిన్నాడు. ఆవిధంగా కండ్లుపోయినవి. పొట్ట చెడిపోయింది. ఇండియా జరిగిందికూడా అదే. పనిలో విభాగాలు ఉండవలసిందే; కానీ ఆత్మలో ఐక్యత, సమ్మేళనాభావం ఉండాలి. దురదృష్టంవల్ల, అజ్ఞానంవల్ల, ప్రేమ, భావమూ విభజించబడ్డాయి బాహ్య విధులకు భద్రత యివ్వబడింది.

ఆచారమనే, లోకసమ్మతమనే మహారాక్షసి జాతి యొక్క ప్రాణశక్తిని, నైజప్రకృతిని కఠిన పాషాణంగా మార్చింది. గడ్డకట్టించింది. సనాతనత్వమంటే బహిష్కరణంగా, మూఢమైన ఛాందసాచార సంరక్షణంగా మారిపోయింది. అనుభవజీవితంలో, అగ్రకులస్థుడు సత్యాత్మ యొక్క, అంతస్స్వర్గంయొక్క ప్రతిభను, మహత్త్వాన్ని, పవిత్రతను మరిచిపోయి, సరిగ్గా వేదాంతాన్నే, ఆత్మనే తొక్కి బుద్ధిహీనుడై తన ప్రాపంచక పదవులూ, గౌరవమూ, దైహిక కార్యాలూ చూచుకొని గర్వపడతాడు. అప్పుడే అతనికి తన పదవినీ, గౌరవాన్నీ కాపాడుకోవాలనే తృష్ణ, వ్యక్తిగతభేదాన్ని, స్వార్థాధిక్యతను భద్రపరచాలనే దురభిమానం ఉదయిస్తాయి. స్వల్పానికి ఆధిక్యతయిచ్చి, ప్రాముఖ్య విషయాలకు విముఖతచూపే అగ్రవర్ణ మానవుని పద్ధతే అతని పతనానికి దారితీసింది. అతని అజ్ఞానానికీ,అహంకారానికీ దోహదమిచ్చిన నిమ్నజాతుల నాశనానికికూడా అదే హేతువయింది.

దీన్ని ఎట్లా మనం బాగుచేయడం? ఇప్పుడు ఈహిందువులను ఆర్యులను శూద్రులమీద క్రూరంగా ప్రవర్తించి

నందుకు చంపుదామంటారా? ఇలా విషయాలు చక్కబడతవా? పడవు, పడవు, గాయకుడికి నీవు వేయవలసిన పెద్దశిక్ష ఆతని తప్పుచెప్పి సరిగా దిద్దడమే. నేరస్థుడికి పాపికి నీవు విధించవలసిన పెద్దశిక్ష అతణ్ణి ప్రబుద్ధంచేసి అతనిలోఉన్న అజ్ఞానాన్ని నాశనం చేయడమే. అతనిలోని పాపిని చంపాలంటే మనిషిని చంపాలసిన అవసరం లేదు. అతనిలోనున్న పాపి అజ్ఞానం. విద్య నేర్పు; అతని అజ్ఞానాన్ని తొలగించు. అప్పుడు విషయాలను నీవు చక్కచేయగలుగుతావు. ఇదే విషాయలను చక్కపరచడానికి అజ్ఞానరోగ విషక్రిమిని సంహరించడానికి సక్రమ మార్గం.

ఆర్యులు హిందువులు, ఇదివరకే తగినంత బాధపడ్డారు. అనుభవించారు. ఆదిమనివాసుల మీద వాండ్లు చూపిన కౄర్యానికి కసితీర్చుకోటానికి మీరు అమెరికా నుండి యూరప్ నుండి పోవాలసిన అవసరం లేదు. ఇప్పటికి తత్ఫలితాన్ని వాండ్లు బాగానే అనుభవించారు. అనేక శతాబ్దాల నుండి వాండ్లు పరపరిపాలనంలో వున్నారు. దాస్యంలో బ్రదుకుతున్నారు. ఆఫ్ఘనిస్థానం నుండి కొందరు ప్రజలు వచ్చి దేశాన్ని కొల్లగొట్టి వాండ్లను జయించారు. గ్రీసునుంచి కొందరువచ్చి వాండ్లను పరిపాలించారు. పర్షియానుంచి వచ్చిన ప్రజలు వాండ్లమీద ప్రభుత్వం చెలాయించారు. ప్రపంచంలో అన్ని మూలలనుంచి ప్రజలువచ్చి వాండ్లను బెదరించారు. వాండ్ల దోషాలకు తగిన ఫలం అనుభవించారు. ఇప్పుడు మీరు వాండ్లను ఓదార్చవలసిన సమయం పోయి

ఉత్సాహపరచవలసిన సమయం పోయి కులానికి పట్టుకొని వ్రేళ్ళాడుతున్న వాండ్ల అవైదాంతికమైన అజ్ఞానాన్ని నాశనం చెయ్యవలసిన సమయం.

ఎంతచెడుగా విచారకరంగా వాండ్లశక్తులు కులభేద భావంచేత భిన్నభిన్నం చేయబడినవి! నైతిక ఆధ్యాత్మిక రాజకీయ సాంఘిక సంబంధములైన సర్వకార్యములు భారత జాతివల్ల పుట్టిన కులభేధాలవల్ల జాతివైషమ్యంవల్ల బాడైపోయినవి,నాశనమైనవి. తత్వశాస్త్రంగానీ, చరిత్రగాని సైన్సుగానీ చదవడానికి పోయే మనిషి ఉన్నాడనుకోండి. అతని మనస్సు వ్యాకులంగా ఉంటే విద్యాభ్యాసానికి అతనే అనర్హుడౌతాడు. మన మే విద్యనైనా నేర్చుకోవాలంటే మనమనస్సు విశ్రాంతిగా ఉండడం అత్యవసరం. సమస్థితినుంచి మనుష్యుల్ని చలింపచేసేది ఏమిటి? వాండ్లను కలవరపెట్టి తలక్రిందు చేసేదిఏమిటి?

అది భేదభావనే! మీకు బాంధవభావా లున్నప్పుడు భేదమే లేదు. మీచుట్టూ పోటీవుండదు. మీరు విజయకరంగా చదువుకోవచ్చు. కానీ, మీరు విరుద్ధభావాలచేత, ప్రతికూల విభాజకాలచేత చుట్టబడ్డప్పుడు, మీ రేపని చేయలేరు. చూడండి. నా కుటుంబంలో వాండ్లు, తమ్ములు, చెల్లెండ్లు లేక యితర బంధువులు నాచుట్టూ ఉన్నప్పుడు, నేను చదువుతూ వుండగలను. నాకు భంగం కలగదు. మనస్సులో అన్యుడు, పరాయి అనేభావన వచ్చినప్పుడే, నాకు భంగం కలుగుతున్నది. ఈ భారతదేశపు కులవ్యవస్థ మనశ్శక్తులను క్షీణింపచేస్తున్నది. అందుచేత చుట్టూవున్న వాటిని అనేకంగా

అర్థం చేసుకోవడంచేత, ప్రజల మనస్సుల్లో, తమ పొరుగున ఉన్నవాండ్లు పరాయివాండ్లని, ఇతరదేశస్థులని, భేదమనే స్పర్ధాభావాన్ని, అసూయను, విరోధాన్ని విశ్వసింపచేయడం వల్ల, కల్లోలాన్ని కలుగచేస్తున్నది. నాలుగు పెద్దకులాలున్నవి. ఇవి వందలు వందలుగా విభజింపబడ్డాయి. ఇంకాయివి సమూహంగా మారుతవి. దానికితోడు, మహమ్మదీయమతం ఒక సంఘం లేక కులం. క్రైస్తవమతం ఇంకొక పెరుగుతున్న సంఘం లేక జాతి. బ్రహ్మజ్ఞాన సమాజం, ఆర్య సమాజం, ఇంకా వేలకొలది యితర కుక్క గొడుగు సంఘాలు తళతళలాడే పేర్లతో, మారుపేర్లతో, కొత్తగావచ్చిన కులాలు. ఇప్పుడు, ఒక మహమ్మదీయుడు వస్తే, హిందూ విద్యార్థి సమస్థితిలో ఉండడు. ఒక క్రైస్తవుడు కనబడితే, హైందవుడు సమస్థితిలో ఉండడు. ఇతర కులానికి చెందిన ఎవరైనా హిందువు డొకడు వస్తాడనుకోండి, అతని సాన్నిధ్యం కూడా, పూర్వాచార హైందవ విద్యార్థి మనస్సును ఆచ్ఛాదనం చేసుంది.

భారతదేశంలో నిరంకుశంగా పెరిగిపోయిన యీకుల భేదం, వాండ్ల మనశ్శక్తులను క్రమాభివృద్ధి పొందనివ్వకుండా అవరోధం చేస్తున్నవని మీకు కనబడడంలేదా? వాండ్ల విద్యను సాంగంగా అభ్యసించడానికి అది యిష్టపడదు. భారతదేశంలో మన విద్యాకృషి అభ్యుదయం పొందాలంటే, ప్రజానీకాన్ని వాండ్ల మనస్సులు ప్రశాంతంగా ఉంచే పరిస్థితుల్లో, ఉంచడానికి మనం ప్రయత్నించాలె. ఈ అసహజ

మైన భేదభావం నశించినప్పుడే, కులవ్యవస్థ రూపు మాసి నప్పుడే, వాండ్ల మనస్సులు విశ్రాంతి వహిస్తాయి.

అయితే మీరు (అమెరికనులు) సంపూర్ణంగా కుల భేదం లేకుండా ఉన్నారని రాముడు చెప్పడు. మీకూ ఆభేదభావం ఉన్నది. నీవొక క్రైస్తవుడవైతే, హిందువుణ్ణి గాని బౌద్ధుణ్ణిగానీ చూడ్డానికే సహించలేవెందుకు? నీవు అమెరికా దేశీయుడవైతే. ఒక ఆంగ్లేయుణ్ణి చూడ్డానికి ఓర్పు చూపలేవు. మీరు రాజకీయ కులభేదంచేత పీడింపబడుతున్నారు. నీవు తెల్లమనిషివైతే, నీవు ఒక నీగ్రోతో కలిసి ఒక గదిలో పనిచేయలేవు. నీవు సాంఘికకుల భూతంచేత పీడింపబడుతున్నావు. మీపొరుగువాడిమీద మీకు అసూయ వున్నప్పుడు మీరు సంపూర్ణంగా కులంనుండి విడిబడలేదు.

దేనినుంచి అసూయ వస్తున్నది. కులంనుంచి అసూయ వస్తున్నది. కులందప్ప వేరే కారణంలేదు.

నీ సహోద్యోగి నీ సముఖంలో పొగడబడడం నీవు సహించలేకపోతే, నీవు కులభావంచేత పీడింపబడుతున్నట్లే. అమెరికాకులము, ధనంచేతనే ఎక్కువగా నిశ్చయింపబడుతుంది. అమెరికాలో అనేక సాంఘిక దురాచారాలున్నవి, అమెరికా తన కంట్లోఉన్న దూలాన్ని తీసివేసుకోవాలె, అమెరికా సంస్కరింపబడాలె. అమెరికా సంఘనిర్మాణం ఏమీ సరిగా లేదు. అమెరికాకు చాలా ఎక్కువగా వేదాన్తశక్తి కావాలి. కానీ, భారతదేశస్థితి యింకా ఎక్కువ చెడుగావుంది. అమెరికాకులం వంగుబాటుగావుంది. మెత్తగావుంది. ప్రిషంచంలో

ప్రతిజీవపదార్థం ఏవిధంగా వుండాలనో, ఆవిధంగా వుంది. కానీ భారతసంఘం గడియారపు పరిభ్రమణం లాగావుంది. నియమితమైవుంది. కఠిన శల్యమైపోయింది.

జీవితం పరంపర, విద్యాసూత్రాలమీద వికశిస్తుంది. పరంపరాధర్మం క్రింది రాజ్యాల్లో పాలిస్తుంది. మానవుడు కూడా, తన శారీరకశక్తులు, అవయవాలు, పితృ పరంపరా సూత్రంనుండి గ్రహిస్తాడు. కానీ మానవుడు ముఖ్యంగా తన పూర్ణస్థితికి, పూర్ణవికాసానికీ, సమగ్రస్థితికి రావడం, సంస్కరణంవల్ల- విద్యవల్లనే కోడిపిల్లలు, గుడ్లల్లోనుంచి బైటికి రాగానే, వాటి తల్లిదండ్రుల తెలివితేటలన్నీ పొందియుండడం కనబడుతుంది. కొన్నిపక్షులు పుట్టంగానే, వాటిపూర్వీకుల్లాగే ఈగలుపొడుచుకోని తినడానికి ప్రారంభిస్తాయి. అవి తమ సర్వశక్తులూ తల్లిదండ్రులద్వారా పొందుతవి. అనుభవంలో వాటి అభివృద్ధి, అభ్యుదయం, ఆమార్గంలోనే పూర్ణీకరింప బడుతుంది. అయితే, మానవుడి అభ్యుదయం, ముఖ్యంగా విద్య, సంస్కరణంమీద ఆధారపడివుంది. పుట్టిన శిశువు, యిప్పుడు పుట్టిన కుక్కపిల్లలాగే అల్లరిగా, తెలివితక్కువగా ఉంటుంది. కాదు, కొన్ని విషయాల్లో ఆకుక్కపిల్లే, శిశువుకంటే తెలివిగా ఉంటుంది. అయితే మనిషికీ-జంతువులకూ ఉన్న పెద్దభేదం, ఇందులోవుంటుంది: కుక్కపిల్ల పరంపరాధర్మంవల్ల తన సమగ్ర పరిణామానికి కావలసినదంతా గ్రహిస్తుంది. శిశువో-విద్యవల్ల, సంస్కరణంవల్ల అభివృద్ధి, వికాసంపొంది, సకలజగత్తును తనవశ్యంలోకి తేగల శక్తులన్నీ గ్రహించుగల్గు

తుంది. హిందువుల ఘోరదోషం అనుభవంలో విద్యా సంస్కారణాధర్మాల మంచిని తోసివేసి, మానవుల్ని చెట్లూ జంతువులూ ఉన్నస్థితిలోకి తగ్గించేటంతగా హిందూ సంఘం మీద 'పరంపరా సూత్రాన్ని' బలవంతంగా పెట్టడమే! వాండ్లు, ఆత్మయొక్క అనంతశక్తిలో నమ్మరు. శూద్రుడు, బ్రాహ్మణత్వం పొందేలాగా, విద్యాభ్యాసం చేయవచ్చని వాండ్లు నమ్మరు. ఒక శూద్రుడి కుమారుణ్ణి, శూద్రుడు గానే, వైశ్యుడు కుఱ్ఱవాణ్ణి, వైశ్యుడుగానే వాండ్లు ఉంచుతారు అత్తిచెట్టు అత్తివిత్తనాలే కాస్తుందనీ; కుక్కకు కుక్కలే పుడ తాయని దానికి వాండ్లు సమాధానంచెబుతారు.

అసత్యమైన, అల్పమైన, దీన్నే కారణంగా తీసుకొని వాండ్లు నిత్యజీవనవిధానంలో ఆచరిస్తారు. ఒకప్పుడు మహా విజ్ఞానభావులు, పవిత్రమహర్షులు, అద్భుత తత్త్వవేత్తల కుమాళ్ళు చాలామంది నిస్సంశయంగా బ్రాహ్మణులు విద్యా విహీనతవల్ల తిరిగి మూఢత్వస్థితిలో లేక పిచ్చిలో పడిపో లేదా? అలాంటి అనాగరికుల ఆటవిక విద్యాపరిజ్ఞాన విహీన ప్రజల సంతతి నేటి ఆంగ్లేయులు, యూరోపియన్ల మాదిరి విద్యవల్ల కఠినమైన స్వతంత్ర కర్మచేత పరిశ్రమచేత శారీరక, మానసిక, రాజకీయశక్తుల్లో అభ్యుదయం పొందలేదా? భగ వంతుడు వ్యక్తులనూ, గౌరవాన్ని కులాన్ని అభిమానించేవాడు కాడు! ఎవడు కర్మచేస్తాడో వాడు కాలంగడుపుతాడు. ఎవడు తనకు తాను విద్యాభ్యాసంచేసి జ్ఞానాన్ని పొందుతాడో వాడికే స్థానం ఉంటుంది.

మీరు పూర్ణంగా కులాభిమానాలకు దూరంగా ఉన్నారనీ, హిందువులు మీకంటే ఎక్కువగా కులాభిమానంచేత పీడింపబడుతున్నారని రాముడు చెప్పడు. భారతీయులకంటే మీరు ఎక్కువ సులభంగా స్వతంత్రులు కాగలరు. భారతీయులకంటే కొన్ని విషయాల్లో రాముడికి మీరు దగ్గర. మీలోఉన్న స్వాతంత్ర్యశక్తిని బలపరచి, అభివృద్ధిపరచి, ఉద్దీపింపజేసి, తరువాత భారతీయుల్లోకూడా ఈ స్వాతంత్ర్య శక్తిని ప్రబుద్ధంచేసి, మీ ఆనందాన్ని, మీ సంతోషాన్ని పంచుకొనేటట్లు చేయడానికి రాముడు కోరుతున్నాడు. ఈ విధంగా మనం ఈ చెడును కుంకటివేళ్ళతో నరకవచ్చు. వేదాంతానికి వ్యతిరేకమైన, వేదాన్తానికి పరమశత్రువైన ఈ ద్వైతభావంచేతనే ఈ భేదదృష్టిచేతనే మానవులు శారీరక మానసిక, ఆధ్యాత్మిక హత్య చేస్తున్నారు.

రోగాన్నిగురించి యింక కొన్ని మాటలు ! బ్రాహ్మణ కులం అగ్రకులం- ఏచేతిపని అయినా చేయడానికి వాండ్లపదవికి అగౌరవమని తలుస్తారు. అగ్రవర్ణ మానవులు, ఆచార నియమితంకాని ఏకార్యానికైనా వాండ్ల గౌరవానికి లోపమని చేతులు సాచరు. ఉదాహరణానికి - బ్రాహ్మణ క్షత్రియ వైశ్యజాతి సంబంధీకులు ఎప్పటికైనా, కల్లోనైనా చెప్పులు కుట్టేపని, క్షురకర్మ నావికత్వం, చిత్రకారుడిపని, వడ్రంగం, రంగులఅద్దకం, దర్జీపని, నేత, కమ్మరిపని లేక ఇతర కాయకష్టం చెయ్యరు. ఇంక వీధులవూడ్చేపనికి - పేరుకూడా ఎత్తకూడదు. ఈ ప్రజలు చావనన్నా చస్తారుగాని యిలాంటిపని

ముట్టుకోరు. చర్మసంబంధమైన పనిలో వాండ్లు వ్యాపారం చెయ్యనే చెయ్యరు. కాస్తపెట్టుబడి పెట్టగలిగిన ఈ అగ్రవర్ణాలే, ఈ పనిచెయ్యక చేతుల్లో దమ్మిడీలేని తక్కువజాతి ప్రజలమీదనే నెట్టితే భారతపరిశ్రమలు, కర్మాగారాలు ఏవిధంగా అభివృద్ధిపొందడం? ఉపయోగకరమైన కళల్లోవాండ్లు ఏవిధంగా అభివృద్ధి తెస్తారు? ఈ నాడు అమెరికా పరిశ్రమల వల్లనే శ్రీమంతంగా ఉంది. ఇంగ్లాండు, తక్కిన యూరపీయ శక్తులు పెట్టుబడిపెట్టడానికి సమర్థత గలిగిన ప్రజలచేత స్థాపితమైన పరిశ్రమలచేతనే నేడు భాగ్యవంతంగా ఉన్నవి. వాండ్లల్లో 3/4 వంతు మంది పరిశ్రమలను నిరసించి ఉత్తమ కర్మను ఏవగించి దాన్ని మతమని పిలుస్తూ పూర్వాచార శవానికి గతకర్మలకు పురుగుల్లాగా పట్టుకొని వేళ్ళాడుతుంటే ప్రజలకింక ఏమి ఆశవుంది?

జరిగిపోయిన వాటికి ఇచ్చిన ఆధిక్యతయొక్క బాని సత్వ ఫలితంగా మృతల దృష్టితో మాత్రమే చూడడంవల్ల ఇప్పుడు వర్ణించడానికి వీలుపడని అనేక యితర సంఘదోషాలు భారతదేశంలో హద్దుమించి పరిపాలిస్తున్నవి. మోయలేని పూర్వాచార మృతభారాన్ని నెత్తిమీద వేసుకోవడంవల్ల వాండ్లకు వచ్చేదేమిటి? ఓ ఆమెరికా దేశీయులారా! వాండ్ల తాతముత్తాతల మడిమెలక్రింద అంతేకాదు వాండ్ల వేర్ల క్రింద పడి నలిగిపోయేబదులు వాండ్ల తాతల భుజాలమీద నిలుచుంటానికి మీరు వాండ్లకు సహాయం చెయ్యండి? వాండ్ల పితార్జితంవల్ల బొందబడి దానిస్వాధీనం గావడానికి బదులు తమ

మంచి పితార్జితాన్ని పొంది దాన్ని తమ స్వంతం చేసుకోవ డానికి మీరు వాండ్లకు సహాయం చెయ్యండి! వారి పితార్జితం వారికే చెందాలెగాని ఆ పిత్రార్జితానికి వారు వశం కాకుండురు గాక - వారి సంఘాచారాలు, సాంసారిక విధానాలు, కొన్ని స్తుతింపదగినవి, భవిష్యత్తుకు మంచివి, అనడానికి సంశయం లేదు. కానీ ఆ మార్గాలకు, ఆచారాలకు మూఢంగా గుడ్డిగా చేసేదాస్యం వాండ్లను నిస్సారంగా, నిర్జీవంగా చేస్తుంది.

భారతదేశంలో 1500 లక్షల (150 Millions) స్త్రీలకు గాను, సంయుక్తరాష్ట్రంలోని జనాభామొత్తానికి ద్విగుణంగా ఉన్న మహిళాసమూహానికి నూటికి ఒకరుకూడా తమ పేరైనా వ్రాయడానికి చేతగాని పరిస్థితిలో నున్నారు. ఏదుష్టమైన మూఢవిశ్వాసం, పిరికితనం, యిలాంటి పరిస్థితిని వారికి కలిగే సంతానానికి పంపడానికి జాగ్రత్తవహించకుండా ఉంటుంది?

గంభీరములైన ఉపనిషద్బోధలు,మహత్తర వేదాన్తము, వంటయింటి మతంవల్ల అంటే ఆహారవిషయంలో తిండితినే విధానాల్లో పెరిగిన విపరీతాభిమానాలవల్ల స్థానభ్రష్టంచేయ బడ్డది. కొందరి గొప్ప పూర్వాచార పండితుల విద్యాభిప్రాయం ఎక్కడా మాట్లాడబడని పురాతన సంస్కృత వ్యాకరణ సూత్రాల యాంత్రికాధికార వలయాన్ని మించలేదు. పూర్వ గ్రంథాలను గుర్తుంచుకోవడం, ఏకరువుపెట్టడం అఖిలసమాజ భావకులకన్నా, స్వేచ్ఛాకారణులకన్నా ఆధిక్యత నీకు కలు గిస్తుంది.

నీ సాంఘికుల అజ్ఞాన హాస్యానికి చక్కిలిగింత పెట్టడానికి,

వేదగ్రంథాలను మెలేబెట్టి, చిత్రవధచేస్తే నీవు మహాపండితుడవే. 'అన్నంతినేటప్పుడు ఎన్నిసార్లు గుటకలు వెయ్యాలి? యిలాంటి మూఢప్రశ్నలను తర్కించుకోవడంలో అనేకయువకుల మనశ్శక్తులు పాడైపోతున్నవి- వ్యయమైపోతున్నవి.

సంకుచితమైన మతభేదవలయాల్లోని నిర్బంధము, ప్రమాణంమీద ఉన్న అతివిశ్వాసము, వాండ్లను అజ్ఞాన పక్షపాతపుటడుగుల్లో ముంచివేసినవి. అందువల్ల వట్టి స్వల్ప విషయాలు, అర్థంలేని చిహ్నాలే, లోతుగా వేళ్ళుపారిన ఉద్రేకానికి కేంద్రాలైనవి. ఈనాడు భారతదేశంలో సామాన్య మతంలో అతిపవిత్రమైన, అత్యంత ముఖ్యమైన విషయం, అమితమైన గోభక్తి. హిందూమతంలోని కొన్ని సంఘాలు ఉత్తర దక్షిణ ధ్రువాల్లాగా, పరస్పరం దూరంగా ఉంటవి. కానీ అపరిమితమైన గోభక్తిని మాత్రం అన్ని సంఘాలు, కలిసి పంచుకుంటాయి. సామాన్యంగా హైందవుడికి ఉన్న వింత గుణం, ప్రియాతిప్రియమైన, అతిసన్నిహిత భావన- గోశరీర పావిత్ర్యమే. మీ రీ విషయం ఎత్తండి, వెంటనే హైందవుని హృదయంలో అతిగాఢోద్రేకాన్ని, తీవ్రమైన ఆగ్రహాన్ని రేపుతారు. అసంఖ్యాకమైన కక్షలు, పోరాటాలు, ఈ ముఖ్య విషయంలోనే ప్రతిదినమూ బయలుదేరుతున్నవి. 1857 సంవత్సరములో సిపాయీల పితూరీ ఈ ఆవుపేరటే వచ్చింది. హైందవుల ప్రియమైన యీ మూఢ విశ్వాసం నుంచే, భారతదేశంలో మహమ్మదీయుల ప్రథమ విజయం జరిగిందని చెప్పబడింది. ఘోరీమహమ్మదు, భారత

దేశాన్ని మొదటిపర్యాయం ముట్టడించినప్పుడు, ధీరులైన రాజపుత్రులచేత వెళ్ళగొట్టబడ్డాడు. కానీ, హిందూ హృదయానికి సన్నిహితమైన పిచ్చినమ్మకాలనూ అభిరుచులనూ గూర్చిన జ్ఞానాన్ని ఎక్కువగా గ్రహించి, యీ పర్యాయం, తిరిగి ఘోరీమహమ్మదు ఇండియామీద దండయాత్ర చేశాడు. తన సైన్యము యొక్క ముందుభాగంలో చుట్టూ గోవులను వ్యూహంగా నిలబెట్టాడని చెప్పబడింది. ఎలాంటి విచిత్ర రక్షణ! హిందువులు ఎదుర్కోలేరు. పవిత్రమైన గోవుమీద వారేవిధంగా ఆయుధప్రయోగం చేయగల్గుతారు? కరుణా హృదయుడైన హైందవుడు అమాయకమైన పవిత్రమైన గోసమూహాన్ని చూడగానే వెనుకంజవేశాడు. వాటిని విడిచిపెట్టాడు. దేశాన్ని పోగొట్టుకొన్నాడు. శతాబ్దాలపర్యంతము, ఈ నాటివరకూ, లక్షోపలక్షల ఆవులు పీడింపబడ్డవి. పీడింపబడుతున్నవి. కర్కశహృదయులైన శత్రుపాలకులవల్ల, ముక్కలు ముక్కలు చేయబడి, తినబడుతున్నవి. ఈ కథ నిజం కాకపోవచ్చు - అయినా ఇలాంటి దృశ్యం నేటికీ చూడవచ్చు. ఇలాంటి అజ్ఞానం ప్రాచీనమతం పేరుతో వ్యాపిస్తుంది. ఇప్పుడు విపరీతాన్ని గుర్తించండి. మహాపవిత్రములైన శ్రుతులు, దివ్యవేదాలు, గోమాంసోపయోగాన్ని నిరోధించడానికి బదులు, అప్పుడప్పుడు గోయజ్ఞాన్ని ప్రేరేపిస్తున్నది. యజుర్వేద, సత్పథబ్రాహ్మణ, బృహదారణ్యకోపనిషదధ్యాయం VI, 4 బ్రాహ్మణంలోని 18 వ శ్లోకం ఇక్కడ వుంది.

"విద్యావంతుడైన కుమారుడు కలగాలంటే, ప్రతిభా

వంతుడైన ప్రసిద్ధుడైన, వక్తృత్వం కలిగిన, సర్వ వేదపారం గతుడైన సంపూర్ణాయుర్దాయం గలిగిన కుమారుడు కలగా లంటే, అన్నం వండిన తర్వాత భార్యాభర్త లిద్దరూ, మాంసమూ వెన్నా కలిపి తినాలె. అప్పుడు సంతానం గంటానికి అర్హులౌతారు. ఆ మాంసం ఆవుమాడదిగానీ, ముసలిఎద్దుదిగానీ, అయియుండాలి. (గోవత్సంగానీ వృషభం గానీ.)''

మనపవిత్రభావాలను, ఆవుల శరీరాలమీద, చీమలు, అత్తిచెట్లమీద వ్యయం చేయడానికి బదులు సర్వభీరు సంబం ధాలనుండి విముక్తిచేసి తనదనుకొనే యీ చిన్న శరీరంమీది 'అహం'కారాన్నే కాక, తల్లిదండ్రులు, మేనమామలు, తాతలు, గురువులు, సకల బంధువులు మొదలైనవారి శరీరా లకు ప్రాముఖ్యత యిచ్చి వాటికి మనలను కట్టివేస్తున్న మోహాంధకారాన్ని తొలగించే, కృష్ణ ప్రబోధితమైన అచం చల వేదాన్తధీరత్వ మెక్కడ వున్నది! ద్వాదశాదిత్యులు నాశనమైనా, అగణితజగద్గోళాలు శూన్యంలో కలిసిపోయినా జ్ఞానిని ప్రచలింపచేయలేవు. ఆలాంటి అమర సత్యానికి, సత్యాత్మస్థితిలోకి తెచ్చే ఆనందవేదాన్తం కావాలె!

వారు మానసికంగా బలంగా ఉన్నారు, శారీరకంగా బలంగా ఉన్నారు. ఆధ్యాత్మికంగా బలంగా ఉన్నారు. జల శాస్త్రంలో మీరు-చదివి ఉండవచ్చు. ఫలితశక్తి అనీ మొత్తం శక్తి అనీ ఒకశరీరంమీద మొత్తపుశక్తి (Total pressure) అనంతంగా; అధికంగా; అద్భుతంగా ఉండవచ్చు. కానీ ఫలిత

శక్తి (Resultant Pressure) ఏమీ లేకుండా ఉండవచ్చు-శూన్యం గావచ్చు.

భారతదేశంలో లక్షలకొలది బ్రహ్మాండమైన శక్తులు కలిసి పనిచెయ్యవు. ఒకశక్తి ఇంకొకదాన్ని నిరర్థకం చేస్తుంది. ఒకశక్తి ఇంకొకదానితో సమానబలంతో ఎదుర్కొంటుంది. కనుక ఫలితరూపకమైన జాతీయశక్తిలేదు. బాహ్యకర్మల మీద స్వరూపాలమీద ప్రేమను కేంద్రీకరింప జేసే మూఢ విశ్వాసం మతాచారాలమీద బాహ్యశరీరాలమీద అంధంగా భావాలను కేంద్రీకరింప జేయడం దృశ్యాలయొక్క యథార్థత లోఉంచిన అజ్ఞాన దృఢవిశ్వాసం పరిస్థితుల కాఠిన్యత ఇవన్నీ జాతిపై పమ్యాన్ని కులభేదాన్ని సంఘర్షదేశాన్ని తెచ్చిపెట్టనవి. అందువల్ల ప్రజలు తమ మనస్సులన్నీ ఒకచోట కలిపి అఖండమైన బ్రహ్మాండశక్తిని ప్రభవింప చేయలేకపోతున్నారు. అఖిల దృశ్యభేదాలను నాశనంచేసే అంతర్గత ఏకత్వాన్ని అద్వైతాన్ని అనుభవంద్వారా తెలుసుకోవడంవల్ల జాతికి ఆ బ్రహ్మాండశక్తి అధికమవుతుంది. ప్రజాసామాన్యంలోని యీ అనుభవ వేదాన్త విహీనత భారతదేశాన్ని స్వయంవిరుద్ధంగా విభజింపబడ్డ గృహంగా చేస్తున్నది. అసంఖ్యాక సంఘాలమధ్య ఉన్న బాంధవ్యాలు బిగదీయబడ్డవి.

ఇదే భారతదేశంలో ఉన్న చెరుపు. అదిగాక బ్రిటిష్ ప్రభుత్వంవల్ల ఈ భేదభావన ప్రోత్సాహింప బడిందనేవిషయం రాముడు దాచి పెట్టడు. 'భేదించు-గెలువు' అనే పరిపాలకుల పద్ధతి హిందూమహమ్మదీయుల మధ్య ఇంకా హైందవ వివిధ

సంఘాలమధ్య ఉన్న అఖాతాన్ని విశాలం చేస్తుంది. ఆధ్యాత్మికంగాగానీ రాజకీయంగా గానీ సాంఘికంగాగానీ ఇంక ఏవిషయంలోనైనా భారతదేశం సంరక్షింప బడాలెనంటే ఏది భేదాన్ని తొలగిస్తుందో కులభేదశిరం మీద ఏది దెబ్బకొడుతుందో అసూయా సోమరితన భూతాలమీద ఏది చావుదెబ్బ కొడుతుందో ఆలాంటి విజ్ఞానం వల్లనే కావాలి. ఈదురాచారాలు భారతవర్షంలో నిర్మూలం చెయ్యాలె. ఆమె ప్రబుద్ధం కావాలని మనం సంకల్పిస్తే ఆమె బ్రదుకుతుంది. అన్నిజాతుల మధ్య తన జాతిని నిల్పుకుంటుంది. ఇంగ్లాండు అమెరికా దేశాల యొక్క ఆనందకేంద్రంగా ఉంటుంది. ఎవరైనా మనిషి జబ్బున పడితే అంతఃప్రకృతికి దోహదమిచ్చి సహాయంచేసే మందులు ఇవ్వడంవల్లనే మనం వాటిని బాగుచేయగలం. అంతఃప్రకృతే అతడిరోగాన్ని నయంచేసేది. ఔషధాలు బాహ్యోపయోగాలు మాత్రమే. అవి ప్రకృతికి సహాయం చేస్తవి. ప్రకృతి నయం చేస్తుంది. అదేవిధంగా భారతదేశం బాగు పడాలనంటే మీరామె అంతర్జీవన విధానాన్ని బలపరచేటటు వంటి ఆమె అంతఃప్రకృతిని బలపరిచి ఉత్సాహం కలుగజేసే దేదైనా మీరామెకు ఇవ్వాలె.

భారతదేశపు రోగాలు, కష్టాలు మీ ముందర పెట్టబడినవి. తరువాత మనం వాటికి వివిధోపశమన సూచనలు ఆలోచిద్దాము. నీతులు, నియమాలు, విషయాలను చక్కబరుస్తవని ప్రపంచం అనుకుంటుంది. అనేక మతాలు నమ్ముతాయి. అనేకమంది నీతిశాస్త్రజ్ఞులు అంటారు. అది ఎప్పటికీ

జరగదు - జరగదు - ముమ్మాటికీ జరగదు!!! ధర్మనియమాలు, కట్టుబాట్లు, ప్రవర్తన విషయకరమైన కృత్రిమ నియమాలు, అసహజనీతి, ఎప్పుడూ విషయాలను బాగుచేయలేవు. ఈ విషయం గుర్తుంచుకోండి. "ఇది చెయ్యొద్దు" 'అది చెయ్యి' - యిలాంటి వెప్పుడూ సంస్కరణం తేలేవు. ఈ చట్టాలు, ఈ మేధాయుక్తమైన సలహాలే విషయాలను వంచగలిగితే, వాగ్దత్తమైన భగవదాజ్యం యిదివరకే చాలా కాలం క్రిందటే స్థాపింపబడి ఉండేది; ప్రపంచం స్వర్గంగా ఉండేది. ప్రపంచం ఇప్పుడున్నట్లు ఎందుకు వుంటుంది? ఇవి విషయాలను చక్కబెట్టలేవు. మీ శిక్షణ, మీ చెరసాలలు, మీ జైళ్లు విషయాలను సరిపెట్టలేవు. ఈ జైళ్ళూ, చెరసాలలు చేసే మంచిలో నమ్మడం పెద్ద తప్పని ఇవ్వాళ్ళ కాకపోతే రేపటికైనా ప్రపంచం తెలుసుకోవలసి ఉన్నది. దెబ్బలు, శిక్షణా, పాపాన్ని ఎప్పుడూ నిరోధించలేవు. సార్థకంగా విషయాలను సరిచేయాలంటే అవసరమైన విజ్ఞానాన్ని, విద్యను సజీవజ్ఞానాన్ని నీవు మనస్సుకు పట్టించాలె. యుక్తియుక్తమైన లేక అందమైన సిద్ధాంతాలతో మమ్ములను బాధపెట్టవద్దని జనమంటారు. ఇలాంటి వట్టిభావనలు ఇంక మావద్దకు తేవద్దంటారు.

ఓ మానవులారా; మిమ్మల్ని పరిపాలిస్తున్న దేమిటి? ప్రపంచాన్నేది పరిపాలిస్తున్నది? భావనలే- భావనలే_ నీఅంతర్జ్యోతే నీఅంతర్జ్ఞానమే. అది తప్ప ఇంకేవీ నిన్ను పాలించడం లేదు. జైళ్ళు, చెరసాలల్లో వేయడానికిబదులు, నేరగాండ్రకు

మీరు ప్రబోధించాలె. జగత్పాలన చేస్తున్న భగవద్ధర్మా లను మీరు వాండ్లకు తెలియ జెయ్యాలె. 'జ్ఞానమే ధర్మము' అని చెప్పబడింది. ఎంతనిజము! ఇక్కడొక శిశువుంది. నిప్పు ముట్టుకొని శిశువుచెయ్యి కాల్చుకుంటుంది. ఎందువల్ల? -నిప్పు కాల్తుందనిశిశువుకు తెలియదుకాబట్టి నిప్పుకాల్చుఁదనేసత్యాన్ని పసిబిడ్డకు తెలియజేయండి. ఆ శిశువింక నిప్పు మళ్ళీతాకదు. ఆధ్యాత్మిక ధర్మాలను ప్రజలకు తెలియచేయండి. మానవ జాతికి కాంతిని చూపించండి! ఇదే దీనికిమందు..

వేరే ఇంకొకమార్గంలేదు. ఆవిధంగా క్రైస్తవ పురాణ శిక్షలవల్ల, నియమాలవల్ల చట్టాలవల్ల భారతదేశమెప్పుడూ పైకిరాదు. సజీవమైయున్న ఒక సత్యజ్ఞానమే కావలసివుంది.

అమెరికన్లకు, యింగ్లీషువారికి మంచిఅందమైన గృహాలు ఉన్నవి. భారతీయులకో చాలా పేదయింద్లు. ఇదినిజం. కానీ ఇండియాలో పెద్ద పెద్ద సుందరమైన భవనాలుకట్టి అమెరి కాలోలాగాచేయడం వల్లవిషయాలు చక్కబడవు. చాలాచోట్ల పెద్ద పెద్ద రాజసౌధాల్లో భవనాల్లో వసించే మనుష్యులు సుఖంగా ఉండడంలేదు. పురుగులు, పాములు,అప్పుడప్పుడు సుందరమైన సమాధుల్లో(గోరీలు)నివసించడంలేదా?అదిచట్టం కాకపోవచ్చు; కానీ బాహ్యవైభవం, సంపద, ఆనందాన్ని ఇవ్వలేదు' అని చూపించడానికి కావలసినన్ని సాక్ష్యాలున్నవి. అది నిజం. ఈ విషయం ప్రపంచం తెలుసుకోకపోతే, దానికి ప్రపంచమే నిందార్హమైంది. భాగ్యము విషయాలను చక్క బెట్టలేదు. ప్రతివాడి చిత్తవృత్తికి అనుసరించని, ప్రతివాని

తలంపులతో కలిసిపోని విషయాన్ని రాముడు వేదాన్తంలో తెస్తాడు. కానీ భాగ్యం ఆనందాన్ని తేలేదనే విషయం నిజం. యూరప్ అమెరికాలు సంపదను అనుసరిస్తున్న పక్షంలో, దాన్నే ఆనందస్థానంగా చూస్తున్నట్లయితే, యూరప్ అమెరికాలు ఘోరమైన తప్పుచేస్తున్నవి. యూరప్ అమెరికాలు చేసే తప్పులను అనుకరించి భారతీయులు అభివృద్ధి పొందాలని రాముడు సలహాయివ్వడు. దాని స్వోపయోగంకోసం దాచబడ్డ భౌతికసంపద ఎవరివల్లా పొందబడలేదు. ఏజాతి లేక ఏవ్యక్తి భూభాగ్యాన్నంతా కూడబెట్టాలని కోరకుండా ఉంటాడు? కానీ ఏకొద్దిమందో దాని అంత్యపరిణామాన్ని తెలుసుకున్నవాండు! సంపద ఎప్పుడు కృషి - ప్రేమలవెంట లేక కృషి ప్రేమవెంట అనుసరిస్తుంది. వ్యక్తంగానో అవ్యక్తంగానో ఈ విజయరహస్య సూత్రాన్ని - అనుభవ వేదాన్త శక్తిని ఎంత ఎక్కువగా పొందుతవో, ఆ జాతులే అంత అభివృద్ధి పొందుతవి. మూఢులు, అజ్ఞానులు, చెట్టును పోషించరు. కానీ పండు తినడానికి నోరుతెరుచుకొని ఉంటారు. కపటరాజకీయ వేత్తలు మూలసూత్రమైన స్వతంత్రము యొక్క ప్రేమయొక్క శక్తిని గుర్తించకుండా జాతీయోన్నతిని తేవడానికి ఆలోచిస్తారు. అవ్యక్తంగా ప్రతిజాతియొక్క, వ్యక్తంగా భారతదేశముయొక్క జీవనసూత్రం; అనుభవ వేదాన్తం, స్వతంత్రశక్తి, న్యాయము ప్రేమ అయివున్నది. భారతదేశపు అంతః ప్రకృతి దృఢపడాలె. ప్రతిదేశముయొక్క సాంసారిక సాంఘిక రాజకీయ, మతవిషయక మోక్షము, వేదాన్తాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడంలో ఉంది.

భారత దేశంలో ఒక విశిష్టత ఉన్నది. హిందువులు పట్టి మతపు మనుష్యులు కాకపోయినా, నిజానికి మతంలో వారి భక్తి అత్యధికంగా ఉంటుంది. అది సాంఘికమైనా, రాజకీయమైనా - అది ఏదైనాసరే, మతం పేరుతో కాకుండా నీవు దేన్ని వాండ్లలో వ్యాప్తం చెయ్యలేవు. భారత జాతీయ కాంగ్రెస్ లేక సాంఘిక రాజకీయ సంస్కరణానికి ఉద్దేశించిన ఏనిర్మాణమైనా ప్రజాసామాన్యాభిరుచిపాత్రం కాలేదు. వాండ్లహృదయాలకు తాకదు. దానికి కారణం మత ప్రవాహంలో నుండి రాకపోవడమే. ఆకారణంవల్ల, అనుభవ వేదాన్త ప్రబోధంకన్నా భారత దేశంలో సర్వవిధసంస్కరణాన్ని ప్రవేశపెట్టటానికి ఇంకొక తగిన మార్గం లేదు. అనుభవ వేదాన్తమే రాజకీయ, సాంసారిక మానసిక నైతిక స్వాతంత్ర్యాన్ని, ప్రేమను ప్రసాదిస్తుంది. అద్భుతంగా స్వేచ్ఛాశాంతులకు శక్తి శాంతులకు ధైర్య ప్రేమలకు ప్రీతిగల్పుతుంది. ఇదంతా మతంపేరట. ప్రతి హైందవుని హృదయానికి అతిసన్నిహితమైన శ్రుతి ఉపనిషత్తులపేరట. హిందువుకికి అత్యంత పవిత్రమైన వేదాలపేరట వేనికోసరం ప్రతిహైందవుడు తన ప్రాణాలన్నా అర్పించడానికి సంసిద్ధపడతాడో ఆవేదాలపేరట అనుభవవేదాన్తం ప్రబోధిస్తుంది. అయితే స్వతంత్రశక్తిప్రేమ ఉపనిషత్తుల నుండి గ్రంథాలను పీడించడంవల్ల పొందబడదు. అది అన్నిటిలాగా అక్కడ స్పష్టంగా ఉంది. వేదాన్తం ప్రజాసామాన్యానికి ఎందుకు యిష్టమవుతుందంటే అవివాండ్ల మతగ్రంథాలు ప్రబోధిస్తవి కాబట్టి విద్యావంతుడైన హిందు

వుడికి అది ఎందుకు యిష్టమంటే వేదాంతతత్త్వాన్ని ప్రతి పాదించని తత్త్వం ప్రపంచంలో లేదు. కాబట్టి వేదాంతానికి సత్యానికి దోహదంకాని శాస్త్రంలేదు కాబట్టి తమ శృతుల్లో శాశ్వతంగా పొంగిపోతున్న వేదాంతామృతసరస్సులు ఉంచు కున్న భారతీయులు బాధపడు తున్నారు అని చెప్పడంఆశ్చర్య కరం. ఆసరోవర జలాలు వారు త్రాగడం లేదు. ప్రపంచంలో కల్లా తమకత్యంత ప్రియమైన బైబుల్లోని భయంకర అజ్ఞానం వల్ల చాలారోజుల వరకూ రోమన్ కాథ లిక్కులు ఏవిధంగా బాధపడ్డారో, అదేవిధంగా వేదాంతజ్ఞాన పూర్ణ పాండిత్యాన్ని పొందినవాండ్లు కొందరు భారత దేశంలో ఉన్నారు. కానీ వాండ్ల పాండిత్యం అనుభవ శూన్యమైనది. గుణకార భాగ హార సంబంధ సూత్రాలు వల్లవేసి ఆ సూత్రాలు ఒకలెక్క లోనైనా అనుభవంలో పెట్టని విద్యార్థివంటి వాండు ఆ పండి తులు. ఒక్క పరిశోధనైనాచేసి చూడని రాసాయనికశాస్త్ర విద్యార్థిలాగా చాలామంది పండితులు వేదాంతపఠనంచేస్తారు. చాలామంది సన్యాసులుకూడా నిజమైన స్వాములు ప్రభువులు గా ఉండవలసినదిపోయి కులదాసులుగా ఉన్నారు ఇండియాలో కావలసినంత మంది పండితులు మీాకు కనబడతారు. అయితే వాండ్లలో చాలామంది కళాశాలల్లో పొగగుమ్మటాలు ఎక్క డం పడవలు నడపడం ఈతగొట్ట వలసిన విధానాలూ బోధించే జలశాస్త్రాధ్యాపకులవలెఉంటారు. ఆ అధ్యాపకులు బోధిస్తారే గాని ఒకసారైనా నీళ్ళమీాద యానంచేసియెరుగరు. అమెరికా దేశీయులైన మీారు ఆ జలశాస్త్ర పండితులుకాకపోవచ్చుగాక.

ఆజలశాస్త్ర పండితుడిలాగా సూత్రాలు రాకపోయినా అవ్యక్తంగా వాటిని అనుభవంలో పెట్టే నావికుల వంటివాండ్లు మీరు. ఓ అమెరికా దేశీయులారా! ఆవిధంగా మీరు భారత దేశాన్ని తద్వారా సకల ప్రపంచాన్ని వేదాన్త ఆధ్యాత్మిక శక్తితో అనుభవ శక్తులను మేళవిస్తూ యీ పూర్ణవిద్యను భారతదేశానికి తీసుకపోయి సేవించగలరా? భారతదేశంలో నేటి స్వాములు పండితులు తమజాతిపోయే సోమరినిద్రనుదీర్ఘం చేయడానికి జోలపాటలు పాడుతున్నారు.

పరిశ్రమ కళాశాలలు సంస్థలు ప్రారంభించడం వల్ల విషయాలు స్వస్థతపడతవని సూచింప బడింది. అట్లా జరుగుతుందా? జరగదు. అలాంటి సంస్థలు ఏదో కొంతవరకు తాత్కాలికోపశాంతి నిస్తాయి. కానీ అసలుకష్టం ఘోర బాధ, భారతదేశంలో పారిశ్రామిక కళాశాలలు పెట్టినంత మాత్రం నిర్వర్తితం కాదు. నేడు భారతదేశంలో కార్మికులు పనిచేసి ఎంత సంపాదిస్తారు. ఉదాహరణానికి కుమ్మరి వానిని తీసుకోండి. 20 కుండలు పళ్ళాలు చేస్తాడు. వానికోసం ఎంతో కాలం వినియోగిస్తాడు. 20 కుండలకు వచ్చేది నాల్గుదమ్మిడీలు 20 కుండలకు నాల్గు దమ్మిడీలు! కొందరు ఇతర కార్మికులు తమ దీర్ఘదైనిక కృషికి ఫలితంగా 20 దమ్మిడీలు (5 Cents) సంపాదిస్తారు. కాలేజీల్లో యూనివర్శిటీల్లో చదివి డిగ్రీలు పొంది, యం. ఏ; బి. ఏ; లాంటి రంగు రంగుల పట్టాలతో వచ్చిన పెద్దరకపు మనుష్యులు ఉన్నారు. నెలకు వాండ్లకు ఎంతజీతం వస్తుంది? మామూలుగా 60 రూపాయలకు

మించదు. అంటే రోజుకు 264 దమ్మిడీలు. ఇదైనా మామూలు యం. ఏ. పదవి పొందినవాడు పొందలేడు. మామూలు యం. ఏ. వాడు దినానికి షుమారు 180 దమ్మిడీలు సంపాదిస్తాడు. ఇదీ భారతదేశంలో పరిస్థితులు. అమెరికాలో, మీ సామాన్య కార్మికుడు రోజుకు ఎంత సంపాదిస్తాడు? దినానికి రెండు డాలర్లు. అయితే భారతీయులకంత తక్కువ ఆర్జనం ఎందువల్ల కలుగుతున్నది? వాండ్లు ధరించే గుడ్డలు చాలా చౌకవి. తినేతిండి చాల చౌకది. వాండ్ల గృహాలు చాలా పేదవి. వాండ్ల వసతులన్నీ అతిన్యూనంగా ఉంటవి. ఎందువల్ల? దేశంలో పెట్టుబడి చాలా తక్కువగా ఉందికాబట్టి. మీకు కనబడడంలేదా? పెట్టుబడి ఖాళీచేయబడుతున్నది. ఈ దేశంలోని అమెరికన్ ఇండియన్సుకు కార్లైజల్ ఇన్‌స్టిట్యూట్ (Carlisle Institute) నీగ్రోలకు టుస్కీజీ ఇన్‌స్టిట్యూట్ (Tuskegee Institute) ల మాదిరి పారిశ్రామిక కళాశాలలు, భారతదేశంలో స్థాపిస్తే నిస్సంశయంగా దానివల్ల కొంత మేలుకలుగుతుంది. ప్రజలకు కర్మచేయడం పని చేయడంబోధిస్తుంది. కానీ, ఎవరి అభివృద్ధికోసం, ఎవరిలాభం కోసం మన మీపని చేద్దాము? దయచేసి చెప్పండి. ఇంగ్లాండు పెట్టుబడిదార్లను ముఖ్యంగా స్తుతించడానికే భారతదేశంలోని పెద్ద వ్యాపారా లన్నీ ఇంగ్లీషు వ్యాపారస్థుల చేతుల్లో ఉన్నవి. భారతీయ వర్తకులు, పేరుకు మాత్రం వ్యాపారస్థులు. యూరప్, అమెరికా పెట్టుబడిదార్లు వాళ్ళను స్వప్రయోజనానికి ఉపయోగించుకుంటారు. పారిశ్రామిక కళా

శాలలు, శిక్షణకు, బదులుగా భారతీయులు పొందేదేమిటి? ప్రజలు లాభంపొందుతారా? వాండ్లు ఎప్పుడు మామూలు గానే బాధపడుతుంటారు. వాండ్ల ఆకటిమంట, క్షామమూ ఆవిధంగా చల్లారదు. పారిశ్రామిక కళాశాలలవల్ల పూర్ణోప శమనమార్గం దొరకదు. అయితే మనకేం కావాలె? మన కనేక విషయాలు కావాలె. కానీ ప్రస్తుతం తీరవలసిన ముఖ్య మైన అవసరం - అగ్రివర్ణాలను, వాళ్ళతోపాటు తక్కువ కులాలను విద్యనేర్పి, బాగా శిక్షణజేసి, వారిలో స్వేచ్ఛా శక్తిని జొనిపి, వారిని సత్యనిస్వార్థశక్తి పూరితులను చేయడమే. అదే అవసరం. ఈ పరిపూర్ణవిద్య, శిల్పాది విద్యలనుకూడా ప్రసాదిస్తుంది. కానీ ఒక్క పరిశ్రమలే ఈ పనిచెయ్యలేవు. పరిశ్రమలు రెండోతరగతివి; వాటికంటే ఉన్నతమైనది; అత్యంత శీఘ్రంగా వాంఛనీయము.

భారతదేశంలో కొద్దోగొప్పో, కావాలసిన మార్గాల్లో ఇంతకుముందే పనిచేస్తున్న శక్తులున్నవి. వాటి పనిని గురించి విచారిద్దాము. క్రైస్తవ మతబోధకులు అమెరికానుండివెళ్ళి, పూర్ణప్రయత్నంతో కులభేదాన్ని తీసివేయడానికి పనిచేస్తారు. ఆ విధంగా తమ అర్హత చూపిస్తారు. ప్రజలకు విద్యనేర్పడానికి ప్రయత్నిస్తున్నారు. నిమ్నజాతులకు, పంచములకు సహాయం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. వారి అర్హతలు ఎంతవరకు మంచివో మనం పరీక్షిద్దాం. నిమ్నజాతులకు ఏదోమంచి చేస్తున్నందుకు భారతదేశం వారికి కృతజ్ఞురాలు. ఎలాంటి - ఇతర పరిస్థితులలోనైనా, చదవడం వ్రాయడం నేర్పబడని

నిమ్న జాతులకు, కొంతవరకు వారు విద్య నేర్పుతున్నారు. అది నిజంగా మంచిపనే. మిషన్ కాలేజీలు, పాఠశాలలు, అగ్రవర్ణ ప్రజలకుకూడా ఉన్నతవిద్యను కరుపుతున్నవి. ఇంతకుముందే భారతీయులకు విద్యనేర్పే విషయంలో చాలా కృషిచేసి నందుకు అమెరికెన్ మిషన్లకు మనం నమస్కరించాలె. అయితే ఈ విషయంలో చీకటివైపుకూడా చూడకుండా మనం వదల కూడదు. భారతదేశానికి వెళ్లే ఆ క్రైస్తవమత ప్రచార కులు నెలకు 300 రూపాయలు జీతాలు తీసుకుంటారు. వారు దర్జాగా నవాబుల్లాగా జీవిస్తారు. ప్రజలమీద అధి కారం చెలాయిస్తారు. హిందూ కుటుంబాల్లో కలతలు, పోరా టాలు తెస్తారు. భారతదేశంలో అంతకుముందే పుడుతున్న అసంఖ్యాక కులాలకుతోడు, వాండ్లింకొక కులాన్ని తెచ్చిపెడ తారు. క్రైస్తవమతంలో కలిసిన భారతీయులు, మామూ లుగా హిందువులకు వ్యతిరేకిస్తారు. హిందువుల్లో వాండ్లు కలవరు. హిందువులు వాండ్లల్లో కలవరు. సంబంధాలు తెగి పోతవి. మధ్య ఏర్పడ్డ అఖాతం అతివిశాలమవుతుంది. అక్కడే అతినీచమైన అంతఃకలహం బయలు దేరుతుంది. ఆడపిల్లలు తమ తల్లిదండ్రులనుండి వేరుచేయబడ్డారు. భార్యలు తమ భర్తలనుండి విడదీయ బడ్డారు. క్రైస్తవులు, విద్యావిహీను లైన హైందవ ప్రజాసామాన్యంలో నీచమైన మూఢ విశ్వా సాలను, అంతకంటే నీచమైన క్రైస్తవాలయ మూఢ విశ్వా సాలతో పోగొట్టా లనుకుంటారు. క్రైస్తవ ధార్మికత్వం తీవ్ర విమర్శనాక్రియగా మారుతుంది. చిన్నపిల్లలను తల్లిదండ్రుల

దగ్గరనుంచి విడతీయడానికి లంచం ఇచ్చి, వారి కోమలమైన మెడలు క్రైస్తవాలయ మూఢవిశ్వాసాలనే కాడిక్రింద పెడు తుంది. అలాంటి పరిస్థితులలో మీ సార్థకమైన క్రైస్తవ మతం హైందవ హృదయంలో దురంతకుల వైషమ్య విధ్వంసనంలో చావకుండా మిగిలిన ఆ కాస్త సహోదరభావ బిందు లేశాన్ని ప్రేమనుకూడాదూరం చేయడంలో జాగ్రత్తతీసుకొంటుంది. ఇది చీకటిభాగం. ఆ విధంగా ఇది విషయాలను చక్కబెట్ట లేదని మనంకనుగొంటాము. ఎలాగైనా చాలా మంచి ఆశయాల కోసంలక్షోపలక్షల డాలర్ల ధనం వ్యయం చేస్తున్నందుకు అమెరికన్లకు మనం నమస్కరించాలె. అనుకున్న ఉపశమన మార్గం సరియైనదికాదు. అది విషయాలను ఇంకకొంచెం చెరు స్తుందనే యథార్థ విషయం వైపు మీ దృష్టి మరల్పటానికి రాముడు వాంఛిస్తాడు.

అనేక కారణాలకు బ్రిటిషు ప్రభుత్వం మనకు అభివంద నీయమైనది. భారత దేశంలో అసలుకులాన్ని పోగొట్టడంలో బ్రిటిష్ ప్రభుత్వం ఎక్కువ కృషి చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలో విద్యను ప్రోత్సాహ పరిచింది. బ్రిటిష్ప్రభుత్వం అక్కడ విశ్వవిద్యాలయాలు కళాశాలలూ స్థాపించింది.

బ్రిటిష్ ప్రభుత్వంవల్లనే హిందువులు తమ స్వశాస్త్రా లను సక్రమంగా పఠింపగలిగారు. ఇది అంతా కాంతి ఉన్న వైపుది. ఇక చీకటివైపు బ్రిటిష్ ప్రభుత్వం భారత సర్వస్వాన్ని ఖాళీచేసింది. బ్రిటిష్ గవర్నమెంటు, భారతీయులకు ఏదో కొంత పైపై అల్పజ్ఞాన విద్యాప్రదానం చేసింది; కానీ, అది

అన్నివిధాల హిందూదేశాన్ని దరిద్రంలో ముంచింది. తొందరలో ప్రభుత్వ కార్యక్రమం మారకపోతే, హిందువులు దరిద్ర సంక్షోభంచేత ప్రాణాలు విడిచే పరిస్థితిలోకి తెచ్చింది. హిందూదేశపు రాజకుమారులు, ప్రభువులు తమ అమూల్య సంపదనూ, శక్తినీ పోగొట్టుకొని, ఊరక గలగలలాడే బిరుదులతో వట్టి పేర్లతో కీలుబొమ్మలై ఉన్నారు. ఈ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రజల మానసికౌన్నత్యాన్ని ఏవగించడం ప్రారంభించింది. రాముడు భారతదేశంలో ఉన్నప్పుడు ప్రజాసామాన్యంలో ఉన్నత విద్య నాపడానికి ఎత్తుగడలు జరిగినవి. ఇప్పుడు యీ యూనివర్సిటీల్లో చెప్పేదేమిటి ? మృతభాషలు, అనిశ్చయతత్త్వం, గణితం, గతచరిత్ర, అవ్యవహారిక రసాయనశాస్త్రము, ఇంకా యిలాంటివిద్యలు. ఏయూనివర్సిటీలోనైనా ఏకళాశాలలోనైనా ఇంగ్లీషుతప్ప ఉపయోగకరమైన జీవభాష నేర్పబడడంలేదు. ప్రజలకు ఇంగ్లీషు నేర్పబడుతున్నది. ఎందుకంటే వాండ్లు ఆంగ్లేయోద్యోగుల క్రిందపని చెయ్యాలె. ఇంగ్లీషువారు ప్రజావాఙ్మయం నేర్పడానికి కష్టపడరు. తమ్ము సేవించడానికి వారిభాషే ప్రజలను నేర్చుకోండని కోరుతారు. గణితం నేర్పబడుతుంది. ఈయూనివర్సిటీల్లో గణిత పరిమాణం అమెరికాలో కంటే ఎక్కువే. తత్త్వశాస్త్రం అనిశ్చయ తత్త్వం. ఇతర వివిధశాస్త్రాలు చెప్పబడ్వుతవి. కళాశాలల్లో కూడా అనుభవ విజ్ఞాన శాస్త్రంగానీ లేక ఉపయోగకరమైన ఏకళగానీ బోధింపబడడం లేదు. వ్యవహార రసాయనిక శాస్త్రం బోధింపబడడం లేదు. నేత, గనులు త్రవ్వడం,

యూనివర్సిటీల్లో నేర్పరు. చిత్రలేఖనం కుమ్మరపని యంత్ర నిర్మాణ శాస్త్రము నేర్పబడడం లేదు, ఈ ఉపయోగకరమైన కళలుకూడా ప్రజలకు చెప్పరు. ఆయుధధారణ విషయంలో చెప్పనవసరం లేదు. ప్రజలు తమ గృహాల్లో ఏఆయుధమైనా ఉంచుకోడానికి వీలులేదు. కొంచెం పెద్దకత్తి తన ఇంట్లో ఐనా ఎవడు ఉంచుకోవడానికి వీలులేదు. కొంచెం పెద్దకత్తి ఎవడి దగ్గర ఉంటుందో వాడు జైలులో వేయబడతాడు. ఏకవచమూ కవాతూ అంగీకరింప బడదు. దీనివల్ల భారతీయ కళాశాలల్లో అత్యధికమైన జీతాలు గట్టగలిగిన ఏకొద్దిమంది ధనిక హిందువుల వలనో మహమ్మదీయుల వల్లనో పొందబడిన యీ నిస్సార విద్యావిధానాన్ని గురించి మీకు తెలుస్తుంది. భారత దేశంలో అద్భుత సంస్కరణా కార్యాన్ని చేస్తున్న కొత్తగా బయలుదేరిన ఉత్తమ మతసంఘాలు కొన్ని ఉన్నవి. కానీఅస్థిగత మైన వీరారాధన ప్రమాణాధికారవశ్యత, వాండ్ల నాయకుల పేరుతో రానిప్రతిదానిమీద వాండ్లకు అయిష్టం కలుగజేస్తుంది. ప్రతి సంఘమూ, ప్రతిఉద్యమమూ, పేర్లతో వ్యక్తిత్వాలతో చుట్టూ కంచె అల్లుకుంటుంది. తమ మృతనాయకుల వాక్యాలను, పనులనూ, భావి అభివృద్ధికి ప్రారంభవిషయాలుగా తీసుకోడానికి బదులు, వాటిని వాండ్లు చుట్టూ హద్దులుగా, ఆటంకాలుగా, కంచెలుగా చేస్తారు. ఆవిధంగా దేశీయ సంస్కరణా స్వరూపాలను, భారత దేశంలో ప్రవహింపకుండా చేస్తారు.

భారతదేశపు అస్వస్థతను గురించి మీకు చెప్పియుండ

టంజేత, అదిగాక ఏమిచేస్తే ఆవ్యాధి పోతుందో చెప్పియుండుట చేత, రాముడు మిమ్ములను భారతదేశవిషయం విచారించండి, విచారించండని అడుగుతున్నాడు. అదే ప్రథమంలో చేయవలసింది. భారతదేశాన్ని గురించి విచారించి, మనః పూర్వకంగా కార్యసన్నద్ధులైతే సర్వమూ చక్కబడుతుంది. "ఎక్కడ సంకల్పముంటుందో; అక్కడ మార్గముంది." భారతదేశానికి కొంత సేవచేయాలనే సంకల్పం పూనండి. మానవాభ్యుదయానికై మీరు భారతదేశానికేదైనా సేవచేయాలని తలుస్తున్నారా? హృదయ పూర్వకంగా మీరు భారతదేశాన్ని ప్రేమిస్తారా? అధఃపతిత జాతులకోసం మీప్రాణాలను బలిచేయడానికి మీరు వాంఛిస్తున్నారా? మీ జీవితాన్ని, కాలాన్ని ఆమెకు నివేదించడానికి వాంఛిస్తున్నారా? 30 కోట్ల జనాభా.

30 కోట్ల ప్రజానీకం- మనం వాండ్లను శిక్షణచేయగలం; విద్యనేర్పగలం; వాండ్లశక్తులను సక్రమ మార్గంలో పెట్టగలం. ఈ 30 కోట్ల ప్రజలు మీతో పనిచేయడానికి మొదలుపెడితే, మీ భావానుగుణ్యంగానే వాండ్లు ప్రవర్తించడానికి ప్రారంభిస్తే, మీ పథాల్లోనే వాండ్లమనస్సులు కూడా పనిచేస్తే మీరుమాత్రం సహాయం పొందినట్లుకాదా? భారతీయుల శక్తులు, మేధస్సులు నీచస్పర్థలలో, కష్టాలలో వ్యర్థము కాకుండా మిగల్చబడి, ఉన్నతాశయాల్లో, ఉత్తమభావాల్లో కృషిచేస్తుంటే, భారతదేశపు అసంఖ్యాక జనసమూహాంవల్ల, అమెరికాలోకంటె ఎక్కువమంది ఫ్రాన్క్లిన్లు (Franklins)

ఎడిసన్లు (Edisons) ప్రభవిస్తారు. భారతశక్తులను ఆ విధంగా ఉపయోగించడంవలన, ప్రపంచం శ్రీమంతంగాదా? ప్రపంచాన్ని భాగ్యవంతం చేయడానికి, మీతోటి మానవులకు సహాయం చేయడానికి, మీకు మీరు సహాయంచేసుకోడానికి, భారతదేశ విషయం విచారించండి. మీతో సమానంగా వాండ్లను తేవడానికి ప్రయత్నించండి. ఆ విధంగా మంచి జరుగుతుంది.

## భారతోన్నతికి సలహాలు

ఇప్పుడు, ఇది ఏవిధంగా చేయబడుతుంది. రాముడు చెప్పవలసినవి రెండు సూచన లున్నవి. మొదటిది, అమెరికన్లను; సత్యం కోసం ప్రాణాలర్పించే అమెరికనులను; ఇండియాకు పంపడం. అమెరికా తిరస్కృతులను మావద్దకు పంపవోకండి. అమెరికాలో ఏపనీ దొరకని ప్రజలను, ఇండియా నెత్తిమీద పెట్టవోకండి. సంఘంలో ఉన్న ఉత్తములను, అమెరికా దేశీయ శ్రేష్ఠులను ఇండియాకు పంపండి. వాళ్ళే భారత దేశానికి అవసరం. పంచముల మధ్య, అందరికంటే తక్కువ కులాలమధ్య పోయి పనిచేసే, నిస్వార్థకృషి చేసే ప్రజలు అక్కడికి కావాలె. ఈ శూద్రులు మిమ్మలను ఒహూకరించరు. వాండ్లు మీకు కృతజ్ఞతకూడా చూపించలేరు. ఎందువల్లనంటే, ఈ ప్రజలు నిరుపేదలు, అమాయకులు, అజ్ఞానులు, మీరు చేసినదానికి ప్రతిఫలంగా కట్టుకోటానికి మీకు గుడ్డలైనా యివ్వరు. తినడానికి భోజనమైనా పెట్టరు. ఎందుచేత? వాండ్లకే తినడానికితిండి, కట్టుకోటానికి గుడ్డలు లేవు

కాబట్టి. ఈ ప్రజలమధ్య దూకి పనిచేసే మానవులు, స్వయంగా తాము మాడైనా, ఈ దరిద్రజనానికి సహాయం చేసే మనుష్యులు కావాలె! అమెరికా దేశీయులు ఈ కార్యాన్ని చేకొనడానికి రారా! ఉత్తమమైన అమెరికానుండే త్యాగనిలయమైన అమెరికా నుండే వారు రావలసిఉంది. ఈ కార్యాన్ని స్వీకరించే ఉత్తమ కర్మ వీరులను రాముడు వాంఛిస్తాడు. అమెరికానుంచి ఇండియాకుపోయి మంచి మంచి బంగళాలల్లో ప్రభువుల్లాగా వసిస్తూ, ప్రజల మీద అధికారం చెలాయిస్తూ ఊరక ప్రాపంచక గౌరవ భోగాల్లో పొర్లాడే, క్రైస్తవమత ప్రచారకుల వంటి వాండ్లను కాదు రాముడు కోరేది. ఈ జనం భారతవిముక్తి కలిగించలేరు. సత్యంకోసం ప్రాణాలర్పించే త్యాగులు, యథార్థ కర్మవీరులు అంత్య జాతులతో కలసి వాండ్లతో నేల మీద పండుకొని, వాండతో చినిగిన గుడ్డలు కట్టుకొని వాండ్లతో మాడుతూ సంతృప్తి పడగలిగిన వాండ్లు, వారు పెట్టిన ఉడికీ ఉడకని ఎండిపోయిన రొట్టెముక్కలనే పంచుకొని తృప్తి పడగలిగిన ప్రజలే మాకు కావాలె. తమ ఇంద్రియ సౌఖ్యాలను మరచిపోయి, స్వార్థభోగాలను పరిత్యాగం చేయ డానికి యిష్టపడే ప్రజలు మాకు కావాలె. ఇప్పుడుమీరంటారు. "ఇది కష్టమైనపని. అది నెరవేర్చడానికి చాలా కష్టమైనపని" అని; అది నిష్ఫల ప్రయత్నమని అనవోకండి. దానికి తగినంత ఫలమున్నది. ఇంకొకమనిషిని మనం ఉద్ధరించాలని ప్రయత్నం చేస్తే, వాడు ఉద్ధరింపబడ్డా, ఉద్ధరింపబడకపోయినా, మనం

నిజంగా ఉద్ధరింపబడతామని స్వానుభవం చూపుతుంది. చలనమూ, ప్రతిచలనమూ, రెండూ సమానమైనవీ. వ్యతిరేకమైనవి. ప్రజలు ఇతర్లకు లాభం కలిగిస్తామనే ఉద్దేశ్యంతో ఒక పని మొదలుపెడడం, మిథ్యాహేతువు; తెలివి తక్కువ ఊహ. రాముని ఉపన్యాసంవల్ల, మీ అమెరికన్లు మంచి పొందినా పొందకపోయినా, రాముడు వారివల్ల లాభించాడు. అదే తగిన ప్రతిఫలం. ప్రతివాడి అనుభవం యిది రుజువు చేస్తుంది. ప్రతిఫలాసక్తి లేకుండా, ఈ పనిచెయ్యి. నీ కర్మే దాని ప్రతిఫలంగా ఉంటుంది. నిస్వార్థకర్మకు భగవంతుడు ఋణపడతాడు. భగవంతుడు, వడ్డీతో సహా దాన్ని తిరిగి చెల్లించడానికి బద్ధుడు. అమెరికా దేశీయులారా! భారత దేశానికి వెళ్ళి, ఆత్మజ్ఞానాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని, వేదాన్తాన్ని ప్రబోధించండి. క్రిందటిరాత్రి మీరు 'విజయ రహస్యం' మీది రాముడి ఉపన్యాసం విన్నారు. ప్రపంచంలో విజయరహస్యం, అనుభవవేదాన్తమే, అంతకన్నా ఇంకొకటి లేదని అందులో రుజువు చేయబడింది. అది ఒక్కటే విజయ రహస్యం. ఆ వేదాన్తాన్ని తెలుసుకోండి! స్వయంగా తెలుసుకోండి! దాన్ని సేవించండి! అక్కడికి వెళ్ళండి; మీరు పెదిమలు కదలించ నవసరంలేదు. మీ ప్రవర్తనే, మీ వైఖరే, మీ శీలమే వాండ్లను సంస్కరిస్తుంది. భారత దేశానికి పోయేవారు. ముఖ్యంగా చేయవలసిన ఘనకార్యం, హిందువులలో, సాహసశక్తిని పురికొల్పడం. పాపం ఆ దురదృష్టవంతులు, విశాల జగత్తులో నివసించరు; దరిద్రకరమైన

సంకుచిత స్వనిర్మిత ప్రపంచాల్లో (జీవసృష్టి) నివసిస్తారు. ప్రతిబంధకరమైన కులవ్యవస్థ, భారత భూమికి వెలుపల అడుగుపెట్ట నివ్వదు. పరాయి దేశాలకు పోవడం చివరకు పడవలెక్కడం ఖండితమైన పూర్వాచారానికి విరుద్ధమే. ప్రస్తుతం పూర్వాచారాన్ని వదలడానికి ధైర్యం సమకూర్చు కున్న ధనిక హిందువులు ఇతర దేశాలకు ముఖ్యంగా ఇంగ్లాం డుకు విద్యాభ్యాసానికి వెళ్ళుతారు. అక్కడ వేలకువేలు ధనం ఖర్చుపెడతారు. తరువాత మామూలుగా ఆరితేరిన వకీళ్ళగా న్యాయవాదులుగా తయారై ఇండియాకు తిరిగి వస్తారు. బహి రంగంగానో చాటుగానో వ్యాజ్యాలు పెంచి పల్లెటూరి బీద రైతులను పీడించి పిండి ఆరూపకంగా వచ్చినధనాన్ని పగిలి పోయే గాజుసామానులు, కత్తులు, జలతారు జాలరులు, లేక పోతే ఇంగ్లీషు చిత్రాలు వాటితో నాశన హేతువులైన ఇంగ్లీషు పానీయాలకోసరం వ్యయంచేస్తారు. పేదరికమూ ఆకలీ పెరుగు తున్న కొద్దీ తగాదాలూ వ్యాజ్యాలు పెంచుకొంటున్న ఆ మలమలమాడే నిరుపేద కష్టజీవులవద్ద దోచుకున్న ధనం ఎంత దురంత నిష్ఫల వ్యయం చేస్తున్నారు.

భారత దరిద్ర జాతుల్లో జపానీయుల సాహసశక్తిని ప్రబోధం చేయవలసిన ముఖ్యావసరం ఒకటి ఉన్నది. జపాను బాలురు ఒక్క నౌకాయాన ఖర్చుతో అమెరికాకు వస్తారు. అమెరికా దేశీయులైన పెద్ద మనుష్యుల యిండ్లల్లోపనిచేస్తారు. అనేక రకాల విద్యాలయాలకు ఎలాగోపోతారు. ఈవిధంగా అమెరికాలో కొన్ని సంవత్సరాలు కాలంగడిపిన తర్వాత తమ

జేబులనిండా రూపాయలతో, తలకాయల నిండా విజ్ఞానంతో వారు జపానుకు తిరిగి వస్తారు. భారతీయులకు బోధించేటప్పుడు, వారిఅంధ విశ్వాసాలను, ఒక స్థలానికి అంటిపెట్టుకొని ఉండడం, కులంవల్ల ఒక స్థలానికి స్వయంగా నిర్మించుకొన్న దాస్యాన్ని మానండని చెప్పడం మంచిది. తమ తాత ముత్తాతల దేశాన్ని వదలడం దైవద్రోహమని నమ్ముతారు. అందువల్ల వారు తమ్ముతాము స్వయంగా ఒక స్థలానికి దాసులుగా చేసుకుంటారు.

వారిని కాలానుసారంగా ప్రవర్తింపచేయడానికి, వారు పరదేశయాత్ర చేయడం యుక్తమని మనం బోధించాలె- యూరప్‌నుండి వలసపోయిన ప్రజలు అమెరికాకు వచ్చారు. యూరప్‌ను మించేటంతగా అమెరికాను ఔన్నత్యానికి తెచ్చారు. భారతీయులుకూడా వలసపోయి అమెరికాకు వచ్చినట్లయితే, ఇంకా ఇతర ప్రదేశాలకువస్తే, ఇండియాలో జీవన సమస్య తగ్గుతుంది. మిగిలినవాండ్లకు జరుగుబాటు బాగా ఉంటుంది. వలస వచ్చిన వాండ్లకూ అంతకన్నా బాగా ఉంటుంది. శారీరకస్థితి ఆరోగ్యంగా ఉండటానికి, రక్తం ప్రవహిస్తూ ఉండాలె. అదేమాదిరిగా, ప్రపంచారోగ్య సంరక్షణకు, లేక ఏ దేశసంరక్షణకైనా ప్రజలు సంచారం చేస్తూ, తిరుగుతూ తరచు పరస్పరం కలుసుకుంటూ ఉండాలె. అలాకాకపోతే, ప్రవాహం స్తంభిస్తుంది. మరణం వస్తుంది. మనం ఇంగ్లాండునుంచీ అమెరికానుంచీ పోయి, హిందువులను సంస్కరించడానికి ఎంత ప్రయత్నం చేసినా

మనం సత్యస్వాతంత్ర్యశక్తిని వాండ్లల్లో ప్రబుద్ధం చెయ్య లేము. కారణం - ప్రజలయొక్క చుట్టూఉన్న సామాన్య పరిస్థితులు వారిని స్తంభింప చేస్తున్నవి. అన్నివైపుల నుండి వచ్చే సూచనలు, ప్రజలను దుర్బలత్వంలో నిద్రపుచ్చుతవి. ఈ నిద్ర ప్రకంపించాలంటే, వాండ్లు దేశాన్ని వదలిపెట్టాలె. వాండ్లు అమెరికా, ఇతర దేశాలు పోయినప్పుడు, వాండ్లు ఏపుస్తకాలు చదువకపోయినా, వ్యాపారం నేర్వకపోయినా ఊరక విదేశనాగరిక జనుల్లో కలిసి వుండడంచేత, అవ్యక్తంగా ఇష్టమున్నా లేకపోయినా, స్వాతంత్ర్యశక్తిని పొందుతారు. వారి వీరత్వం అధికమవుతుంది. వారిస్థితి అతిశయించుతుంది. వారి భావాలు వికసించుతవి. ఇదే విద్యాభ్యాసం. పరదేశాలు చూడడమే విద్యాభ్యాసం.

ఇండియాలో, హిందువుగాని మహమ్మదీయుడుగానీ లేక సామాన్య స్వదేశీయుడు, ఏ యింగ్లీషు వ్యక్తిదగ్గరకుగానీ, అమెరికన్ వ్యక్తిదెగ్గరకుగానీ పోలేడు. తెల్లమనిషంటే భయపడుతాడు. 20, 30 అడుగుల దూరంలో నిలబడతాడు. కోటూ, బూటూ చూచి వణకిపోతాడు. రైలు పెట్టెలో ఎవరైన యూరోపియన్ కూర్చుంటే, అతని ప్రక్కన ఒక దేశీయుడు కూర్చోడానికి అనుమతి దొరకడం అరుదు. రైల్వే స్టేషన్లలో, ఆంగ్లేయులవల్ల దేశీయులు తన్నబడడం, వెడలగొట్ట బడడం, రాముడు చూచాడు. ఎవరైనా దేశీయుడు తనయింటివైపు రావడం, యూరోపియన్ చూచాడా, తన సేవకుణ్ణి పోయి తన్ని, అతణ్ణి

మొదబట్టి నెట్టి వెళ్ళగొట్ట మంటాడు. ఆ విధంగా, పరదేశీయులచేత, భారతీయులు బలహీనులైనారు. దుర్బలులైనారు. నిస్సారులైనారు. అదేకాకుండా, వారి స్వకులస్థులచేత, స్వదేశీయులచేత, "అతడు వేరు, నేను వేరు, వాడు నా శత్రువు," అనే భేదాలు అసూయ, కలతలు, కష్టాల్లో మగ్గిపోతున్నారు. అదిగాక ప్రభుత్వోద్యోగాలు, గవర్నమెంటు కులము, జాతి మొదలైన విచక్షణల క్రింద యివ్వడంచేత, కులభేదభావాన్ని ప్రోత్సాహపరుస్తున్నారు. తన తమ్ముణ్ణి తాను ప్రబల శత్రువుగాచూచే టట్లుగా పరిస్థితులు కల్పిస్తున్నారు. ప్రస్తుతభారత దేశ రాజకీయ సాంఘిక పరిస్థితి ప్రజల్లో స్వతంత్ర భావం మొలకెత్తడానికి అనుమతించదు. విద్య అంటే ఏమిటి? విద్య యొక్క పరమావధి స్వేచ్ఛ -- ఇంకేమీకాదు. విద్య నాకు స్వేచ్ఛ, స్వతంత్రం (మోక్షం) తేకపోతే,, ఛీ ఛీ--- అది నాకు వద్దు. అది నాకక్కర లేదు. విద్యనన్ను బంధంలోఉంచితే దానివల్ల నాకు ప్రయోజనంలేదు. ఆవిధంగా వాండ్లలో యథార్థవిద్య లేక స్వేచ్ఛ ప్రబుద్ధం చేయడానికి, వాళ్లచుట్టూ ఉన్నపరిస్థితులు మార్పుచెయ్యడానికి సహాయం చెయ్యాలి. అదిఏవిధంగా బాగుచెయ్యడం? అట్లా మార్పుచెయ్యడానికి ఒకమార్గం—అక్కడికిపోయి, వారికి ప్రబోధించడం.

### అవసరవాంఛ - తత్క్షణసహాయం

చాలాదగ్గరమార్గం ఒకటిఉన్నది. ఓ అమెరికా దేశీయులారా! సత్యన్యాయముల పేరట, మతతత్వముల పేరట, శాస్త్ర కళల పేరట, మీ పారిశ్రామిక, యాంత్రిక, ఇంకాఉపయోగ

కరములైన తదితర కర్మలలో, మీ కళాశాలలలో, ఆయుధ శాలల్లో ఇతరప్రదేశాలలో విద్య నభ్యసించడానికి హిందూ దేశ విశ్వవిద్యాలయ పట్టభద్రులు అమెరికాకు రావడానికి, వలయుధనాన్ని మీరు పోగుచేయలేరా? వారికివిద్యనేర్పండి. నేత, గనులు త్రవ్వడం, తదితర ఆవశ్యకళలను వారికినేర్పండి. ఇదే భారతదేశ సముద్ధరణానికి దగ్గరమార్గం. ఇక్కడ నిధుల నేర్పాటు చేయండి. భారతీయుల నీదేశానికి తీసుక రండి. అమెరికాలో విద్యనేర్చిన భారతీయులు, ఇండి యాకు తిరిగివచ్చి, పారిశ్రామిక విశ్వవిద్యాలయాలు స్థాపించగలరు. నిరుపేద జనుల బ్రతుకు తెరువులు వాళ్ళకు బాగా తెలుసు. భారతీయులభాష, ఆచార వ్యవహారాలు వాళ్ళకు తెలుసు. మీ అమెరికన్లకంటే, వారు భారత ప్రజలల్లో అధ్యాపకులుగా ఎక్కువపని చేయగలరు. అమెరి కను పండితులు ఉన్నత వంశస్థులకు మాత్రమే బోధించ గలరు. అంతకుముందే ఇంగ్లీషు నేర్చిన భాగ్యవంతులకు మాత్రమే వారు బోధించగలరు. నిరుపేదజాతులకు ఇంగ్లీషు తెలియదు. దరిద్రజనానికి బోధించడానికి, వారిభాషా విధానాలు తెలిసిన ప్రజలు మనకు కావాలె. భారతీయ సముద్ధరణానికి ఇదే అత్యంత ప్రయోజనకరమైన సక్రమ మార్గం.

భారతీయులు స్వతంత్ర అమెరికా తీరమున కాలు బెట్టినతోడనే, తమతో అత్యుత్సాహంతో కరస్పర్శనందుకో డానికి, సమానభావంతో స్వాగత మివ్వడానికి సిద్ధంగా

ఉన్న తెల్లదొరసానులను, పెద్ద మనుష్యులనూ చూడ గానే, వారి భయాలు పారిపోతాయి. ఇంక తెల్లవాళ్లంటే బూచులనేభావం పోతుంది. పరస్పర విశ్వాసం కుదురుతుంది, మాయాచ్ఛాదనం పటాపంచలవుతుంది. స్వాతంత్ర్యేచ్ఛ స్వయంగానే పుడుతుంది. అమెరికా శిక్షణ పొందిన భారత పట్టభద్రులను, తమ మాతృదేశంలోనికి కార్య స్వాతంత్ర్య ప్రచారకులుగా తిరిగి వెళ్ళనివ్వండి. వారిచే శాస్త్రకళల శుభసందేశాన్ని ఇండియాలో ప్రబోధితం కాని వ్వండి. తమ స్వదేశంలో అనుభవ వేదాన్త వ్యాపనకు భారతప్రజలను సహాయం పొందనివ్వండి. ఈ విధంగా గాయం మానిన వెంటనే, పై చెక్కుదాని అంతట అదే రాలిపోతుంది. ప్రజలు యుక్తవిద్యావిధానాన్ని పొందినప్పుడు, తక్కిన కష్టాలు వాటంతట అవే మాయమౌతవి. మీరు భారతపట్ట భద్రులను కొందరిని ఇక్కడకు రప్పించి, రెండు మూడు సంవత్స రాలు వాండ్లకు విద్యనేర్పి, సూచనలిస్తే, ఈ ప్రజలు భారత దేశానికి తిరిగివచ్చి, వెంటనే పనిని ప్రారంభించగలరు. తమకూ బీదప్రజలకూ ఉపయోగకరమైన పనినిగానీ, వ్యాపారాన్ని గానీ స్థాపించ గలరు.

అమెరికాదేశపుఒక్క పెట్టుబడిదారుడైనా ఈ ఉత్తమ కార్యానికి పూనుకోగల్గితే, భారత విశ్వవిద్యాలయ పట్టభద్రు లకు అమెరికాలో విద్యనేర్పడానికి తాను $1,000,000 లు పెట్టు బడి పెట్టబోతున్నానని నిలబడి చెప్పవచ్చు. మీలో ఒక్కడైనా ఈ రోజున ఆ ఘనకార్యాన్ని స్వీకరిస్తే, ఆ పని గ్రహించి

100,000 లైనా పెట్టుబడిపెడితే, అమెరికాలో బీదభారతీయులను చదివించడానికి మనం తగిన విద్యార్థి వేతనాలు (Scholar ships) స్థాపించ గలం. రాముడు, అమెరికా దేశ ముద్రాపకులకు మనవి చేస్తున్నాడు. రాముడు అమెరికా దేశపు ప్రతివారికి విజ్ఞప్తి చేస్తున్నాడు, మీలో ఎవరైనా ఒకరు ముందుకు వచ్చి, ఈపని స్వీకరిస్తే మీరు సమస్త ప్రపంచానికి సహాయం చేస్తున్నట్లే. ఇక్కడ సమావేశమైన వారిలో, ఒక్కరు కూడా అంత ధనికులు కాకపోతే,— మీ ధనిక మిత్రులతో ధనికులైన మీ పొరుగు వారితో యీ విషయాన్ని తెలియ జేయలేరా? రామునితో ఒక్కసారి సమాలోచించడానికి మీరు మీ ధనిక మిత్రులను రమ్మని చెప్పలేరా? మీరు వేనకు వేలు ఇయ్యలేక పోయినా, మీశక్తి ఉన్నంత వరకు చందాలుగా ఇవ్వలేరా? చివరకు ఇంతమాత్రం మీరు చేయ గలరు. రాముడు తన తిండికేదైనా ఇవ్వమని వాంఛించడం లేదు. రాముడు తనకు కట్టుకోడానికి ఏవైనా గుడ్డలు ఇవ్వమని కోరడం లేదు. స్వార్థాశయం కొరకు, అది మిమ్మేదైనా అడిగితే, యీ పెదిమలు, నాశనం చెయ్యండి. దీనిలో రాముడి కెంత బాధ్యత ఉందో, మీకూ అంతే బాధ్యత ఉంది. రాముడు ఎంత భారతీయుడో, అంత అమెరికా దేశీయుడు. ఈ విశాల జగత్తు నా గృహం; మంచి చెయ్యడం నా మతం. రాముడి హృదయానికి కృష్ణుడెంత దగ్గరో, ప్రియమో. అంతే క్రీస్తుకూడా. రాముడికి శంకరుడెంతో బుద్ధుడుకూడా అంతే. రాముడు ఈమతానికిగానీ, ఆమతా

నికిగానీ సంబంధించిన వాడు కాడు. రాముడు నీవే. నీవే సత్యం! సత్యంపేరట, న్యాయంపేరట, మానవజాతి పేరట, అమెరికా స్వాతంత్ర్యంపేరట, ముందుకు దుముకడానికి మీరు ప్రార్థితులు. భారతదేశాన్ని గురించి విచారించండి! మీరు ఏమిచేయదలచారు? కొందరు కలంతో సహాయం చేయగలరు. కొందరు వాగ్రూపకంగా సహాయం చేయగలరు. కొందరు యీ విషయమై తమ తమ స్నేహితులతో చెప్పి, ఉపన్యాసా లిచ్చి సహాయం చేయగలరు. కొందరు కాయకష్టంతో, కొందరు ధనంతో సహాయం చేయగలరు. అమెరికా దేశీయులారా! ఈ సమస్యా నిర్వహణంలో, ఏమార్గంలో మీరు సహాయపడడానికి ఉత్సహిస్తున్నారో ఇప్పుడు చెప్పండి. మీరెట్లు సహాయపడతారు? ధనికులు ధనసహాయం చెయ్యాలి. పీరులు భారతదేశానికి బోధకులుగావెళ్ళి, అక్కడ ప్రజల్లో కడజాతివారి మధ్యనైనా పనిచేయడానికి, ముందుకునడవాలి. ప్రజ్ఞాశాలురైన వక్తలు ఈ కర్తవ్యాన్ని గురించి తమ ధనిక మిత్రులతో మాటాడాలె. ముద్రణాలయం, కలంతో యీ విషయాన్ని గ్రహించాలె. ఎవరైతే సహాయము చేయదలచుకున్నారో, సత్యంమీద మనఃపూర్వకమైన పట్టుదలగలవాండ్లు, ఆత్మాభిమానులు, అందరూ రామునివద్దకువచ్చి, తమపేర్లను చిరునామాలను, ఇవ్వడానికి, ఏవిధంగా తాము సహాయంచేస్తారో వ్రాయడానికి ప్రార్థితులు. ఎవరైనా కొంత ధనాన్ని యివ్వదలిస్తే, ఆ ధనం ధర్మకర్తల చేతులలో ఉంచబడుతుంది. అమెరికావారే, మీవారైన అమెరికావారే; ఆరోగ్యాన్ని

దాచుతారు. మీరువచ్చి, ఇతర విధంగా సేవజేయ దలచినవారు, కార్యాన్ని క్రమవిధానంలో ప్రారంభించ డానికి నిర్దుష్టమైన ఏర్పాట్లు చేయండి. మీరు ఏమిచేయ దలచారు? ఇది భారతదేశపక్షాన అమెరికన్లకు రాముని విజ్ఞాపన- రాముడికి దానితో వ్యక్తిగత సంబంధములేదు. రాము డెక్కడవున్నా స్వతంత్రుడే! రాముడేవిశేషంగా బంధింప బడలేదు. సకల ప్రపంచాలు రాముడివే. రాముడెక్కడ బట్టినా నివసించగలడు. కాని - చూడండి. ఇండియా మీ స్వంతపాదాలు. మీరు శిరస్సు. పాదాలను మరువవద్దు: పాదాలు పుండుబడి బాధపడుతుంటే. మీరు క్రిందబడతారు. భగవంతుడు భారతీయ స్వరూపంతో ఆకలిగొని వస్తాడు. అతకిని అన్నం పెట్టండి. పరమేశ్వరుడు హిందూ శరీరా లతో దిగంబరుడై మీవద్దకు వస్తాడు, వానికి వస్త్రప్రదానం చెయ్యండి. ఈశ్వరుడు, బాధిత దరిద్ర ప్రజారూపంలో మీదరికి వస్తాడు. వానిని సేవించండి! మీరు ఉత్తమ ధర్మ గుణాలతో ప్రేమతో ధన్యులుగావడానికి; ఆప్రజలు అజ్ఞానంలో పడి బాధపడుతున్నారు. మీరు రక్షింపబడడానికే, వారు పతితులైనారు. మీరు మీ ఉన్నత భావాలను, ఉదాత్త ప్రయత్నాలను ఉపయోగించే తరుణం పొందినందుకు మీ అదృష్టాలకు నమస్కరించండి. ఈ అవకాశాన్ని ఉపయో గించుకోండి. సంతోషంతో, ఉత్సాహంతో వారికి చేయూత ఇవ్వండి !

అమెరికా చైనీయులను, జపానీయులను, ఎట్లయిండి

యనులను, ఇంకా నీగ్రోలను, విద్యాభ్యాసం చేయిస్తున్నది. అమెరికావారు జంతువులయెడ కాఠిన్యత బాపడానికి సయితం ప్రయత్నాలు వీడడంలేదు. ఓ అమెరికావాసులారా! మీ స్వరక్త మాంసాలైన హిందువులను, అతి కృతజ్ఞులు, విశ్వాసపాత్రులు, ప్రేమస్వరూపులైన ఈ ఆర్యులను ఉపేక్షించవద్దు!

సూచన:—ఈ విషయాలను గురించి ఎక్కువ తెలుసుకోదలచినవారు క్రింది చిరునామాకు సంప్రతించండి.

రా మ స్వా మి.

c% డి. ఆల్బర్ట్ వాల్లర్, యం. డి.,
10/11 సట్టర్ స్ట్రీట్, సాన్ ఫ్రాన్సిస్కో.,
యు. యస్. ఏ.

---

ఈ ఉపన్యాసం మొదట అమెరికాలో ముద్రింపబడింది. తరువాత 1903 సంవత్సరాంతంలో (కలకత్తా) ఇండియన్ మిర్రర్ పత్రికా సంచికలో ప్రచురింపబడింది. తిరిగి, 1905 ఏప్రియల్‌లో సక్కూర్, ఎడ్వర్డు ప్రెస్ద్వారా ఒక కరపత్రంలో ప్రకటితమయింది. అప్పటినుంచీ, కొన్ని విషయాల్లో, భారతరాజకీయస్థితి మారడంచేత స్వామివారు చెప్పిన పరిస్థితులు యిప్పుడు కొన్ని లేవు. ||సం||

ఓం

# భారతదేశపు పరిస్థితులు - ఆర్థికవిశేషాలు

## (Facts and Figures About India)

భారతదేశ ఉపరితల వైశాల్యం రమారమి రెండు మిలియన్ల చదరపుమైళ్లు లేక అమెరికా సంయుక్త రాజ్యాల నుండి, అలాస్కా, ఆర్మీ, కాలిఫోర్నియాలను తీసివేస్తే మిగిలే దానితో సమానంగా వుంటుంది.

జనసంఖ్య ఇంచుమించుగా 300, 000 000 ఉంటుంది. లేక మనుష్య సంతతిలో షుమారు 1/5 భాగం ఉంటుంది. చదరపు మైలుకు 21.4 జనసంఖ్యగల అమెరికా సం॥రా. లకు పోటీగా యావత్తు రాజ్యమున కొండలు అడవులు, ఎడారులు కలుపుకొని చ॥ మై॥ కు 167 జనాభా కలదు. భారతదేశంలో కొన్నిభాగాల్లో, ప్రపంచంలోని ఏ యితర భూములకైనా వలన పోవలసినంత జనాభాకలదు.

హిందూదేశంలో అన్నిరకాల శీతోష్ణస్థితి ఉన్నది. ఈ దేశపు ఒక భూభాగం, ప్రపంచములోకెల్ల ఉన్నత వర్ష పాతాన్ని సూచిస్తున్నది. మిగతా కొన్నివందల వేలచదరపు మైళ్ల ప్రదేశంలో, వానచినుకు పడడం అరుదు.

180 వివిధభాషలు, భారతదేశంలో మాటాడబడు చున్నవి. వీటిలో 59 భాషలు, ప్రతిదీ 100000 మందికి మించిన ప్రజచే మాట్లాడబడుతున్నవి. 2000000(2మిలియన్లు)కు పైగా, క్రైస్తవులున్నారు. వారిలో 10 లక్షలకు మించి రోమను క్యాథలిక్కులున్నారు. వీరిలో 453,612

మంది యింగ్లాండు మతానికి, 322,586 గురు పూర్వాచార గ్రీకుమతానికి, సంబంధించిన వారున్నారు. 220,863 మంది బాప్తిజంను పొందిన వారున్నారు. 155,455 లూథరన్లు, 53829 ప్రెస్బిటేరియనులూ, 157847 నానా రకాల క్రైస్తవులు వున్నారు. విదేశజనాభాను, బ్రిటిషు సైన్యాన్ని, విదేశమత ప్రచారకులనూ, కలుపుకొని కొంతమట్టుకు 2000000కు పైగా క్రైస్తవులున్నారు. ఈ విధంగా క్రైస్తవ మతాన్ని పొందిన స్వదేశీయులు ఎక్కువ సంఖ్యను చూపడం లేదు.

భారతదేశంలో, అన్యమతాల నుండి చేర్చుకోబడిన క్రైస్తవులు తక్కువ కులాలనుండి వచ్చినవారే. గొప్పకులాలు మొత్తంమీద ముట్టుకోబడలేదు. బ్రిటిషు ప్రభుత్వం, క్రైస్తవమతం కొరకు, సంవత్సరానికి, 4,500,000 రూపాయలు హిందూదేశ ధనాగారము నుండి ఖర్చు పెడుతున్నది.

జనాభాలో, తలకు సగటున రెండు ఎకరాల వంతున విశాల వైశాల్యంగల 546,224,964 ఎకరాలు, గడచిన సంవత్సరపు ప్రభుత్వపు లెక్కల ప్రకారం సాగుబడి క్రింద వున్నది. 22,000,000 కంటే మించిన ఎకరాలు సంవత్సరానికి రెండుకార్లు పండుతవి. 175,735,000 మందికి పైగా జనులు తమకాలమంతా వ్యవసాయంలోనే గడుపుతున్నారు. 25,468,000 మంది యించుమించుగా కంపెనీల్లో ఉద్యోగాలు పొందివున్నారు. పశుపోషణయందు 3,646,000 నిమగ్నులైయున్నారు. ఆహార మద్యాలు ఉత్పత్తి చేయడంలో

14,576,000 మందికి పనిగల్గుచున్నది. 11;220;000 గృహ కృత్యాల్లో పాటుబడుతున్నారు. 12,611,000 నేతపని చేయ డంలో, 361,000 గాజు, మట్టిసామానులూ; రాతివస్తువులూ తయారుచేయడంలోనూ, 3,285,000 చర్మకార వృత్తిలోనూ (వీరందరూ మహమ్మదీయులే) 4,293,000 కట్లను, పేమును, చాపలను తయారు చేయుటయందు (అందరూ మహమ్మ దీయులు) నియమింపబడివున్నారు. లక్షోపలక్షల హిందువులు ప్రభుత్వ దృష్టిలో "అవమానకరమైన వృత్తుల్లో"వున్నారు. వాండ్లుబొత్తిగా ఏమి చేయడంలేదు. వారు- తమ పెద్దలు చేసిన వృత్తులు చేయలేకపోతే, యింకేమీ చేయలేరు.

140,496,135 మంది భారతదేశపు మొత్తపుస్త్రీలల్లో 543,495 మందికి మాత్రమే చదవడం వ్రాయడం వచ్చు అంటే వెయ్యికి ఒక్కరుకూడా లేరన్నమాట. 300,000,000 మంది మొత్తం జనసంఖ్యలో 246,546,175 మంది అక్షరా స్యుల వెరశి సంఖ్యను సూచిస్తున్నారు.

క్రీ॥శ॥ 1900 లో 54000,000 మంది ప్రజలు కరువుచే పీడింపబడ్డారు. దర్బారుజరిగిన సంవత్సరంలో, 5,000,000గురు ఆకలిబాధచే మరణించారు. జీవితపు పెనగులాట ఏటేటా వృద్ధి అవుతున్నది. పారిశ్రామికాభివృద్ధి, రైలుమార్గవిధాన వ్యాపనమూ, త్వరత్వరగా అభివృద్ధి పొందుతున్న అన్య ధనోద్యోగ మూలములు ఉన్నప్పటికి, జీతాలు పెరగడా నికి బదులు తగ్గిపోతున్నవి.

భారతభూమిలో, 200,000,000మందికన్న హెచ్చు ప్రజలు రోజుకు 0-2-0 అణాలకన్నా తక్కువపైనే జీవిస్తున్నారు. 100,000,000 కన్న హెచ్చుగా రోజుకు 0-1-0 అణాకన్న తక్కువపైననే, ఆధారజీవులగుచున్నారు. 50,000,000కిపైగా దినానికి 4 పైసలకుతక్కువపైననే బ్రదుకుతున్నారు. కనీసము మొత్తం జనాభాలో 2/3 వంతు, మానవ శరీర పోషణకు ఆవశ్యకమైన అహారాన్ని చాలినంత, వాండ్ల జీవిత కాలంలో, ఎన్నడు పొందిఎరుగరు. దేశంలో అనేక భాగాల్లో, కుటుంబాలు ఎకరంలో 1/4 వంతు సగటుభూమిపై ఆధార పడడానికి ఒత్తిడి చేయుబడినవి. అనేక లక్షలమంది యకరం ½ పై ఆధారపడివున్నారు.

ఇండియా దేశపు ప్రత్తిచేలల్లో పనిచేసే మగవాండ్లు ఆడవాండ్లు నెలకు $ 1-50 కన్న ఎక్కువ సంపాదించలేక పోతున్నారు. క్షౌరానికి 4 దమ్మిడీలు యిస్తున్నారు. ప్రభుత్వ నియమితుడైన తపాలాజవానూ వార్తావాహకులూ, నెలకు రు 12 ల కన్న అధికంగా పొందలేకున్నారు. అంటే షుమారు 3 షిల్లింగులు దేహదార్ఢ్యతగలిగి నేర్పరులైన, యంత్రకార్య నిపుణులూ, తాపీపనివారు, వడ్రంగులూ, కమ్మరులూ నెలకు, 2 లేక 3షిల్లింగులకంటే ఎక్కువ సంపాదించలేకపోతున్నారు. అదిగాక చిరాగుమాస్తాలు,గుమాస్తాలూ నీడపట్టుఉద్యోగంగల యితర్లూ నెలకు 4 మొదలు 5 షిల్లింగులువరకూ సంపాదిస్తు న్నారు. హిందూ దేశంలోని వేతనపరుల నందరినికలుపుకొంటే

వారి నెలజీతం అమెరికాలోని సమానతరగతి పనివాండ్లు ఒక్క రోజుకు సంపాదించుదానికి షుమారు బొటాబొటిగా వుంటుంది.

దగ్గర దగ్గర మొత్తం జనాభాలో 2/3 వంతు మంది శ్రేయస్సుకు వర్షపాతంమీద ఆధారపడి వున్నారు. వాండ్ల ప్రాణాలకోసం కూడా అని చెప్పవచ్చు. కాలం వరుపైతే కరువన్నమాటే. కరువుకాలంకోసం ఆహారం కూడబెట్టటానికి చాలినంత సంపాదించలేకున్నారు. కరువు ఆహారం లేక కాదు. ధనలోపం చేతనే కలుగుతున్నది. మామూలుగా యిండియాలో ఒక ప్రాంతంలో కరువున్నప్పుడు; కావలసినంత; ఒకొక్కప్పుడు కావలసిన దానికంటే ఎక్కువ ఆహారపదార్థం దేశంయొక్క యితర పదార్థాలల్లో ఉత్పత్తి అవుతున్నది.

బ్రిటిషు ప్రభుత్వం, రైల్వే శాఖలనుండి; ఒక వారంలో ఖర్చులుపోను పొందిన లాభం 7;600;000 (మార్చి 24;1904తో అంతమొందే వారంలో) ఇది నిలకడగా వృద్ధి పొందు తున్నది. ఇండియాలోని ప్రభుత్వోద్యోగులలో 95 శాతము (95%) స్వదేశస్థులు. ప్రభుత్వోద్యోగులకు చెల్లించే యావత్తు మొత్తంలో 35వ శాతం మాత్రమే వాండ్లు పొందుతున్నారు. 100కి 5వంతులు ఉన్నటువంటి యింగ్లీషు ఉద్యోగులకు 65% జీతంగా పోతున్నది. విదేశ క్రైస్తవమత ప్రచారక సంఘాల ఆదాయం 1903 సం॥కి $20;298;057 ఇది ఎక్కువ భాగము; భారతదేశంలో ఉపయోగించబడింది.

1600 లో; £ 70;000 పౌనుల పెట్టుబడితో; యిండియాలో తూర్పుఇండియాసంఘం స్థాపించిన నాటినుండి; భారత

దేశంలో బ్రిటిషు పెట్టుబడిదారీ తత్వపు అంకురార్పణ చేయ బడింది. తూర్పు యిండియా సంఘము వ్యాపారము; 1833లో తుడిచి వేయబడింది. ఆరోజునుండి; 1858 వరకు; ఆ కంపెనీ ఇండియా పరిపాలకుడుగా మాత్రం ఉన్నది. 1958లో భారత విప్లవానంతరం; అసలు కంపెనీయే ఎత్తివేయబడింది. కాని; వారిపాలనావిధానంమాత్రము నిలచింది. వారి పెట్టుబడి; భారతదేశపు అప్పురూపంగా తీసుకోబడిన ధనంవల్లనూ; ఆ ధనంపై ఇండియా పన్నుల నుండి వసూలు చేయబడిన వడ్డీ చేతనూ; చెల్లిపోయింది.

రాజ్యము; తూర్పు యిండియా సంఘమునుండి; రాజు చేత కొనబడింది. కాని ఇండియా ప్రజలు కొన్నధనం యిచ్చి వేశారు. 1857సం॥ లో 51;000;000 పౌనులుగా ఉన్న అప్పు 1862 సంవత్సరానికి 97:000;000 పౌనులకు పెరిగింది. జయ ప్రదమైన 40 సంవత్సరాల శాంతికాలంలో; యిండియా ఋణం; క్రమేణా వృద్ధిపొందింది.1901 సం॥లో అది £ 200;000000 పౌనుల వరకూ పెరిగింది. ఆఋణముమీద భారత ప్రజలు; చెల్లించవలసిన సాలుసరి వడ్డీ మానము 3 లేక 4 మిలియనుల పౌనుల మధ్యగానీ 15 మొదలు 20 మిలియను డాలర్ల వరకు గానీ ఉంటుంది. ఈ మొత్తం, సాలుసరి వడ్డీ చెల్లించబడునట్టి వెయ్యిడాలర్ల ఋణానికి, సమానమవుతున్నది. ప్రపంచంలోని ఏదేశం ఇట్టి పనికి దేనికైనా తట్టుకొనగలుగుతుందా? స్వదేశ ఖర్చుల కోసం భారతదేశపు శిస్తులనుండి బ్రిటనుకు సంవత్స రానికి పోయేధనం £16;000;000వరకూ పెరిగిపోతున్నది. వాస్త

వంగా గొప్ప ఉద్యోగులనందరినీ కలుపుకొంటే; భారత దేశంలో యూరపియన్ ఉద్యోగుల జీతాలు £ 10;000;000 అవుతున్నవి. ఇండియాలో వసూలు అయ్యే శిస్తులో సగము అంటే £ 44;000000 పౌనులు ప్రతిసంవత్సరమూ యిండియానుండి ప్రవహిస్తున్నవి!

(సర్ రమేశ దత్తు సి.ఐ.యి, చే రచితమై; యింగ్లండులో ప్రకటితమైన; "ఇంగ్లీషు పాలిత యిండియా ఆర్థిక చరిత్ర" (The Economic history of British India) అనే గ్రంథం నుండి అధికారంపొంది; పై సత్యాలు యివ్వబడినవి)

1901 సం॥ లో ఇండియాలో ఉన్న విధవలసంఖ్య 5;439;360 వంగరాష్ట్రంలో బాలికా విధవలు 265;922 మంది ఉన్నారు.

---

ఓమ్

# సతీత్వమును గురించి

భారతదేశంలో భార్య గౌరవింపబడదని, ప్రేమింపబడదని ఇంగ్లండు అమెరికాలలో సాధారణంగా చెప్పుకుంటారు. ఇది చాలా దురుద్దేశ్యం. ఎందుకంటే ఈ దేశంలో కంటె ఇండియాలో భార్య యెక్కువగా ప్రేమింపబడుతుంది, గౌరవింపబడుతుంది. ఈ దేశంలో భార్యను బహిరంగంలో ప్రేమిస్తారు. ముద్దు పెట్టుకుంటారు. కాని రహస్యంగా భార్యను నిరాకరిస్తారు. భారతదేశంలో భర్త భార్యమీద బహిరంగంలో ఎక్కువ గౌరవాన్ని చూపించడు. కానీ హృదయాంతరాలలో ఆత డామెను అర్చిస్తాడు.

ఈ దేశంలో భార్యయొక్క బాహ్యాదరణే అంతరాదరణంకంటే అతి ముఖ్యం, కాని భారతదేశంలో అలా కాదు. భర్త బహిరంగంలో భార్య మీద ఆదరణచూపడు. కానీ భర్త ఆతని స్వమార్గంలో భార్యయొక్క అభి మతార్థాలకు సర్వం త్యాగం చేస్తాడు. ఆమె సౌఖ్యాభివృద్ధికి ఎలాంటి బాధలైనా భరిస్తాడు. కానీ వ్యత్యాసం ఇందులో నున్నది. అయితే ఈ దేశంలో పురుషులతో సమానంగా స్త్రీలు చదువుకొన్నారా? భారత ప్రజలు ఈ దేశంలో మాదిరి స్త్రీలమాత్రమైనా, విద్యనభ్యసించ లేదు. నేడు భారత దేశంలో దోషమంతా వివాహసంబంధ ద్వారం ముందర ఉంచబడింది. కానీ ఇది సత్యంకాదు, ఇది సరియైన సమస్యాపరిష్కారం కాదు.

ఇండియాలో పురుషుడు భార్యను, "నా భార్య" అని పిలవడానికి సాహసించడు, ఎవడూ భార్యను నాభార్య అని పేర్కొనడు. అలాంటి మాటలు అపవిత్రంగా, పవిత్రస్వరూపదూషణంగా, లజ్జాకరంగా భావింప బడతవి. భారతీయుడు ఈమాట లెప్పుడూ వాడడు. భార్యనుగురించి చెప్ప వలసి వచ్చినప్పుడు, "మాపిల్లవాడితల్లి, మా కృష్ణుడి తల్లి, మా రాముడితల్లి" అని చెపుతాడు.

"ప్లేగుతగిలిన పిల్లవాడుండే గుడిసె ఒకటుంది."

ప్లేగుతగిలినవాడి దగ్గరికి అతని కుటుంబీకు లెవరైనా పోవడానికి భారతచట్టం ఒప్పుకోదు.

అతని తల్లి ఆ ప్లేగుతగిలిన పిల్లవాడి గుడిసెదగ్గరికి వెళ్ళింది. ఎలాగో లోపలికి పోగలిగింది. ప్లేగుతో చావబోతున్న ఆపిల్లవాడికి సేవజేయడానికి, తా నసాయానికి గురికావడానికి సిద్ధపడింది, చివరకు ఆ కుర్రవాడితల్లి ప్రవేశం పొందింది. ఆ ప్రియకుమారుడు తన తల్లిపాదాలమీద తలపెట్టుకొని పండుకున్నాడు, చావటానికి సిద్ధంగా ఉన్నాడు. హిందూమత ప్రకారం, అది పవిత్రక్షేత్రంలో మృతినొందడం, క్రైస్తవుడు క్రీస్తు పాదాలమీద తలపెట్టి మరణించడం వంటిది. భారతీయ బాలుడు, తన తల్లి పాదాలమీద తలపెట్టి ప్రాణాలు విడవడం, అతిపవిత్రంగా ఎంచుతాడు.

ఈ దేశంలో భగవంతుణ్ణి మీరు తండ్రిగా, "స్వర్గంలో ఉన్నతండ్రి" గా అర్చిస్తారు. భారతదేశంలో, భగవంతుడు తండ్రిగానే కాకుండా తల్లిగాగూడ అర్చింపబడతాడు. 'మాత' అనేపదం భారత వాఙ్మయంలో అతిప్రియమైంది. 'మాతృశ్రీ' పరమదైవము - ప్రియదైవతం.

హైందవుడు, జబ్బుపడ్డప్పుడు, దుస్సహమైన బాధపడుతున్నప్పుడు, అతని నోటినుండి, 'హేభగవంతుడా' అని కాదు వచ్చేది. 'అమ్మా-అమ్మా' అని వస్తుంది. అంటే; 'మాతా, మాతా' అని అర్థం. ఇది అతని పెదవుల మీద ఉండేది. ఇదీ, హైందవుని హృదయాంతరాల్లోనుండి వచ్చేది 'అమ్మా' అనేమాట. హైందవుడి హృదయంలో; గాఢోద్వేగాన్ని కలిగిస్తుంది.

ఓం. ఓం. ఓం.

---

ఓం

# భారత స్త్రీత్వము

...............లండనులో ఒకానొక ఆంగ్లేయ యువతిచే నీయబడి భారతీయ పత్రికలో ముద్రితమైన ఒక ఉపన్యాసం నుండి, రాము డిప్పుడు చదువుతాడు. భారతదేశంలోని జీవనవిధానాన్నిగురించి, ఈ దేశంలో వ్యాపితమైన, అనృతభావాలను, చెడుతలంపులగురించి మీకు చెప్పడానికి రాముశ్రీ ఉపన్యాసంనుండి చదువుతాడు. ఇండియాను చూచిన వారు, ఏ పనిగూడా చేయలేరనే తలంపు కొందరి మనుష్యుల్లో ప్రబలి ఉంది. అక్కడ వర్ణవ్యవస్థ, ఏ అమెరికాదేశీయుడు, వారితో కలియడానికే వీలులేనంత తీవ్రపరిస్థితిలో ఉన్నదనే భావనతో కొందరు ఉన్నారు. భారతీయులతో ఏమాత్రం పరిచయం లేనివాండ్లు వ్యాపింపచేసిన ఉద్దేశ్యాలివి.

మనం ప్రేమించిన వాండ్లకోసం మరణించడం ఎంత ఉత్తమమైన విషయం, ఓహో! ఎంత బ్రహ్మానందం!

తాను ప్రేమించిన పదార్థంకోసం, ఎవరు ప్రాణా లర్పించడానికైనా సిద్ధంగా ఉంటాడో, అతడే ప్రేమించగలడు. అలాంటి ప్రేమే, ఒకణి జీవింపజేసి మహాసేవలుచేయిస్తుంది అలాంటిప్రేమనే భారతదేశం ఆశిస్తున్నది. ఆమె సేవకై అలాంటి స్త్రీపురుషుల ప్రేమనే భారతదేశం వాంఛిస్తున్నది.

భారతదేశంలో జీవనాన్ని చూడనటువంటి అక్కడ వసించనటువంటి ప్రజలచేత అనేక మిథ్యాసమాచారాలు వ్యాపితమైనవి. నీవొక పుస్తకం తీసుకొని దానిచుట్టూ నూనెగుడ్డ అతికించి నీళ్ళలో ముంచు. నీళ్లు పుస్తకం చుట్టు ఉంటవి. కానీ పుస్తకానికి నీళ్ళంటవు. ఆ విధంగానే ప్రజలు భారతదేశంలో వసిస్తారు. కానీ భారత ప్రజలతో వాండ్లు కలవరు. భారతప్రజలతో ఏకీభవించరు. భారతీయ పద్ధతిలో, భారతదేశంలో వసించిన ఒక స్త్రీ ఇక్కడ ఉన్నది. ఆమె దీనికి సాక్ష్యం. ఈ స్త్రీమాదిరే అమెరికనులను భారతదేశాన్ని దర్శించడానికి రాముడు కోరుతాడు. నిజ

పైన కర్మవీరుల్లాగా మీరు పోయినట్లైతే మీ జేబుల్లో డబ్బేమీ ఖర్చుపెట్ట నవసరం లేదు. అనేక లక్షల ప్రజలను వాండ్లు పోషిస్తున్నారు. అక్కడ ప్రజలు చాలా పేదలు, కాని మిక్కిలి ఉదారభావులు.

భారతీయ సాధువులు (Monks) తమ సొంత డబ్బు ఉంచుకోడం రాము డెప్పుడు చూడలేదు. వాండ్లు వీధుల్లో తిరుగుతుంటే తమ ఆకలి బాపుకోటానికి భిక్షకోసం వాండ్లలా చేస్తున్నారని మామూలుగా బోధ పడుతుంది. తమ ఇంటిముందు పోయే అన్నాతురులకు భోజనం పెట్టి తృప్తిపరచడం, భగవద్విధిగా ప్రతి భారతీయస్త్రీ గ్రహిస్తుంది. ఒక గృహిణి ఇంటిముందు సాధువు పోతుంటాడు, అతనికి పెట్టడానికి ఇంట్లో ఏమీ వుండదు. అప్పుడేమి జరుగుతుందో రాముడికి తెలుసు. ఆ బీదసాధువుకు పెట్టడానికి అన్నం లేనప్పుడు, ఆమె నేత్రాంచలాల్లోనుండి కరుణాశ్రువులు కాలువలై పారుతవి. ఆకలిగొని భైక్షుకరూపంతో పోయే ప్రతి వాడూ సాధువుగా చూడబడతాడు. సాధువంటే స్వామి అని అర్థం కాదు. నీవు భారతదేశంలో ఉండి ఆకలిగొని యుంటే,నీవు సాధువుగా గౌరవింప బడతావు. ఎవరికి డబ్బూ: కట్టుకోటానికి గుడ్డలు ఉండవో అతడలా సాధువే.

ఓం. ఓం. ఓం.

ఓం.

# శ్రీ రామతీర్థ ఉపన్యాసములు సంపుటం 7.

## తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | | మేధ్యానికి | మహాధ్యానికి |
| 7 | 20 | సహస్రసహస్రాధరణం | సహస్రాధరణం |
| 27 | 11 | తటంగాలతో | తతంగాలతో |
| 28 | 4 | అస్తమిసుంది | అస్తమిస్తుంది |
| 29 | 16 | అవమార్గం | అపమార్గం |
| ,, | 19 | ప్రివక్తనకు | ప్రివర్తనకు |
| 31 | 21 | యితర్లకున్నా | ఇతర్లకన్నా |
| 33 | 14 | వెళ్లల్లా | వెళ్లాలన్నా |
| ,, | 16 | కైతో | కైతే |
| 34 | 2 | ఉజ్వలద్ఞానం | ఉజ్వలజ్ఞానం |
| ,, | 3 | మరణం | కారణం |
| 35 | 6 | హంన | హంస |
| 41 | 5 | న్మృతి | స్మృతి |
| ,, | 8 | అడలు | అడవులు |
| 44 | 2 | మతంతో | మతంలో |
| 47 | 15 | స్తుంటే | స్తుంది |
| ,, | 20 | కారమాడల్ | కారమండల్ |
| 48 | 1 | కోను | కోడానికి |
| 62 | 5 | చెస్తే | చేస్తే |
| 63 | 7 | అలెగ్జాండరను | అలెగ్జాండరును |
| ,, | 10 | ఖేమ్యాన్ని | ఖామ్యాన్ని |
| 70 | 5 | అమరుచికోని | అమర్చుకోని |
| 72 | 22 | పతసానికి | పతనానికి |